# భారతి ముప్పది ఆరవ సంపుటము

## అ కా రా ది వి ష య సూ చి క

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1959



## జనవరి సంచికలో

# వార్తలు

## శ్రీ సంజీవరెడ్డికి కాంగ్రెస్ అధ్యక్షపదవి

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవ రెడ్డిగారు అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. ఆయనతో పోటీ చేయదలచినవారందరూ నామినేషనులు ఉపసంహరించుకున్నారు. శ్రీ రెడ్డిగారి పేరును శ్రీమతి ఇందిరా గాంధీ, పంత్, మొరార్జీలు ప్రతిపాదించారు.

## చైనా చర్యపై అమెరికా ఖండన

చైనా ఇండియా సరిహద్దువివాదంలో ఇండియా వాదం, హక్కులు సక్రమమైనవని అమెరికా అభిప్రాయపడుతున్నట్లు అమెరికా విదేశాంగమంత్రి శ్రీ క్రిస్టియన్ హెర్టర్ నవంబరు నెలలో వాషింగ్టన్‌లో ఒకపత్రికా ప్రతినిధులగోష్ఠిలో అన్నారు. చైనా బలప్రయోగం చేసిందని ఇది చాలా తప్పని ఆయన అన్నారు.

హెర్టర్ ప్రకటనపై అమెరికాలో పెద్ద గాలిదుమారం రేగింది. దానిపై హెర్టర్ భారత రాయబారి కార్యాలయం ప్రతినిధిని పిలిపించి తన ప్రకటనను విశదీకరించారు.

## కాంగ్రెసు అధిష్ఠానవర్గం తీర్మానం

చైనా - భారతదేశాల సరిహద్దు వివాదం విషయంలో భారత ప్రభుత్వం అనుసరించ నిశ్చయించిన విధానాన్ని, క్లిష్టపరిస్థితిని ఎదుర్కొనడానికి జరుపుతున్న చర్యలను కాంగ్రెసు అధిష్ఠానవర్గం నవంబరు 10వ తేదీన బలపరుస్తూ తీర్మానించింది. తగినచర్యలు తీసుకోవాలని, అయితే, అలాటి చర్యలవల్ల భారత దేశపు అఖండత్వానికి భంగం కలుగరాదని, ఏవిధంగాను దురాక్రమణను అంగీకరించినట్లు కాకూడదని ఈ తీర్మానంలో స్పష్టపరచబడింది.

## శ్రీ కురుగంటి సీతారామయ్యగారి మృతి

సుప్రసిద్ధ పరిశోధకులు, విమర్శకులు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు నవంబరు 4 వ తేదీన నాంపల్లి (హైదరాబాద్)లోని స్వగృహంలో మరణించారు. వీరివయస్సు 70 సంవత్సరాలు. వీరు నవ్యాంధ్ర సాహిత్యవీథులు, తంజాపురాంధ్రనాయక చరిత్ర మున్నగు గ్రంథాలు రచించారు. నవ్యసాహితీ సమితి మాజీ అధ్యక్షులు. పారిభాషికపదకోశ సంఘ సభ్యులు. వీరు లోగడ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. నిజాం కాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగ వున్నారు. తర్వాత, ఉస్మానియా విశ్వవిద్యాలయ తాళపత్రగ్రంథాలయంలో పరిశోధకులుగా ఉన్నారు.

## కూచిపూడి బృందం పర్యటన

కేంద్రప్రభుత్వం శాస్త్రపరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల శాఖ ఏర్పాటుచేసిన పథకం ప్రకారం ఆంధ్రప్రదేశ్ నుంచి కూచిపూడి నాట్యనటక బృందాన్ని కేరళ-మైసూరు రాష్ట్రాలలో పర్యటనకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పంపించనున్నది.

## ఆజాద్ కాశ్మీర్ మాజీ అధ్యక్షుని అరెస్టు

ఆజాద్ కాశ్మీర్ మాజీ అధ్యక్షుడు సర్దార్ మహమ్మద్ ఇబ్రహీం రావల్పిండిలో పాకిస్తాన్ సైనిక శాసనం క్రింద అరెస్టు చేయబడ్డాడు. ప్రభుత్వంపై అసంతృప్తిని, ద్వేషాన్ని రెచ్చగొడుతున్నాడన్న ఆరోపణపై ఈ అరెస్టు జరిగింది.

## తూకేర్ గ్రాం విముక్తి

అస్సాం-తూర్పు పాకిస్తాన్ సరిహద్దులో ఉన్న భారతగ్రామం తూకేర్ గ్రాం 14 మాసాల తర్వాత నవంబరు నెలలో మరల భారతదేశం అధీనంలోకి వచ్చింది. దీనిని లోగడ పాకిస్తాన్ పెక్కుసార్లు కాల్పులు సాగించి ఆక్రమించుకొన్న విషయం పాఠకులకు విదితమే. రాడ్‌క్లిఫ్ అవార్డు ప్రకారం మరి కొన్ని గ్రామాలపై అధికారం కూడా ఇండియాకే సంక్రమించింది.

## ఇండియాకు చెకోస్లోవాకియా ఋణం

భారతదేశంలో పరిశ్రమల అభివృద్ధి కోసం చెకోస్లోవాకియా భారతప్రభుత్వానికి 23 కోట్ల రూపాయలు ఋణమివ్వడానికి ఒడంబడిక జరిగింది. దీనిపై భారత పరిశ్రమలమంత్రి శ్రీ మనూభాయిషా, చెకోస్లోవాకియా విదేశ వ్యాపారశాఖామంత్రి ఎఫ్. క్రాసిర్ సంతకాలు చేశారు.

# విశ్వనాథ మధ్యాక్కరలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఎదలోని బాధకు భావనాదీప్తికిల్ల విరామ
ముదయిన యచ్చోటనో నిరాకార మూని యుందువని
మది నమ్మఁజాలనిఁక భావతీవ్రత మదిలోని నొవ్వు
సాద నీవు తోఁప శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఇది కాదటంచు నాబ్రదుకు నేను యథేచ్ఛంబుగాఁగ
బ్రదుకుచు మరి మధ్యమధ్య నీవు కనఁబడవంచుఁ దెనుగు
పదములు వ్రాయుచు నాటకంబుగా భావింతు నేము
సుకవికృతార్థ శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నా నమ్మక మ్మిది స్వామి నాథ నాదు జన్మములచేతఁ
బూని తా నియమితమయ్యె వాసుకిభోగికేయూర
దీనిచే నిన్ను భావింతు నైరమ్యకీయమౌ నరసి
పోనవ్వుగాఁగ శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నీలలోహిత ప్రొద్దుక్రుంకినంతనే నీ వా వెనుకను
వ్రాలివత్తువని యెఱుంగుదున యమ్మవారి వా నగలు
వ్రాలుచందమున రేక శుక్రగురువుంబాపిలీల్ పాప
నూలచేకట్లు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

ఒకనాఁడైనయంతలో నా మన స్ఫూరియూరియున్నయది
వనితాధనోహాలే యుప్పకార మావయు నూని యనఁగ
తనర బండను వేసి రాచినం బోదు దానిలక్షణము
సాన తావిచెడదు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

పిచ్చి తాఁ గుదిరినఁగాని యోస్వామి పెండిలి కాదు
పిచ్చి తాఁ గుదురదు ప్రాణనాయక పెండ్లైనఁగాని
హెచ్చి నిన్నూహింతు మనసుచేతనే యిది చావ దీవు
చొచ్చినఁగాని శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

చెట్ట యీ మనసున కయ్యె సిగ్గువచ్చియు సిగ్గురాదు
పట్టినచోటనే పాముకరచియుఁ బట్టు నచ్చోటె

చుట్టపెట్టి హరింపు నీవని మఱుగుచొచ్చితి నాత్మ
చుట్టమవంచు శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

ప్రళయమంబు లెన్నైనఁ గడచుదాఁక మార్కండేయునట్లు
ఇలమీఁద నుంచుమంచంటినా జన్మ లింకేమి నాకు
వలదంటినా నాదుతలపులో నీవు వచ్చి నిల్మంటి
చులుకచేసితినో శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

అనుభవస్మృతిఁ గాక పెద్దసుఖము లే దనుభవవేళ
ననుభవవేళయందు సుఖ మున్నచో నదియు భావనయ
పవిత్రభావన కింత హాయ మొప్పమా పరికరణకేలా
చానిపినా నీవు శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

నమ్మితి నుపనిషదర్థముల్ నిన్ను నమ్మితి నిన్ను
నిమ్మయు నమ్మనో నీవుచేసిన దేమియులేదు
నమ్మనప్పుడు చేయవాందురయ్యా యీ నాకు నిమ్మనన
సామ్ములు నీవి శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

ఏ వేళ నినుఁ జూచినానో యా వేళ నీకుండెకాయ
కావు నేసితి గంగుమారె వృంతమ్ము కపఁ జక్కపాడిచె
సేవింపఁగా నీవు నెంచవేలో వచ్చి మ రిందు కలిమి
చూపె మిక్కిలిగ శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

ఒకవేళ తేనెఅంగళయ సేవించుచుంటినేమో య
యకదాంబ ! సేవించనట్లుగ నభినయంబు చేయుచును
ముకుపుటంబునఁ బెట్టి యాఘ్రాణముం జేయునేమొ
సుకుమారమూర్తి శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

నీ వంగరాత్మలో నిలచి పలికిన నిగుడుయగ్నంబు
దేవి శారదగ భాసించె నా దేవి దేవ ! భవగ్న్ర
పాదృష్టిఁ దగు నాదు జిహ్వాగ్రుఁ జైకొ బాఁకిన నచట
చూపె నీయునికి శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

పరగ నా శారదాదేవి నీనుండి బయులు గేరినది
సరసిజభవురాణి యొక్క ధార నానన్నిధిఁ బ్రాఁకె
హాగ ! నన్ను నాధాగవెంట నీవద్ద కగు దేరనీవ
సురనదీదూాడ ! శ్రీశైలమల్లికార్జునమహాలింగ !

# శాకుంతలము: రవీంద్ర కవీంద్రుడు

శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు

ఇప్పటికి ఇంచుమించు రెండేండ్లక్రింద ప్రకటిత మగు మదీయ శాకుంతల రసాస్వాదిని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి చేత నుంచితిని. వారు నిజాభినందనమును తెలుపుచు, మహాకవి ఠాకూరుగారి శాకుంతల పరామర్శలను పరామృష్టము లైనవికదా అని యడిగెను. అందులకు నేను వారి పేరు కూడ ఉదాహరింపబడియే యున్నది అని యంటిని. అట్లే కదా,—'అది (శాకుంతలము) సాహిత్యం గోలిచిన తొంటి యాచార్యులకు ఆనందగర్భ వాభినందనపూర్వకులయు నేటివారకు ఆచరించిన ఘోషు ఠాగూరు రవీంద్రాదులచేయు బహుమానపూర్వక ప్రశంసల నందియున్నది.' అని. (రసాస్వాదిని—ఉపోద్ఘాతము-పుట-1.) ఐనను రవీంద్ర శాకుంతల విమర్శను అంతయు కాని నేను అంతకన్నను ప్రస్తావించిన వాడ గాను. అట్లు ప్రస్తావింపమి "దృష్టాన్తే, న విచారణీయ చరితా స్తిష్ఠన్తు కిం వర్ణ్యతే?" "అంగుళ్యాయుగళ్. రసిక నొప్పగు వారి చరిత్ర, యుండనీ" అను లక్షవాక్య న్యాయమున నే.

రవీంద్రుని శాకుంతలప్రశంస సర్వము యూరపు జర్మను కవిపహృదయ చక్రవర్తి గేటే పలికి నన్ను తన్ప్రశంసాగీతికకు తన విపులవ్యాఖ్యయే అన్నాడు. గేటే గీతికకు ఇది ఆంగ్లానువాదము—

Wouldst thou the young years'blossoms and the fruits of its decline,

And all by which the soul is charmed, enraptured, feasted, fed?

Wouldst thou the earth and heaven itself in one sole name combine?

I name thee Sakuntala, and all at once is said.

"నీవు బాల్యపు (ఎలజవ్వనపు) కుసుమములు కావలయూనా, అదితీతి వీడిపోయిన నాటి ఫలములుం గావలయూనా? అంతియు కాక, ఆత్మ యేవ సంతృప్తి గొనునో, సుఖపరవశ మగునో, ఉండుపు గమనో, విందారగించునో అది యెల్లను గావలయూనా? మన్నుమిన్ను—భూమియు స్వర్గమును ఒక్క (పేరి) టనే కలుపం గోరెదవా? ఈ యన్నింటిని, ఓ శకుంతలా, నిన్నే నీ పేరొక్కటనే గొనుదు. అంతి సర్వమును నొక్కుమ్మడి చెప్పబడిన దగును, చరితార్థమగును." ఇది దానికి ఒకవాటి ఆంధ్రానువాదము. గేటే యీ శాకుంతల ప్రశంసకు కారణము నేను ఒడుగా ఊహించి ఆ రసాస్వాదినియందు ఇట్లు తెలుపుకొనియుంటిని. "ఉదాహృతపూర్వ (షేక్స్పియరు నాటక గత) రసాభావాదిచిత్రణలందు, తన్మహిమ్మఖ్యములందు, రచనమున్నను భావముల యుత్కృష్ట 'సంవిధానము' కాని, సరసిగ్వర్తిరిక లలితలాస్యము లేదు. అట్లే నాయకాదు యుదాత్తతోన్నతియు. కావున గాబోలు, మహాకవి-హృదయచక్రవర్తి గేటే తనకు భావయుగపు గాను వాస్తవ దివ్యముగాను తోచి, తన చిత్తమున కుదికట్టించుకొని ఆరాధనాచింతన స్తోత్రము లందిన షేక్స్పియరుగారి ఆ తొందరమునకు మిక్కిలి అబ్బురపడుచు నే ఉత్సేకము బొంది కాళిదాసు శాకుంతలములోని చల్లని యా 'లాస్యమునకు' సంతసపడి దానిని ఇట్లు వాగ్గంధిముం బొరయించినాడు-'Wouldst thou' ఇత్యాది. ఇంతియు వాగింటి యాంగ్లంపు చూడి మాడి భోగించినట్లుగాక, హిమవద్వింధ్యాంతరీతియు అతిమారదేశవాసినియు, పరిశుద్ధశీలయు, తనయావితి మర్యాదగా నచ్చిన వింగును అగు నాగీర్వాణి శకుంతలను ఒకవాటి యౌవనముగా చుదిగా ఉంచి చూచి ప్రెమ్కెక్కడియే చేసినది యీ స్తోత్రపాఠమని తలంతురు గాబోలు" అని. మరి ఠాకూరు రవీంద్రనాథుడు గేటే ప్రశంసాగీతికపై ఇట్లు వ్యాఖ్యానించుచున్నాడు. "మనము ఈ ప్రశంసను వట్టి కవనపు బొంకు అని పొనిర్తుము. దాన గేటే శాకుంతలమును మిక్కిలి అందమైన కావ్యముగా ఎంచెనని తలంతుము. కాని, నిజముగా అది యట్లు గాదు. అతని పద్యము వట్టి యుంగంద పాగకళ్ళపు మెచ్చుకోలను అతిశయోక్తియు గాదు. మరి విమర్శకుని తెలివిగా అరసి చెప్పిన నిజనిర్ణయము. అతని మాటలలో ఒక ముఖ్యమైన నిర్దేశము గలదు. శాకుంతలమున ఒక క్రమవృద్ధిని మార్పును సూచిత

పురస్సర నిర్దేశములం జేసెను. ఆయన శిష్యుడు, నగరు చొచ్చిన శార్ఙ్గరవుడు తన మనమున చిర రూఢమును అపురుమను ఆపాతముగా తర్కాణపడినదియు నగు దుష్యంతుని రాచఠీకమును ఇట్లు మెచ్చుకొన్నాడు.

"మహాభాగః కామం నరపతి రభిన్నస్థితి రసౌ
న కశ్చి ద్వర్ణానా మపథ మపకృష్టోఽపి భజతే."

అని. అట్టి దుష్యంతునిం గూర్చి రవీంద్రదర్శి చెప్పినాడు. "బహుభార్యుడగు దుష్యంతుడు శకుంతలను పొందొచుట అతని స్వభావముం బట్టి ఊరకే నిజముగా ఎట్లును జరుగునదే. (కాముకచపలుడు, నూతనప్రియుడు)... ......రాజు పాపాత్ముని మనకు తెలియుటకు కవి అతని పైకప్పున ఒక చిన్న చినుగుకుంగా కల రూపుం జూపినాడు. అదే ఐదవయంకము. శకుంతల వచ్చి, భర్తచే ప్రత్యాఖ్యాత యగుటకు రవంతముందు రాజాశృంగారవిషయముల (గుట్టు)మీది తెరను క్షణము తివిచి తత్త్వముం జూపినాడు. హంసపదిక రాణి తనకు తానే సంగీతశాలలో పాడుకొనుచున్నది. 'అభినవ మధులోలుప స్త్వం తథా పరిచుమ్బ్య చూతమఞ్జరీం, కమలవసతిమాత్ర నిర్వృతో మధుకర విస్మృతో స్యేనాం కథాం.' అని. రాణివాసమున నొగిలిన చిత్తమునం బొడమిన యీ యశ్రుసిక్తంపు పాట మనకు తటాలున అనుకోని యదరుపాటుం గూర్చును; విశేషముగా మనచిత్తము సంతసముండె (ఆశ్రమమున) శకుంతలతో రాజు పలికిన యనురాగంపు బాసలను వినియున్నందున.........ఆమెకు మహానురాగభవన మగునని మనము ఆసాంతగా ఎదురుచూచుచున్న దానిపై ఇపుడొక మాయని మచ్చ పడుచున్నది............. రాజవలపు క్షణికము యగునను ఈ సూచన ఈ యంకారంభమున వృథాగా చేయబడినది కాదు. కడునిపుణతతో ఇట కవి దుర్వాసుని శాపకార్యమునకుం గారణము మానవ ప్రకృతిలోనే యున్నదని స్పష్టపఱుచు చున్నాడు." (మఱి శకుంతల యెఱుంగనట్టియు, తోడువచ్చిన తిదియు ఎఱుంగనట్టియు, దుష్యంతుడును ఎఱుంగనట్టియు ఆ శాపమునకు వేగారంభ మెప్పుడగునా అని ప్రేక్షకులు ఎదురుచూచు చున్నారు కదా.) **'The desertion of Sakuntala by the amorous Dusyanta which in real life would have happend as the natural consequence of his character, is here brought about by the carse of Durvasa..................**

**But the poet has left a small rent in the veil thro' which we can get an idea of royol sin. It is in the fiifth act. Just before Sakuntala arrives at court and is repudiated by her husband the poet momentrily draws aside the curtain from the kings love affairs. A woman's voice is heard singing behind the scene.**

**"O honey bee, having sucked the mango blossoms in your search for new honey you have forgotten the recent loving welcome by the lotus". (This is wrong-ren dering of the original or must be you 'have forgotten them, feeling all content and happy in your lotus abode.')**

**This tear stained Song of a stricken heart in the royal household gives us a rudo shock especially as our heart was hitherte filled with Dusyanta's love-passages with Sakutala............And now a stain falls on the picture we had so hopefully formed of the home of love to which she was going. ............... This indication of the fickleness af royal love is not purposeless at the begining of the fifth Act. With masterly skill the poet here shows that what Durvasa's curse had brought about had its seeds in human nature." Tagore.**

అయ్యయ్యో, ఇక్కడి నాటకసంవిధానము మహర్షికి రవీంద్రనాథునికి సంపూర్ణముగా బోధపడలేదు. విశ్వకవికి ఈ శాకుంతల సంప్రదాయము తెలియలేదు. శకుంతల పరమపవిత్రవతియయి హిందూ స్త్రీలకు ఎంతటి లక్ష్యభూతురాలని రవీంద్రునిచే నిజకీలోపన్యాస ప్రశంసలం గన్నదో, అట్లే దుష్యంతుడును హిందూ పురుషులకు, గొప్ప హిందూ రాజులకు లక్ష్యభూతుడుగా కవిచే ఉద్దిష్టుడు. మను మాంధాతలయు దిలీపరఘు శ్రీరాములయు వంశమునకు చెందినవాడు, కాళిదాసు చిత్రవీథిలోను హిందువుల శిష్టగోష్ఠిలోను తొలిమెట్టున నుండువాడు, తనకు ఎందును మించినవారు లేనివాడు. అతనిని కాళిదాసు ఈ నాటకమున అట్టివానిగానే నిర్వహించినాడు. అట్టివానిం గూర్చి "బహుభార్యుడగు దుష్యంతుడు శకుంతలను పొందొనుట అతని స్వభావముంబట్టి ఊరకే నిజముగా ఎట్లును జరుగునదే.......

రాజు పాపాత్ముడని మనకు తెలియుటకు కవి ఒక చిన్న ద్వారము తెఱచి చూపినాడు. అదే హంసపదిక పాట." అనుట ఎంత అన్యాయమైనమాట! శాంతము పాపము! శాంతము పాపము! మహాకావ్యస్రష్టలగు కవికుల గురువు మహాత్ముడగు కాళిదాసు 'అభినవ మధు లోలుపః' అను పాటను ఏ మహాప్రయోజనమునకై పాడించి నాడో హంసపదిక చేత అది వారికి ఇంకను గ్రహింపరాదాయె. హంసపదిక ఒక భోగముపిల్ల. ఆ పేరే చెప్పుచున్నది. "దేవ్యాస్తు ధారిణీ లక్ష్మీ వసుమత్యాది నామభిః, భోగవతీ కాన్తిమతీ కమలా కామవల్లికా ఇరావతీ హంసపదీ త్యాదినామ్నా తు భోగినీ" అని సింగభూపాలుడు రాణులకును భోగినులకును తగిన పేరులను వేఱువేఱుగా చెప్పినాడు. "హంసపదికాయా రాజాశ్రయాత్ తిరోభవతీత్యుపచారో విదూషకస్య. హంసపదికా నామ భోగినీ రాజ్ఞః" అని శతావధానము శ్రీనివాసాచార్యులవారు. 'హంసపదికా Was a Concubine వేశ్య of the king'-అని వేదము వేంకటరామశాస్త్రులవారు. విదూషకుడు 'అది తన వారితో నన్ను జుట్టు పట్టుకొని కొట్టుమని చెప్పిన దేను ఎట్లు తప్పించుకొందును' అనుటయు, అందులకు రాజు 'నాగరకముగా తప్పించుకొమ్ము' అనుటయు అది భోగముపిల్ల యింటి వృత్తి యని సూచించుచున్నది. ఆ హంసపదికతో 'సకృత్కృతప్రణయోఽయం' - ఒక తూరి ప్రణయము గలిగినాడట, దుష్యంతుడు. తరువాత దొరక వసుమతి (దేవి) యింటనే యున్నాడు. మరల తనకడకు రాలేదు. అన్న సూచనగా తన మధ్యాహ్న నిత్య గీతాభ్యాసముగా మధుకరోపదేశమున ఈ వర్ణము పాడినది. రాజు నవ్వుచు "ఆ యుపాలంభమును గ్రహించితిని" అని చెప్పి పంపుట "మరల ప్రణయమును సాగింతుములే— కేడ్డో కదా తత్తునులే" అని యనుట తెలుపుటయే అట్లు నవ్వగా అంతట హంసపదిక ప్రస్తావము ముగిసిపోయినది. అటుపై వేఱు ప్రస్తావము. ఏమనగా, అంతట రాజు అనును—'కిం ను ఖలు గీతమేవం విధార్థమాకర్ణ్య, ఇష్టజనవిరహాదృతేఽపి బలవదుత్కణ్ఠితోఽస్మి. అథవా—

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్ సుఖితోఽపి జన్తుః,
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తరసౌహృదాని.' అని.

'ఇతి పర్యాకుల స్థితి' అన్నాడు కాళిదాసు. ఈ యుత్సుకతను. పర్యాకులతను దాని తెలిపెడినో గూడ, కాళిదాసు కాని మఱొకడు చెప్పగలడు, దుష్యంతుడు కాక మఱొకడు దానిని పడుచు ఇట్లు వాగానందము బొరయింపగలడు! శకుంతలాసంయోగము, రాజుస్మృతి శాపహతమైనందున, అబుద్ధి భావస్థిర జననాంతర సౌహృదముంబోలె ఐపోయినది. దుష్యంతుని పర్యాకులత తనకు ఎఱుంగరాని నిజవిరహితమున నే అనియు, శాపమున్నను రతికి శకుంతలా విషయక విస్మరణము దూషమిచే ఇది యిట్లని తెలియుంగరని మోగమెఱగయు అనుపాటును అయినప్పటికి వానసిక రహస్యమును కాళిదాసు ఇట్లు అనన్యసదృశముగా చెప్పినాడని సంప్రదాయవిదులు అందురు. ఈ యంకము కథ శకుంతలకన్నను దుష్యంతునికి పరీక్ష; ఆమె బాధకన్నను దుష్యంతుని బాధనే ఎక్కువగా చెప్పవలదగును. కాదా వారిది మనకు ద్రవలను ఒక్క తెఱంగే. అయ్యో ఆమె ఇక నేమిసేయగలదు అన్నట్లు అయ్యో అతడింక నేమిసేయగలడు అనిపించును. 'Sakuntala feels as if she had been struck with a thunderbolt' అన్నారు రసజ్ఞ. అట్లే 'Dusyanta feels as if he had been struck with a thunderbolt' అనదగును. 'అహో ధర్మాపేక్షితా భర్తుః! ఈదృశం నామ సుఖోపనతం రూపం దృష్ట్వా కోఽన్యో విచారయతి!' అని కన్నవారు విన్నవారు దుష్యంతుని ధర్మాపేక్షను మెచ్చుకొన్నారు. అది కాళిదాసు హృదయము. 'వ్యపదేశమావిలయితుం కిమీహసే జనమిమం చ పాతయితుం?' అని దుష్యంతుడు తిట్టు తిప్పినాడు! ఇందు పుటము తీసిన పదియార్వన్నె బంగారమైనాడు. తరువాత సానుమతి దుష్యంతుం జూచుచుండినపుడు శకుంతలకైన అతని యోగాని మనశ్శయసుఖమునకును వసుమతీ దేవిని తప్పించుకొనుటకు అతడు పడినపాటు పలికిన పలుకు ఎంచిచూచి 'అవ్యాసంక్రాన్తహృదయోఽపి ప్రథమసంభావనామపేక్షతే. అతో ఽనిభృతసౌహృదా ఏవ ఇదానీం' అని దుష్యంతుని దాక్షిణ్యమునకు అతడు వారిం గూర్చిన మగవారిగుట్టులు కనిపట్టగల తన యుప్పక ప్రాగల్భ్యముతో రాజు పలికినది. అనుకియముచే ఈతని హృదయము గాఢముగా శకుంతల యొడ సంక్రాంతమని సానుమతికి ఇంతవట్టు ప్రత్యక్షమగదా. ఐనను ఇతడు అంతఃపుర ప్రతిష్ఠితమైన

పాడుచుండగా వినుచు వాయుస్కంధములను దరియగా దిగుట, నడుమ హేమకూటమున, అటు స్వర్గమునం గాక ఇటు భూమినిం గాక, అంతరాళమున నుండి, స్వర్గమునకన్న నిర్వృతి యిడు అమృతహ్రదమువంటి చోట, ఎటు చూచినను కల్పతరుగుల్మక్రిందనే పసిడి తామరకొలకుల చెంతనే చింతామణిశిలల మీదనే, అప్సరః పరిచరితులగుచునే యుండి, తెరచిన కన్ను మూయకయు మూసినకన్ను తెరువకయు ఏకధారా ధ్యానముగా తపముచేయు ఋషులుండుచోట మారీచాశ్రమమున ప్రవేశించి సర్వదమనునితోడి శకుంతల పునఃసంయోగముపొంది, అదితి మారీచుల దర్శనము చేసికొని తరలి సకల సామ్రాజ్యభోగములకు మాత్రిన బంగారు చేరుట—ఇది శుద్ధమైన భూస్వర్గ సంయోగముగదా? ఇవే కాదా ఆ యొక్కటైన భూస్వర్గసంయోగములు, గీటే తన మనసునకు తెచ్చుకొన్నది? నాడు అట్లు వీథిలో విడ్చుచున్న శకుంతలను తల్లి మేనక కొనిపోయి హేమకూటమున మారీచాశ్రమముం జేర్చెను. దాని ప్రయోజన రహస్యమును కాళిదాసు దుర్వాసునిచే చెప్పించినాడు. అతడును అనుశయదుఃఖాగ్నిలో శుద్ధతెలియనట్లు మాడి యను భావనామాత్రముతో నంతవాడు స్వర్గమునుండి వచ్చు దారిలో మాతలిచే అచటికి చేర్చబడెను కదా. అచట అడుగు మోపగానే అతడును జిల్లుమనగా 'స్వర్గా దధికతరం నిర్వృతిస్థానం! అమృతహ్రద మివ అవగాఢోస్మి' అని యన్నాడు. ఎట్టి భిన్నచిత్తమును అచట తనంతట ప్రసాదము గనును. కావున నాడు శకుంతలయు, తల్లి తన్నచట దింపగానే, తనంతట అట్టి చిత్తనిర్వృతి గన్నది. రవీంద్రుడు చెప్పిన యా పుట్టుపతివ్రత శకుంతల తన రొంపింగిన యేకారణమును లేకయే తాను భర్తృనిరాకృతయైనందున, మఱి తనకు ప్రత్యాఖ్యాన కాలము లేమి, ఫలము కోరకయే ఆతాపసిద్ధిక్షేత్రమున, దేవతాగురువుల సాక్షాత్సన్నిధిలోను ఎటుకలోను, ఇక్కడ అంటును ఇట్లే యున్నట్లు, సాధారణముగానే విరహవ్రతము తొడంగినది. మారీచుల వారికి శకుంతలను చూడగానే శాపమును, దాని నివృత్తి కాలక్రమములును చిత్తమున బొలసినవి. అదియే ఆమెకు ఆయన కరుణాకటాక్షము. కాలమున భర్తృపునఃసంయోగఫలము సమకూడినది. మఱి మాలినీతీరపు శ్యామ దైహిక కామసంయోగము అనుశయదుఃఖమునను విరహదుఃఖమునను మాడి స్వర్గగమై ఆత్మప్రేమసంయోగమైనది. శాకుంతలమున ఒక్కట భూస్వర్గసంయోగమని అని యని రవీంద్రుని వ్యాఖ్య. మఱి తొలియంకమున 'కృష్ణసారే దదచ్చక్షుః' అను మాట తొలి భాషితము మొదలుకొని కడపటి మారీచుల యాశీర్వాదము 'తవ భవతు బిడౌజాః ప్రాజ్యవృష్టిః ప్రజాసు' అను ముగింపుగలకు 'భావో భావం నుదతి విషయా ద్రాగబన్ధః స ఏవ' అన్నట్లు ఏకరాగ బంధముగా విల్లివిరిసిన శాకుంతల శృంగారరసంపుమొదువు పెద్దలు అనుకాపించిన యా 'సద్యఃపరనిర్వృతి' పొంగారుచుండగా 'అత్ర దేవ సంతసము గొనునో, సుఖపరవశముగునో, పండువు గనునో విందారగించునో అది యెల్ల బ్రహ్మానంద సబ్రహ్మచారిగా సమృద్ధమైనది. గీటే Wouldst thou the young years' blossoms' ఇత్యాది ఆత్మానందోద్గారమునకు ఇదెల్ల ఇంతక ఒక తెలుగు సమర్థనము గదా?

"పాప్మభ్యః పునాతు వర్ధయతు చ
శ్రేయాంసి సేయం కథా
మఙ్గల్యా చ మనోహరా చ జగతాం
మాతేవ గఙ్గేవ చ."

"సరస్వతీ శ్రుతిమహతాం మహీయతామ్."

# గృహోన్ముఖుడు

శ్రీ తాడిగిరి పోతరాజు

మునిసిపాలిటీ కార్యాలయంనుంచి బ్రహ్మరాక్షసిలా కేక పెట్టింది 'సైరను'. రాత్రి ఎనిమిది గంటలయిందని గ్రహించి, అందరూ త్వర త్వరగా తమ తమ కార్యకలాపాలు ముగించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నారు. అప్పటివరకూ కార్యసాధనలో నిమగ్నులై ప్రపంచాన్ని మరచిపోయిన వ్యాపారస్థులు, రాజకీయవేత్తలు, సైరను చెవుల్లో 'గింగురు' మనేసరికి త్రుల్లిపడి, ముంజేతి వాచీ చూసుకొని, ఒకరివద్ద ఒకరు సెలవుతీసుకోవటానికి ఉపక్రమించారు. దుకాణాదారులు, డబ్బు లెక్క పెట్టుకొని, కొట్లు మూస్తున్నారు.

పగటివేళ ఆ బజార్లలోనున్న అవసరాన్ని రేపటికి వాయిదావేసి అందరూ సర్దుకుంటూన్న వేళలో, ఆ ప్రదేశానికి వింత వ్యక్తులు, కొత్త వ్యక్తులు పోగవుతున్నారు. రాత్రించరులను ఆహ్వానించటానికై వికృతంగా తీగలు చుట్టుకొని నిల్చున్నాయి విద్యుద్దీప స్తంభాలు. ఉదయం ఆఫీసులకు బయలుదేరే ప్రభుత్వోద్యోగుల్లా జారులు, చోరులు మెయిన్‌రోడ్డు ప్రవేశిస్తున్నారు. వీరి కార్యసాధనకు అనుకూలసమయమీ నిశీథిని. వీరితోపాటుగా, పిళ్ళ సవతిపిల్లలైన పోలీసులు ధర్మరక్షణార్థమై, ప్రజాక్షేమం కొరకు, విజిల్స్ వేసుకొంటూ, సంజ్ఞలు చేసుకొంటూ జాగరణకు సిద్ధపడుతున్నారు.

ప్రతిరోజూ, ఈ వేళకు, ఈ రెండువర్గాలకు చెందిన మానవులు ఆవూరిలో ఆ సినిమాహాలు ముందున్న సత్రంవద్ద సమావేశమౌతూంటారు.

ఆ సత్రం రెండస్థులమేడ. క్రిందిభాగంలో అరఫర్లాంగుపొడుగునవున్న ఆ పంచపాళిలో నానా జాతిసమితి సమావేశం జరుగుతూంటుంది. ఆ పంచకు ముందు భాగాన, శిథిలమై చిల్లులు పడిపోయి జీరాడుతున్న మురికిగోనెపట్టాలు వ్రేలాడుతున్నాయి. వాటి చెంతనే, అతుకులు వేసిన కావిగుడ్డలు, చీరలు ఆరకట్టబడివున్నాయి.

సత్రంలో జనమాత్రం పల్చగనే వున్నారు. అక్కడక్కడ ఓ సన్యాసి, మురికిగుడ్డలమూటలు, వాటి చెంతనే నగ్నశరీరులై నిద్రిస్తూన్న అనాథపిల్లలూ, తప్ప మరెవ్వరూలేరు. ఆ సత్రాన్ని చిరకాలంగా కనిపెట్టుకొని బ్రతుకులు సాగిస్తున్న మహానుభావులందరూ, ఇంతకుపూర్వమే "మాదాకవళం తల్లీ!" ఉద్యమంలో పాల్గొనటానికి వెళ్ళారు. ఇప్పుడా ఉద్యమనాయకులందరూ, జట్లు జట్లుగా చేరుకుంటున్నారు. అంధులు, అంగవికలులు, కుష్టురోగులు, వర్గభేదం పాటించి, ఎవరి నిర్ణీతస్థలాల్లో వారు ఒదిగి కూర్చుంటున్నారు.

వీరు కాక భిక్షాటనచేసినవారు క్రిందనున్న మురుగుకాలువ చెంతనే వంటప్రయత్నం సాగిస్తున్నారు. పొయ్యిక్రింద మంటకొరకు కారుటైరుముక్కలు, చెత్తచెదారం ప్రోగుచేసి, కాల్చుతున్నారు. వాళ్ళకు సమీపంగా 'డస్ట్‌బిన్'లో చేరి రెండుపందులు మామిడివిత్తనాలు కొరుకుతున్నాయి. మందంగా నిశ్చలంగా ప్రవహిస్తూన్న ఆ మురుగుకాలువ, అదోరకమైనదుర్గంధాన్ని వెదజల్లుతోంది. కాలుతున్న ఆ టైరుముక్కలు అదోరకం కంపుకొడుతున్నాయి. ఏ వాసన ఘాటుగావుందో నిర్ణయించలేక బాటసారులు ముక్కుకు 'రుమాలా' అడ్డంపెట్టుకొని నడకసాగిస్తున్నారు. అయితే ఆ వాసన, అక్కడ అరుగుపై ఆసీనులైన వ్యక్తులపై ఎలాటి ప్రభావం చూపలేదు. ఒక్కరు తప్ప అందరూ, అనేక అనుభూతులతో, స్మృతులతో, నిర్లక్ష్యంగా కూర్చున్నారు, మామూలుగా పార్కులో కూర్చున్నట్లు. ఆ వ్యక్తి ఎదురుగానున్న దిమ్మకు కాళ్ళతన్నిపెట్టి, తలక్రింద ఒక పాతగుడ్డల మూట పెట్టుకొని కళ్ళుమూసుకున్నాడు. రబ్బరు కాలుతున్న వాసన భరించలేక "ఛీ...పాడు గవులు...గబ్బుకొడుతోంది...ఎవడ్రా అక్కడ" అని గర్జించాడు. ఆ దెబ్బతో, అక్కడచేరిన దైవస్వరూపులందరూ అటుకేసి చూశారు. మెరుపులా వచ్చి ఆ పొయ్యి వెలుగు అతనిముఖంపై పడింది. కోతిలా ఇంత పొడుగు ముక్కు, రెల్లుగుబ్బల్లావున్న కనుబొమలు కుంచించుకుపోయాయి. గుంటలుపడిపోయి, జ్యోతుల్లా మెరుస్తున్నాయి కళ్ళు. వెలుగు ముఖంపై బసగానే కను

రెప్పలు ముకుళించాయి. బాధగా కళ్లుమూసికొన్నాడు. దవడ ఎముకలు ఎత్తుగా తిబ్బి బయటికి పొడుచుకొస్తున్నాయి. "నువ్వింకా అరుస్తున్నావలే!" భయంకర పిశాచ స్వరంతో. దీనంగా సమాధానమిచ్చింది ఒక కంఠం పొయ్యిదగ్గరనుంచి. దానితో తృప్తిపడి ఆ వ్యక్తి మళ్ళీ వెనుకకు చేరగిలపడ్డాడు. అయినా విసుగు, కోపం తగ్గలేదు. "ఎదవసత్రం...ఎదవసత్రం" అని గొణుక్కున్నాడు.

అంతలో అక్కడకు మరొక వికారి చేరాడు. పడుకున్న ఆ వ్యక్తికేసి కోపంగా చూశాడు. కాని పడుకున్న వ్యక్తికి ఆ చూపు కన్పించదలేదు. ఇక లాభం లేదనుకొని "ఏయ్! ఎవరు నువ్వు? నాసొట్లోనుంచి లే" అన్నాడు.

పడుకున్న వ్యక్తి కదలలేదు. పలుకలేదు.

"నీకేనోయి చెప్పేది. లేస్తావా! లేవ్వా?" అని గద్దించాడు, అక్కడం వాడి 'జన్మహక్కు' యినట్లు. మళ్ళీ రెండుసార్లు పిలిచాడు.

ఈసారి పడుకున్న వ్యక్తికి ఒళ్లు మండిపోయింది. చివ్వనలేచాడు సిగ్గులేకుండా... "లేవనోయ్...ఏం చేస్తావేం?" అని పొందాగా రొమ్ము విరుచుకొని పలికాడు.

ఆ రకం కులమనిషి కసాయివాడి భంగిమలో లేచి నిల్చునేసరికి గుండె జల్దరించింది. కాని ఇప్పుడు నోరు మూసుకున్నుచుంటే, అందరిదృష్టిలో చెప్పుపోయినవాడవుతాడు. ఈ ఆలోచన తట్టగానే కోపం పొంగిపోయి "టూత్ పేస్టు"లా బయటికొచ్చింది. "ఈసొట్లో రోజూ నేపండుకుంటున్నాను......ఇప్పుడు నువ్వు లేస్తావా? లేవ్వా?" అన్నాడు సమస్య పరిష్కారానికి ఏదో మార్గం కనిపెట్టినట్లు: "లేవనని నీ కెన్నిసార్లు చెప్పాలోయ్?...కావాలంటే ఒకదెబ్బ చూసుకో" అని క్రోధావేశమూర్తియై పిడికిలిబిగించి, చెయ్యిపైకెత్తి గోడపై అన్నాడు.

రెండవవ్యక్తి పోల్చిచూస్తే పొట్టిమనిషి. అతను చెయ్యిపైకెత్తగనే గుండెలాగినంత పనయింది. శరీరం కంపమెత్తింది, అయినా ధైర్యంచేసి "ఏమిటోయ్? కాస్త జరగవయ్యా! అంటే పెద్ద వస్తాదులాగ మాటాడతావ్...ఎంతమందిని కొడతావు నువ్వు?...అసలు నేనెవరో తెలుసా...జాగ్రత్త..."అంటూ తన గళ్ల లుంగీ పగ నిక్కిముడిచి నడుంపై చుట్టుకున్నాడు. తరువాత చేతులు పైకి తీస్తున్నాడు.

ఇంతలో ఓటాక్సీ ఆ సత్రం గుండుగా దూసుకుపోయింది. అప్పుడా కారు హెడ్‌లైట్ల కాంతులు ఒక్కక్షణం వాళ్ళమీద ప్రసరించి, ఆ దిమ్మెలన్నిటిని తగాపగా దాటిపోయాయి ఆ కాంతులు. క్షణమాత్రమైనా, విలయతాండవానికి సిద్ధమై పిడికిలు బిగించుకున్న మొదటివ్యక్తి ముఖాన్ని రెండవవ్యక్తి సుస్పష్టంగా చూశాడు. నరాలు పెలుచికి, శరీరకష్టం స్ఫురింపచేసే అతని దృఢకాయం. రెండవవ్యక్తిలో గత స్మృతులను తట్టిలేపింది. కాని ఇప్పుడా ఆలోచనకు తావులేదు. కాని ఆ స్మృతితో భయం ఉద్రిక్తమైంది.

ఇద్దరూ అదే భంగిమలో నిల్చుని, ముష్టి యుద్ధానికి సన్నద్ధులౌతూంటే, తక్కినవాళ్ళంతా నిష్పాక్షికంగా ఐక్యరాజ్యసమితి ప్రేక్షకబృందంలా పరిశీలిస్తున్నారు. ఆ పరిస్థితులలో ఒక అంగుష్ఠమాత్రుడు "ఏమయ్యా? ఈపాటి విషయానికి కొట్లాట కాదు... రవ్వంత కునుకుతీసి పొద్దున్నే పొయ్యేవాళ్ళకెందుకీ కొట్లాట...ఆపుకోవటం" అని తీర్పు చెప్పాడు. ఆ తీర్పులో జాలి, శాంతిప్రియత్వంకన్న "పోలీసుల భయం" ఎక్కువగా ప్రతిధ్వనించింది.

ఇంతలో మరో కారు అటుగా వెళ్లటంవల్ల, ఆ సత్రంలో మసిబొగ్గుతో గీయబడిన, పెద్దపులి, పోలీసు, కోడిపుంజు, కత్తిసాముచేస్తున్న వీరులు — మొదలైన చిత్రాలు కన్పించాయి. పోలీసుబొమ్మ చూచి అందరికీ భయం వేసింది. వచ్చింటే అందరినీ పట్టుకెళ్తారని స్ఫురించగనే ఎవరితావులకు వారు వెళ్ళిపోయారు.

ఆ పెద్దపులిబొమ్మ జాలి కలవరపడ్డాడా రెండో వ్యక్తి. ప్రేక్షకబృందం రాజీనామా యివ్వటంతో పోరాటంలో పాల్గొంటూన్న అభ్యర్థులు వెంటనే, కాలిపోయిన గడ్డివాములా క్రిందకొరిగి దూరంగా చతికిలబడ్డారు.

* * * *

ఆ గళ్ళలుంగీవ్యక్తికి నిద్రపట్టలేదు. గతానికి సంబంధించిన ఎన్నో దృశ్యాలు మంచుకప్పిన ముసురుతున్న దోమల్లాగా కళ్ళముందు మెదలసాగాయి. పది సంవత్సరాలక్రితం, తను ఒకబాలిక మెడలో గొలుసు అపహరించిన నేరానికి కారాగారశిక్ష విధించారు. అప్పుడు తనగదికి ఎదురుగానున్న గదిలో "వీరాస్వామి" అనే ఖైదీ వుంటూండేవాడు. హత్యా నేరం ఆరోపింపబడి ఎలాగో మరణశిక్షతప్పి ఇరవై సంవత్సరాలు కారాగారవాసం అనుభవిస్తున్నాడు.

# గృహోన్ముఖుడు

మూడువారాల క్రితం కారాగారంనుంచి అయిష్టంగా విముక్తుడయ్యాడు. చీకటిని ప్రేమించే తనను బలవంతంగా వెలుగులోకి త్రోశారు. వెలుగుచూస్తే అతని కళ్లు కుంచించుకుపోయి చిరాకుపడి కోపగించుకుంటాడు. జైలునుండి 'నంబరు 29' గా కాక వీరాస్వామిగా బయటకొచ్చినప్పటినుంచి, పగలు వంతెనల క్రింద, పాడుపడిన కొంపల, పందికొక్కుగోతుల్లో గడిపేవాడు. రాత్రిళ్ళు చీకటిసందుల్లోకి వెళ్ళి అడుక్కుతినేవాడు. అదీ ఒక్కొక్కరోజు వెళ్ళేవాడు కాదు. చింకిగుడ్డపీలిక ముళ్లువెయ్యటం మొదలుపెట్టాడంటే అతని కే విషయమూ స్ఫురించదు.

ఇప్పుడా కిరసనాయిలుబుడ్డి వెలుగులలన రెండు నిముషాలసేపు కళ్ళుమూసికొని, తరువాత కొద్దిగా తెరచి చికిలిస్తూ, చూస్తూ, "తీసిపారెయ్యి అది" అన్నాడు. గళ్ళలుంగీ మనిషి వెంటనే దీపం ఆర్పకుండ అది మూల చాటునపెట్టాడు కొద్దిగా వెలుగుప్రసరించేలా. ఈదీపం వీరాస్వామి ఏకాగ్రతకు భంగం కల్గించింది. తపేలాముందు పెట్టగానే 'గడగడ' ఖాళీచేసిపారేశాడు వీరాస్వామి.

"నేను జ్ఞాపకం వున్నానా? నేను సింహాద్రిని, ...యాభై రెండోగదిలో వుండేవాడ్ని" అన్నాడా గళ్ళలుంగీ.

ఈమాటలు పూర్తిగా వినిపించుకున్నాడు గాని అన్నిమాటలూ పూర్తిగా అర్థంకాలేదు. అర్థంచేసుకుంటానికి ఉత్సాహమనుకూడ ప్రదర్శించలేదు, ఓ చిరునవ్వు విసిరాడు. సింహాద్రి తరువాత ఆగదిలో ఇద్దరు ముగ్గురు మారిపోయ్యారు. వాళ్ళందర్నీ గుర్తుంచుకోనవలసిన అవసరమేముంది అతనికి. "సింహాద్రివా? అన్నాడు నిర్లక్ష్యంగా."

జైలుమిత్రుడు తనను గుర్తించకల్గినందుకు సింహాద్రికి ఒకపళ్ళు కొట్టేసినంత సంతోషం కల్గింది. దానితో పరవశం చెందిపోయ్యాడు. యజమానినిచూసి కుక్క తోకాడించినట్టు సింహాద్రి ఈ ఆనందోద్రేకంలో ఊహాసౌధాలుకట్టటం మొదలుపెట్టాడు. రేపటినుండి తనకార్యకలాపాలలో వీరాస్వామి కుడిభుజంగా ఉంటాడు. డబ్బు అపహరించి పారిపోతూంటే, ఎవరైనా పట్టుకుంటే, వీరాస్వామి నల్గురిని తన్నగలడు. ఓహో... రెండుచేతులా డబ్బుసంపాదించవచ్చునని చిరునవ్వు లాస్యంచేసే ముఖంతో మిత్రునికేసి తిరిగాడు. కెవ్వున కేక వేద్దామనుకున్నాడు.

వీరాస్వామి,మురికిగుడ్డ పీలికలతో వేసినముళ్లన్నీ విప్పుతున్నాడు, ఒక్కొక్కటే. ఇప్పుడిహ పల్కరించటానికి వీల్లేదు.

జైలులోవుండగా అస్తమానం గోడకేసి చూస్తూ కూర్చోలేక ఈపనికి తలపడ్డాడు. అత్యంత కార్యదీక్షతో, ఉత్సాహంతో ఓపికతో ముళ్ళువేసి విప్పుతూంటే, అనేకలోకంలో సంచరించేవాడు, వాస్తవికప్రపంచాన్ని విస్మరించి. గతజీవితపు స్మృతులూ, జైలు అధికారులు అధికారగర్వంతో చేసే అఘాయిత్యాలు ఏవీ దగ్గరకు చేరేవి కావు. ఆపని కన్పించుకోనక పోతే ఈనాటికి పిచ్చిఆసుపత్రిలో వుంచేవారేమో. అయినా ఇప్పుడితను సాధారణవ్యక్తి అని ఏ "సైకాలజిస్టు" నిరూపించలేడు.

సింహాద్రి ఆశలు వమ్మయిపోయ్యాయి ఇక వీరాస్వామితో వ్యవహారం చంకలో పిల్లి బాపతుగా మారుతుందని భావించాడు. అయితే వీరాస్వామిని భవిష్యత్తు ఏమిటి? ఎవరు పోషిస్తారు? అనిప్రశ్నించుకోపోగాడు.

ఆ జేబు ఆ జేబుసర్ది వీరాస్వామిని తను పోషించగలడు కాని ఆశ్రయం ఎక్కడ? ఈసత్రంలోమాత్రం కుదరదు. గాలికి వెలుతురుకు అలవాటుపడేవరకూ ఒక చీకటికొట్టు చూడాలి. అది ఎలా సాధ్యమౌతుంది. ప్రపంచమే తన ఇల్లుగా భావించిన విశ్వమానవప్రేమోభిలాషి సింహాద్రికి స్వంత ఇల్లు అవసరం లేనప్పుడు వీరాస్వామికి చీకటికొట్టు చూపెట్టటం, దుర్లభం. అంతలో మనోక సందేహంకల్గింది. వీరాస్వామిని తను ఎన్నాళ్లు పోషించగలడు? ఆప్తబంధువులూ, మిత్రులైన 'కాకీ' వస్త్రధారులు తనను మర్యాదగా తీసికెళ్ళి స్వగృహంలో దిగబెట్టేవరకు.

సత్యం చెప్పాలంటే, వీరాస్వామికి, (అతని పరివారానికి) పుట్టిల్లు ఆజిల్లాకోర్టు వెనకవుంది. జీవితంలో ఎక్కువభాగం అక్కడే హాయిగా కాలం గడుపుతారు. విద్యార్థులు సెలవులకు ఇళ్ళకు వెళ్ళినట్టు అప్పుడప్పుడు బయట విహరిస్తూంటారు. ఇప్పుడు సింహాద్రిని పీడిస్తున్నది ఒకటే బాధ. పుణ్యంపండిపోయి తనా పుట్టింటికి చేరితే, వీరాస్వామి తనను ఎలా కలుసుకోగలడు. అతను కూడ దొంగతనంచేస్తే, మాట్లాడకుండ, జన్మభూమిలో దిగవిడతారు. అయితే ఇప్పుడు వీరాస్వామికి, ఈపరిస్థితులలో ఆలోచనలే తట్టవు. అని సంబాళించుకున్నాడు.

వీరాస్వామిలో అన్ని మానవప్రవృత్తులు చచ్చిపోయినాయి. ఇంకా అప్పుడప్పుడు పొగరాచుకొంటున్నట్టు బయటకొస్తుంది పాశవప్రవృత్తి. "ఎప్పుడైనా

గారకం కొద్దీ అతని మిత్రుడొకడు వీరాస్వామిని చేరదీసి కులవృత్తి నేర్పించాడు.

వీరాస్వామి కష్టజీవి. ప్రొద్దున్నే లేచి, కొలిమి ముట్టించి తిత్తినొత్తేవాడు. ఇనుపముక్కలను ఎఱ్ఱగా కాల్చి సమ్మెటతో సాగగొట్టేవాడు. సమ్మెటతో ఏకధాటిగా పోటు వేస్తూంటే ఇనుపకమ్మినుండి ఎఱ్ఱటి నిప్పురవ్వలు అగ్నిమీదుగా దూసుకుపొయ్యేవి. రాత్రింబవళ్ళు సమ్మెటతో అతడు జరిపే ఆ పోరాటం వల్ల అతని రెక్కలు పెడతిరిగిపొయ్యాయి. ఆ ఊళ్ళో బండిపట్టాలు మొదలుకొని, దేవుళ్ళ విగ్రహాలదాకా అతని సమ్మెటపోటు తినని వస్తువు లేదు.

ఈకష్టానికి, వీరాస్వామికి డబ్బురూపేణా పెద్దగా ముట్టేదికాదు. సగానికిపైగా, ఊళ్ళో, పంటకాలానికి ఇన్ని బస్తాల సజ్జలు, ఇన్ని బస్తాల జొన్నలని కంట్రాక్టుపద్ధతి ఉండేది. పనిముగిసిన తరువాత 'ఇవాళ్టికి పోనీ' పంగనామాలు పెట్టేవాళ్ళపట్ల అతను ఉదాసీనంగా ప్రవర్తించేవాడు. మొత్తానికి ఊళ్ళో వీరాస్వామి అమాయకుడూ, నెమ్మదికలవాడూ అనిపించుకున్నాడు.

ఆ ఊళ్ళోకల్లా మోతుబరిరైతు నారాయణరావు. వీరాస్వామి రెండెకరాలనూ ఆయనే సాగుచేసి ధాన్యం ఇంటికితోలేవాడు. ప్రతిచిన్న విషయానికి వీరాస్వామికి కబురు పెట్టేవాడు. ఇదివరకు ఇల్లుసరిగా గడవని రోజుల్లో పది పరక సర్దుతుండేవాడు. అందువలన నారాయణరావంటే అకుంఠితమైన గురి ఏర్పడింది. ఆ విశ్వాసం కొద్దీ వీరాస్వామి, కొలిమిమీద మిగిలే డబ్బు నారాయణరావుదగ్గర దాస్తుండేవాడు.

మాటల్లో డబ్బుప్రస్తావనవచ్చి ఒకరోజు, వీరాస్వామితల్లి ప్రశ్నించింది. "ఏంరా? ఆయనదగ్గర సొమ్మెంతయిందిరా?" అని.

"నేను లెక్కపెట్టుకోటంలేదే—అమ్మా......నా పెళ్ళికి మనడబ్బు కాక రెండుమూడువందలు అదనంగా ముట్టచెపుతానన్నాడే...అని ఒక్కక్షణం ఆగి... ఆయన చాలా గొప్పమనిషే..."అన్నాడు.

"అంతేలే ఆయన దయ, మనప్రాప్తం" అన్నది ముసలమ్మ.

ఆ రెండోసంవత్సరం పెద్దలు వీరాస్వామికి వివాహమహోత్సవం నిర్ణయించారు. పెళ్ళికి దాచుకున్న డబ్బు తాలూకు వీరాస్వామికి పధ్నాల్గువందల రూపాయలు (1400) నారాయణరావు ముట్టచెప్పాడు. ఎనిమిదిసంవత్సరాలనుండి, యేటా మూడువందల చొప్పున దాచినడబ్బంతా ఇదేనా అని అతనిముఖం వివర్ణత చెందింది. మనసు చివుక్కుమన్నది. అంతలోనే అంతరాత్మ ప్రబోధించింది 'నారాయణరావ్ అలాంటివ్యక్తి కాదు. అతని ఉదారస్వభావం శంకించడం ఎంతపొరపాటు' అని. వివాహం తన తాహతుకు బాగానే జరిగిందని సంతృప్తి చెందాడు వీరాస్వామి. పెళ్ళికి నారాయణరావు వధూవరులకు బట్టలు పెట్టి సంభావన చదివించారు. దానికి వీరాస్వామి ఆనందోద్రిక్తుడై లోలోన నారాయణరావుగార్ని తన మనోనేత్రమ్ముందు పూజించాడు. అంతటి విశాల హృదయాన్ని శంకించటం పాపమని భావపడ్డాడు.

వివాహానంతరం, వీరాస్వామి ఖర్చులోపడ్డాడు. చుట్టాలరాకడ ఎక్కువైంది. అత్తగారింటికి స్వగ్రామానికి తిరగటంతో పని మూలబడి ఆర్థికంగా దెబ్బతిన్నాడు. ఆ పరిస్థితులలో నారాయణరావుగారిదగ్గర రెండువందలు చేబదులు తీసికొని. పని ప్రారంభించి, రెండునెలలు గిర్రున తిరిగేసరికి చెల్లుకట్టివేశాడు.

ఇంతలో మరో విఘాతం తగిలింది. అతనిజీవితంలో దుర్దశ ప్రారంభమైంది. పెళ్ళయి రెండుసంవత్సరాలైన గడవకముందే, వీరాస్వామికి జీవితసమస్యలు అనేకం ఎదురొచ్చాయి. నారాయణరావు పొలం చెయ్యటం లేదు. తీరుబడిలేక ఒప్పుకున్నరోజుకి పనిముట్లు చేసియివ్వలేకపోతున్నాడు. చేతిలో చిల్లిగవ్వలేదు. పైన బంధువుల రాకపోకలు. ఏరోజుకారోజు కొలిమిమీద పొట్టగడవటమైంది. మానసికంగా వ్యథచెందాడు. వీటన్నిటిని మించిన మరో సంఘటన అతనిని క్రుంగదీయటం మొదలెట్టింది.

తల్లి మంచానపడింది తెల్లగా పాలిపోయింది. కళ్ళుగుంటలు పడిపోయి తెల్లవార్లూ కన్నుమూయకుండ దగ్గుతోంది. రాత్రికి రెండుసార్లయినా, తల్లి ఉమ్మివేసినపెంకు శుభ్రంచెయ్యవలసివచ్చింది. తల్లి ఆరోగ్యాన్నిగూర్చి తెలిసికొని చూడ్డానికివచ్చిన మామగారు "అక్కడ మీ అత్తకూడా లేవటంలేదని" సాకుచెప్పి కూతుర్ని వెంటపెట్టుకొని వెళ్ళిపొయ్యాడు.

ఇప్పుడు తల్లికి అన్ని ఉపచారాలు తనొక్కడే చెయ్యవలసివచ్చింది. కొలిమిపని పూర్తిగా మూలబడింది. ఉదయంనుంచి సాయంత్రందాకా నాటువైద్యుడు చెప్పినట్లు ఔషధాలు నూరటం, మందులు కలపటంతో క్షణం తీరికలేకుండాపోయింది. పరిస్థితి మరీ కటువుగా ఉండి మందులకూ వాటికి నారాయణరావుగారిదగ్గర మూడువందలరూపాయలు తీసుకున్నాడు. అంత ఖర్చయినా రోగమాత్రం నయంకాలేదు. పైగా ఇప్పుడన్నీ మంచంలోనే.

ముసలమ్మ రోజురోజుకూ క్షీణించిపోసాగింది. రక్తవిహీనమై ఎముకలగూడులా తయారైంది. ఒక్క

క్కరోజు ముసలమ్మ దగ్గి దగ్గి శోషవచ్చి పడిపొయ్యేది. ఆదగ్గులో వీరాస్వామి రక్తపుజీర చూసి కంపితుడయ్యాడు. ఆ హృదయవిదారకదృశ్యంతో కళ్ళనీళ్లు ఒత్తుకుని. ఊపిరిపారబోస్తున్న వీరాస్వామిని వైద్యుడు చాటుకు "పిలిచి ఇది అంటురోగం, క్షయ, అరుదు బెరుకూ లేకుండా సేవచెయ్యటం, అంతమంచిదికాదు" అన్నాడు.

వీరాస్వామి అప్రతిభుడై మాటాడుతున్న ఆ వ్యక్తికేసి నిశ్చలంగా చూసి, మరుక్షణంలో అతని కాళ్లపై బడ్డాడు.

"బాబ్బాబు...మీ మేలెన్నటికీ మరువను. ఎన్ని వందలైనా ఇచ్చుకుంటాను. రోగం నయంచెయ్యండి" అని బ్రతిమాలాడు.

"వీరయ్యా నేను చెయ్యాల్సిందంతా చేశాను. ఇప్పుడు మనశక్తికి దాటిపోయింది. ఇంకా నీకు ఆశవుంటే పట్నంనుండి ఇంగ్లీషు డాక్టరును పిలిపించు. లేకపోతే మనం రోగిని మంచంపై వేసుకొని పట్టణానికి పోవాలి" అన్నాడు.

మంచంపైన వేసుకొని గిసికెళ్ళి సర్కారాసుపత్రిలో చేర్చాలనుకున్నాడు. జోరున వర్షం కురుస్తున్నది. మోకాళ్ళలోతు బురద. మంచంపట్టటానికి రెండోవాని పైనా కావాలి. ఈవానలో రోగిష్టి మంచం మొయ్యటానికెవరు ఉపక్రమిస్తారు.....ఆలోచనాభారంతో క్రుంగిపోతూ ఊళ్ళోకెళ్ళాడు.

"ఈవర్షంలో రోగిని ఎలా తీసుకెళ్తావ్?...చినుకు పడితే మనిషి చెతికి చిక్కుతుందిరా?" అన్నాడు తోటి కులస్థుడు. ఈప్రయత్నం విఫలంకావటంతో వీరాస్వామి డాక్టరును తీసుకురావటానికి నిశ్చయించుకున్నాడు.

దగ్గటానికికూడ ఓపికనశించి కళ్ళు మూతలుపడిపోయి యమయాతనపడుతున్న తల్లికేసి ఓమారుచూసి, విసవిస నారాయణరావు ఇంటికేసి నడిచాడు.

యాభైరూపాయి లిస్తూ నారాయణరావుగారు "ఈ తెల్లకాగితంపై సంతకంచేసిపోరా" అన్నాడు.

"ప్రానోటా దొరా....మంచిదిలెండి....అసలు నేనే వ్రాద్దామనుకున్నాను" అన్నాడు.

"ప్రానోటు కాదురేరా?...ఎన్ని బాకీలు...గుర్తుకోసం ఈసంతకం చేయించుతున్నానులే" అన్నాడు. రావుగారు.

సంతకంచేసి వీరాస్వామి మోకాళ్ల లోతు బురదలో నడిచి పట్నంపోయి, ఇద్దరు ముగ్గురు డాక్టర్లను విచారించాడు. ఒకడాక్టరు 'టాక్సీ' పిలిపిస్తేవస్తానన్నాడు: టాక్సీవాడు, రోడ్డులేని గ్రామం, వర్షం కాబట్టి రానుపోను యాభైరూపాయిలిమ్మన్నాడు. అందు కంగీకరించాడు కాని, డబ్బుచేతిలో పెయ్యనిదే డాక్టరు బయలుదేరనని సంగ్రహించి డబ్బుకోసం తిరిగి గ్రామానికి ప్రయాణమయ్యాడు.

ఊళ్ళో అడుగుపెట్టి సరాసరి నారాయణరావు గారింటికి వెళ్లాడు. నారాయణరావుగారు చుట్టకాలుస్తూ పడకకుర్చీలో పడుకొని ముచ్చటిస్తున్నాడు. వీరాస్వామిని చూడగనే...

"ఏమిట్రా! ఇంకా డబ్బు కావాలా?" ప్రశ్నించాడు...తలవూగించి "అవునుదొరా...ఈసారి పెద్ద మొత్తం కావాలండీ...పొలం తాకట్టుపెట్టుకొని..." అంటూవుండగనే నారాయణరావుగా రందుకొని "ఛీ ఛీ అదేమాట్రా! ఈపాటిదానికేనా?" అన్నాడు. ఆపైన కొద్దిసంభాషణ జరిగింది. దానిని పురస్కరించుకొని నారాయణరావుగారన్నారు "సరే నీ ఇష్టమొచ్చినట్లే కానియ్యి. ఇప్పుడెంతకావాలి నీకు?" "మూడు వందలండీ" "అంత లేదులే. రెండువందలున్నాయ్ తీసుకో!" అని వీరాస్వామి చేతిలో పెట్టి "దీనితో సరిపోయింది" అన్నాడు.

సరిపోవట మేమిటనుకున్నాడు వీరయ్య. కాని ఆలోచనకు వ్యవధి లేదు. మరణశయ్యపైనున్న తల్లి విషాదదృశ్యం పదేపదే గోచరిస్తోంది. తల్లి దగ్గుతూన్న దృశ్యం మనస్సులో కలుక్కుమంటూంటే గడియలుగడవటం దుర్భరంకాసాగింది. ఓ మారు తల్లిని చూసిపోదామని ఇల్లు చేరాడు.

"ఇల్లంతా చీకటిగా ఉంది. మృత్యుప్రశాంతత ఆవరించింది. పగలంతా వర్షంకురవటంచేత త్వరగా చీకటిపడింది. మనిషివచ్చిన అలికిడివిని కొలిమిపొయ్యిలో పడుకున్న కుక్క అతనికేసి చూసింది. వీరాస్వామి 'అవ్వాల్లోవున్న దిక్కంతం తేవా' అనిబావురుమన్నాడు. ఆతురతతో దీపంవెలిగించి, మంచంపైనున్న తల్లిని చూశాడు. కళ్ళు చెదరిపోయినాయి.

పక్కగుడ్డ లన్నీ రక్తవర్ణములైపోయినాయి. నెత్తురు కుప్పలలో తలవాల్చుకొని, మూర్ఛితురాలై వున్నట్లు కన్పించుతున్న తల్లికన్నులు శాశ్వతంగా మూసుకున్నాయి. క్షయవ్యాధి పీడితురాలై రక్తవమనంచేసికొని పాలిపోయి పసుపుపచ్చగావున్న తల్లి అరచేతిని స్పృశించాడు. చల్లగావుంది. శరీరమంతా తడిమిచూశాడు. బిగుసుకుపోతూన్న శవాన్ని చూసి ఉలిక్కిపడ్డాడు. భౌతికదేహపు తార్కాణానికి చిహ్నంగా మిగిలిందా శవం. తల్లిపైబడి భోరున ఏడ్చాడు.

# గృహోన్ముఖుడు

రెండవరోజు శవానికి దహనసంస్కారాలు జరిగాయి. పదిహేనురోజులకు పెద్దదినం పెట్టారు. పరలోకవాసుల పేరిట ఇహలోకమహాశయులు సుష్టుగా భోంచేశాక, ఆ స్మారకదినం రోజు. అందరూ పరామర్శించాక. వీరాస్వామిని అందరితోపాటుగా నారాయణరావుకూడా రెండు అనునయవాక్యాలు పలికి,

"ఏమిరా వీరయ్యా? మరి బాకీసంగతేం చేశావురా?" అన్నాడు పదునుగా వినేలా... "తీరుస్తాను దొరా...ఒక సంవత్సరం ఓపికపట్టండి. వడ్డీతో సహా తీర్చుకుంటాను" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

"సంవత్సరం ఆగితే ఎలా? ఇప్పటికే రెండు వేలు చిల్లరయి మూడు కావస్తోంటే" వీరాస్వామి స్తంభించిపోయ్యాడు. భృకుటి కుంచిస్తూ వినమ్రుడై తగ్గుస్థాయిలో పలికాడు. "సరిగా చూడండి దొరా! నేను తీసుకున్న బాకీ వడ్డీతో సహా వెయ్యిరూపాయిలు కాదు." అన్నాడు.

"అయితే నేను అబద్ధమాడుతున్నానంటావా?" అన్నాడు కృత్రిమమైన చిరునవ్వుతో. అనూహ్యమైన ఈ సన్నివేశం, సంభాషణలు విభ్రాంతి చెందించాయి. వీరయ్య కొద్దిగా ఉద్రేకపడ్డాడు. పొంగివస్తూన్న ఉద్వేగాన్ని అణచుకుంటూ,

"సరిగా చూడండి దొరలు......మరచిపోయ్యుంటారు" అన్నాడు దీనంగా, వ్యవహారసఖ్యం పురస్కరించుకొని.

"అంతేరా! తీసుకొనేప్పుడుండే బుద్ధి, ఇచ్చేటప్పుడుంటుందా?...వెధవలు...అవసరమైతే కాళ్లావేళ్లాపడతారు. అవసరం తీరినతరువాత, ఈకూతలట్రా...ఏ పెద్దమనిషి చెప్తాడో చెప్పమను" అంటూ ఆనోటు పెద్దమనుష్యుల ముందు విసిరాడు.

ఒక పెద్దమనిషి నోటు పరీక్షించసాగాడు. అతడి నుద్దేశించి "పెద్దగా చదవయ్యా...ఇందులో దాపరికం ఏముంది...కళిక రొఖ్ఖం, ఇరవై అయిదు వందలు" అన్నాడు వేళ్లో చెపితే ఇంపుగావుండదని నారాయణరావు. నారాయణరావుగారిమాట శిరసావహించి, ఆ పెద్దమనిషి బిగ్గరగా చదువనారంభించాడు.

"అనాఫలానా సంవత్సరం మొదలుకొని...వినా హానిమిత్తమై తీసుకున్నరొఖ్ఖం (రూ. 1400) పద్నాల్గు వందలరూపాయలు, అక్షరాలా అంటూ చదువసాగాడు. నోటుచదవటం పూర్తయింది.

"మీరైనా చెప్పండయ్యా..వడ్డీతో సహా మూడు వేలరూపాయిలు కావటం లేదటయ్యా" పెద్దమనుషుల గోష్ఠిని ప్రశ్నించాడు నారాయణరావు.

ఒక పెద్దమనిషి—"ఇన్నివందలు పుచ్చుకోటాని నీసంపాదనంతా ఏమైపోయిందిరా వీరయ్యా" అని ఓ మాట అర్థోక్తిలో పలికి "అయినా ఇచ్చింది మీరు పుచ్చుకొన్నది వాడు...మధ్యలో మేమేమి చెప్పగలం!" అంటూ వెనక పీడన్నట్లు నిష్క్రమించాడు. పెద్దలందరూ జారుకున్నారు.

"మీరు న్యాయం చెప్పకపోతే కోర్టు లేదా? సాక్షులు లేరా? ఈవిషయం అక్కడే తేల్చుకుంటాను" అంటూ నారాయణరావు కొరకొర చూసుకుంటూ వెళ్ళిపోయ్యాడు.

అందరూ వెళ్ళిపోయ్యాక, వీరాస్వామి కూలిపోయిన కొలిమి బూడిదపై చతికిలబడ్డాడు. శూన్యంలోకి చూస్తూ గత జీవితాన్ని ఒకసారి నెమరువేసుకున్నాడు. సమ్మెటపై చెమట ధారబోసిన డబ్బంతా ఆ బూడిదలో ఇంకిపోయినట్లు అనుభూతి కలిగింది. తల్లిదండ్రి అనాలోచితంగా గుర్తుకొచ్చి కుమిలిపోయ్యాడు. ఆనందంతో సుఖంగా గడుపవలసిన ఈ వయసులో తన చిన్నిబాధలు ఆవహించాయో, శోకం ముంచుకొస్తూండగనే, నిద్రాదేవత ఆవేశించింది. రెండవరోజు ఉదయం ఊళ్ళోకెళ్లి పదిమందితో చెప్పుకున్నాడు. చెరువుగట్టున చింతమానుక్రింద కూర్చొని "డబ్బు దాచినప్పుడుగాని తీసుకున్నప్పుడుగాని మాకు తెలియపర్చావా? ఇప్పుడు నన్ను అన్యాయం చేశాడంటే, లాభం ఏముంది వీరయ్యా...అసలు ఇంత రాద్ధాంతం జరుగుతుందని మొదటనే అనుకున్నాం. ఆపాలం నీకు దక్కుతుందని నమ్మకంలేదు" అన్నారు.

"నారాయణరావు ఆపాలమంతా అన్యాయంగా సంపాదించినదేగా" అన్నాడొక వృద్ధుడు.

"నోటుమీద నీసంతకంవుండగా మనం చేయతగ్గదేదీ లేదు వీరయ్యా!...అనుభవించక తప్పదు...అతన్ని నమ్మిమోసపోయింది నీ ఒక్కడివే కాదుగా" అంటూ పొన్నుగఱ్ఱలు చేతబట్టి సమావేశం ముగించారు.

మూడువారాలు తిరిగేలోగా, వీరాస్వామికి "సమన్లు" అందాయి. కోర్టుకు హాజరయ్యాడు. తనతరఫున ప్లీడర్ని పెట్టటానికి చాలినంతడబ్బు లేకపోయింది. న్యాయవాదిముందు, తన నిజాయితీకి, అమాయకతకూ విలువలేకపోయింది. వాస్తవపరిస్థితులు వీరాస్వామి ఏకరువుపెట్టుకోటానికి అవకాశం లేకపోయింది. చట్టం ప్రకారం నారాయణరావుకు న్యాయం చేకూరింది. వ్రాతపూర్వకమైన రుజువున్న కారణంచేత వీరాస్వామికున్న రెండెకరాలచెక్క బాకీక్రింద చెల్లిపోయింది. చాటున అన్యాయం, అక్రమమని వాదించినవారవ్వరూ, ఇప్పుడు సాక్ష్యంచెప్పలేదు.

ఎలాగో మరణశిక్ష తప్పి ఇరవై సంవత్సరాల కారాగార వాసం విధించబడింది. ఆ ఇరవై సంవత్సరాల శిక్ష జైలరుపై వీరయ్య తీసుకున్న చర్యలో ఐదు సంవత్సరాలు పొడిగించబడింది.

వీరాస్వామి, భూస్వామి నారాయణరావు పట్ల దుర్మార్గంగా ప్రవర్తించాడు. అమానుషకృత్యం చేశాడు.

కాని నారాయణరావు స్వేచ్ఛగా బ్రతికివున్న రోజుల్లో అన్యాయంగా అక్రమంగా ప్రవర్తించి, అమాయకులను ఏదో నేరంలో ఇరికించి, దొంగ ప్రానోట్లు పుట్టించి వారి ఆస్తిపాస్తులు తనవశం చేసుకున్నాడు. అయితే వీరాస్వామిలా ఎవ్వరైనా క్రౌర్యం చూపలేదు. కలం కాగితంతో కోర్టుద్వారా పనులు చేయించుకొన్నాడు. నారాయణరావులో ఆ ప్రశాంతత, గంభీరత పిరికితనం కావచ్చు...ఆత్మసంయమనం కావచ్చు.

దుర్మార్గం జరగకుండా ఆపటం, అపరాధిని శిక్షించటం బాగానే వుంది. న్యాయశాస్త్రరీత్యా చట్టం ప్రకారం వీరాస్వామిని కొన్ని దశాబ్దాలతరబడి కారాగారంలో నిర్బంధించారు. కఠినశిక్ష విధించారు. నున్నగా తలగొరిగించారు. చాలీచాలని గళ్ళ చొక్కాలు వికారంగా తొడిగారు. గానుగ లాగించారు. ఎన్ని విధాల అవమానం చెయ్యటానికి సాధ్యపడుతుందో అన్ని విధాలా 'మానభంగం' చేశారు. అపరాధిని శిక్షించటం కోసం ఇన్ని మార్గాలు సృష్టించినా ఆశించిన ఫలితం కలుగలేదు...శిక్షద్వారా భావపరివర్తన కలుగలేదు. పైగా వీటన్నిటికీ ఫలితంగా ఆ దుర్మార్గపు చేష్టలు, హత్య చెయ్యటానికి కావలసిన మూర్ఖత్వం, కసి, ద్విగుణీకృతమై జీర్ణించుకుపోయాయి. ఈ మానసిక ప్రవృత్తులు "ఇక బ్రతికి ప్రయోజనం లేదనే నిరాశ"తో పెనవేసుకొనిపోయి పరాకాష్ఠనందుకున్నాయి. ఆ పరిస్థితుల్లోనే వీరాస్వామి జైలరును హత్య చెయ్యటానికి ప్రయత్నించాడు.

వయస్సొచ్చినతరువాత జీవితమంతా ఖైదీగా గడిపివేశాడు. అన్నివిధాలా పూర్తిగా భ్రష్టుడైపోయిన తరువాత స్వేచ్ఛగా విడుదలచెయ్యబడ్డాడు ఆ దిక్కుమాలిన సత్రానికి.

*　　　*　　　*　　　*

రెండో ఆట సినిమా విడిచిపెట్టే వేళ కావస్తోంది. ఖాళీరిక్షాలు రోడ్డుపక్కకు లాగి ముడుచుకొని వాటిల్లోనే పడుకున్నారు రిక్షావాళ్ళు. ఇద్దరుస్త్రీలు చక్కగా అలంకరించుకొని రోడ్డుమలుపులో ఎవరికోసమో నిరీక్షిస్తున్నారు.

'గుంటగ్రౌండ్స్' దగ్గరవున్న అబ్లాలైటు అరుగుపై వీరాస్వామి తప్పతాగిపడి ఉన్నాడు. శోకతప్తమైన ఒక వనిత చింతనే రాగాలాపన చేస్తోంది దుఃఖితస్వరాన. సింహాద్రి ఒక చేతితో వీరాస్వామిని గట్టిగా చొక్కా వెనుకవు మడిచిపట్టుకొని ఆమెను ఓదార్చుతున్నాడు. నలుగురూ పోగయ్యారు. ఒకవ్యక్తి న్యాయరక్షణార్థమై పరుగెత్తుకొనిపోయి పోలీసులను ప్రవేశపెట్టాడు.

"ఒక్క కేకా తెంచింది" ప్రశ్నించాడు పోలీసు.

"అవునండీ ... ఒక్క గోలు పెట్టిందండీ...అంతలోనే వాడు పరుగున వచ్చి పెద్దగా అరిచాడండీ...ఆ అరుపుకు మా వాళ్ళు లేచి వెంబడి పడ్డారండీ..." ఏడుస్తూనే సమాధానమిచ్చింది.

"ఇప్పుడేనా సామ్యూ?" అన్నాడు పోలీసు.

"ఇగోనండి" అని తెగిపోయిన ఓ కంఠహారాన్ని చూపించాడు సింహాద్రి.

"సరే నీ పేరు?"

"నా పేరు రామారావండి" వినయంగా చెప్పాడు సింహాద్రి.

"నీ భార్య పేరు?"

"సత్యవతి" జవాబిచ్చింది ఆ వనిత తల ఆడించుకుంటూ. ఇంకా 'వీరాస్వామి'ని బంధించిన ముగ్గురు పేర్లు 'నోట్' చేసికొని మీరంతా రేపు తాలూకా ఆఫీసులో హాజరుకండి" అని ఆదేశించి 'వీరాస్వామి' చేతికి బేడీలు తగిలించారు పోలీసులు.

జిల్లాకోర్టు వెనుకనున్న ఆధునప్రాంగణంలో అడుగుపెట్టటంతో "అమ్మయ్య" అన్నట్టు ఒక నిట్టూర్పు విడిచాడు వీరాస్వామి. జన్మభూమిలో అడుగుపెట్టి ఒక్కొక్క చీకటికొట్టు దాటుతుంటే ఒక ఖైదీ ఇనుప చువ్వలమధ్యగా తలదూర్చి "సీతుంగ, నీగంజి బొచ్చ ఎదురుచూస్తున్నది రోయి" అని స్వాగతం పలికాడు. కిర్రున ఒక ఇనుపచువ్వలగేటుతీసి, లోపల ప్రవేశపెట్టారు వీరాస్వామిని. ఆనందాశ్రువుల్లా రెండు కన్నీటిబొట్లు అతని వదనంపై జారాయి. కాళ్ళు తేలిపోతున్నాయి. గుండెలో పోటుగావుండి బాధగా నేలపై ఒరిగాడు...

సుప్రభాతానికి విముఖత్వం చూపుతూ జైలు గోడలో దూరింది గుడ్లగూబ జాగలూ, దోమలూ, త్రాగుబోతులూ, రోడ్లు ఖాళీచేస్తున్నారు. విచారణకై హాజరుపరచవలసిన ఖైదీలను ఆయత్తపరుస్తూ వార్డెన్ 'వీరాస్వామి' గదిలోకి తొంగిచూశాడు.

వీరాస్వామి అర్ధనిమీలిత నేత్రాలతో నిశ్చలంగా చూస్తున్నాడు. అచంచలంగావున్న ఆ భౌతిక దేహపు కనురెప్పలు ఎంతసేపటికీ మూతపడకపోవటం చూసి "అమ్మో" అని గావుకేక పెట్టి పరుగెత్తాడు వార్డెన్.

'సైరను' లేచి పెద్దగా ఆవులించి, మళ్ళీ పడుకుంది.

# గయశాసనము జయశాసన మెట్లు?

శ్రీ కె. హెచ్. వి. శర్మ

రాయల గయశాసనమునుగూర్చి చర్చ ఇప్పటికే చాల పెరిగినది. పరిశోధనరంగమున ననేక పండితుల, విమర్శకుల దృక్కులనాకర్షించి గయలో దొరకిన తదితర శాసనముల సాహచర్యమున నిదికూడ నట్టి యాత్రికుల శాసనము (Pilgrims record) అని చాలమంది యభిప్రాయమైయుండగా, డాక్టరు వెంకటరమణయ్యగారు దీని కితరశాసనములతో ప్రమేయము లేదనియు అందులో చెప్పబడినట్లది విజయశాసనమే అనుచున్నారు. తదనుగుణముగ ఆగస్టు సంచికలో నేను చేసిన ఆక్షేపణల నన్నింటిని ఖండించి మరల అక్టోబరు సంచికలో "రాయల గయశాసనము జయశాసనమే"— అని సిద్ధాంతీకరించిరి. వారు ప్రతిపాదించిన సిద్ధాంతములోగల కొన్ని సందేహములను తెలిసికొనుటకే మరల ఈ వ్యాసము వ్రాయుచున్నాను.

వారు రాయల గయశాసనము విజయశాసనమే గాని యన్యము గాదని నిరూపించగల ప్రబల సాక్ష్యమా శాసనమందే కానవచ్చుచున్నదని ఇట్లు దెల్పిరి. "శాసనముయొక్క చివరిభాగము రెండు చీలికలుగ విభజింపబడియున్నది. ఎడమప్రక్క చీలికయందు 'వరనందన బాసవప్పవరగండ్డాంకొ్క' యను పద్యపాదము నైదు చిన్నపంక్తులుగ నొకదానిక్రింద మఱియొకటి చెక్కబడినవి. కుడిప్రక్క 'యీశాసనము ముక్కు తిమ్మయ్యవ్రాసెను' అను వాక్యము ఎడమప్రక్క చీలికవలె నైదుపంక్తులుగ జెక్కబడియున్నది. (అచ్యుతరాయల గయశాసనమునందు కూడ ఇట్లే చీలికలుగ విభజింపబడి చెరియొకప్రక్క పంక్తులు చెక్కబడి కలవు.) ఈ రెండు చీలికలనడుమ ఆయుధపాణులయిన పురుషులు ముగ్గురు నిలిచియుండునట్లు చెక్కబడియుండు శిల్పమొక్కటి కానవచ్చుచున్నది. ఆ ముగ్గురిలోను మధ్యనిలిచియున్న పురుషు డురుదీర్ఘకాయుడు. ఖడ్గముతోడి దక్షిణహస్తమును శిరస్సుపైకెత్తి కట్టెదుట తనకభిముఖుడై నిలిచి యాయుధపాణియై యెదిరించుచున్న ప్రతివీరు నొక్కని వ్రేయ నుంకించుచున్నాడు. తక్కినవారు మధ్య నిలిచియుండు నా యోధుని పిఱుద నాతనికి బాసటగ కుడిచేతఖడ్గముతో లేక యట్టి యాయుధముతో పూని నిలిచియున్నారు. ఈ శిల్పము మనపూర్వికులు యుద్ధక్షేత్రములందు నెలకొల్పు వీరశిలాఫలకములవంటిది."—అని డాక్టరు రమణయ్యగారు కృష్ణరాయల గయశాసనమును వీరకల్లు (Herostone) గా నిర్ధారణచేసినారు. సుప్రసిద్ధ శాసనపరిశోధకులగు డాక్టరు రమణయ్యగారు విజయశాసన వీరగల్లులకు గల భేదమును గమనింపకుండుట కడుశోచనీయము. మానప్రాణసంరక్షణార్థమై వీరులు యుద్ధములలో ప్రతిపక్షుల నెదిర్చి ధైర్యసాహసములతో పోరాడి మృతినొందినవారి స్మారకార్థమై యెత్తించెడి శాసనములను 'వీరశిలాఫలకము' లందురు. శాసనపరిశోధకుల పరిభాషలో వీటికి "హీరోస్టోన్స్" అని పేరు. ఇట్టి శిలాఫలకములపై[1] చిత్రములు కొన్ని వరుసలుగ చెక్కబడి, ఆ వరుసలమధ్య శాసనాక్షరములు లిఖింపబడియుండును. యుద్ధములలో మరణించినవారికి స్వర్గము లభించును. "హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్" అనుగీతావాక్యము ననుసరించి ఈ వీరశిలాఫలకముల యుపరిభాగమున సామాన్యముగ నీక్రింది శ్లోకము చెక్కబడియుండును.

"జితేన లభ్యతే లక్ష్మీః మృతేనాపి సురాంగనా,
క్షణవిధ్వంసినీ కాయే కా చింతా మరణే రణే"—

ఈ అర్థమునే సూచించు చిత్రములు సింహాసనస్థుడైన దేవేంద్రుడు, అప్సరసలు మున్నగునవి ఆ శిలాఫలకముల పైవరుసలలోను; శిరస్త్రాణములు ధరించిన యోధులు కత్తులు, కటారులతో బాహాబాహిగాని, హస్త్యశ్వాదివాహనములపై గాని పోరాడుచున్నట్లు క్రిందివరుసలలోను చిత్రింపబడియుండును. ఇట్టి శాస

1. (i) గోవా వీరగల్లు:—భారతి పంచమసంపుటము, ద్వితీయభాగము (విభవసంవత్సర శ్రావణమాసము) పేజీ 826 (ii) Three Herostones from Kaikini; Archaelogy of Karnatak by R.S. Panchamukhi, page 34. etc.

వములలో నా వీరుని జయాపజయములతో పని లేదు. ధైర్యసాహసములతో ప్రతిపక్షుల నెదిర్చి పోరాడి మృతినొందుటయే ప్రధానము. మృతినొందిన వీరుని పేరు, అతని సాహసకార్యము తప్పక యుండుండి తీర వలెను. గయాశాసనమున కృష్ణరాయలపేరు తప్ప (పాపము శమించుగాక!) మరి ఏ వీరుని పేరును లేకుండుట యెంత అనుచితమో యూహింపుడు.

నేనా శిల్పము మహిషాసురమర్దినివలె కాన్పించుచున్నదనుటకు కారణములు.

“నవయౌవన సంపన్నాం సర్వాభరణభూషితాం,
సుచారు దశనాం తద్వత్ పీనోన్నత పయోధరాం.
త్రిభంగస్థాన సంస్థానాం మహిషాసురమర్దనీం,
మృణాలాయత సంస్పర్శ దశబాహు సమన్వితాం.
త్రిశూలం దక్షిణే పాణౌ ఖడ్గం చక్రం క్రమా దధః,
తీక్ష్ణబాణం తథా శక్తిం దక్షిణే సన్నివేశయేత్.
ఖేటకం పూర్ణచాపంచ పాశ మంకుశ మేవ చ,
ఘంటాం వా పరశుం వాపి వామతః సన్నివేశయేత్.
అధస్తా న్మహిషం తద్వ ద్విశిరస్కం ప్రదర్శయేత్.”

అను వర్ణనల ననుసరించి ఆ శిల్పములోని విగ్రహమునకు దశభుజములు, త్రిశూల, ఖడ్గ, చక్ర, శక్తులు దక్షిణ హస్తములలోను, ఖేటక, పూర్ణచాప, పాశాంకుశములు వామహస్తములలోను, దక్షిణపాదము క్రింద శిరస్సొకటి కాన్పించుట బట్టి నేనట్లూహించితిని. వారు మరల స్పష్టముగ ప్రకటించిన ప్రతిబింబములో నే యెడమవైపు (యీశాసనము ముక్కు తిమ్మయ వ్రాసెను అను ప్రక్క) ముంజేతుల కాభరణములుగల మృణాలాయతహస్తములు నాలుగు స్పష్టముగ కాన్పించుచున్నవి. అందు ఖేటక, పూర్ణచాపములతో గల హస్తములు ఊర్ధ్వముఖముగను పాశాంకుశములతో గూడిన హస్తము లధోముఖముగను చిత్రింపబడి, మొత్తము విగ్రహమునకు అష్టభుజము లుండినట్లు రుజువుచేయుచున్నవి.

“సుకృతార్థము చేసిన తీర్థయాత్రను ప్రకటించుటయే ఈశాసనోద్దేశమైన వంగు కత్తులు కటార్లతో యుద్ధముచేయు శిల్పముతో నేమిపని?”—అని ప్రశ్నించినారు. మహిషాసురవధలో ముగ్గురు కత్తులు కటార్లు మొదలగు ఆయుధములతో గాక మరి దేనితో పని?— “అట్లయినను అది రాయల జైత్రయాత్రను సూచించునే కాని తీర్థయాత్రను సూచింపదు. దుర్గాదేవి యుద్ధమున కధిదేవత—పూర్వము విజయనగర చక్రవర్తులేమి తక్కిన హిందూభూపాలురేమి శరన్నవరాత్రోత్సవములు జరిపి యుద్ధయాత్రలు వెడలువారు.”—అంటే ఆశ్వయుజ శుద్ధదశమి (విజయదశమి)నాడు దుర్గాదేవిని పూజించి కృష్ణదేవరాయలు, జైత్రయాత్రకు బయలు దేరియుండవలెననిగదా వారి యభిప్రాయము. కాని ఈశాసనకాలము ఆషాఢ బహుళ త్రయోదశి మంగళ వారమని అందేగలదు. కావున ఇదియు సరియైనది కాదు.

ఈశాసనమును వ్రాయించిన ముక్కు తిమ్మన తన పారిజాతాపహరణములో—

“తిమ్మయాఖ్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు”—

అని స్పష్టముగ చెప్పుకొనినాడు. పెద్దనవలె గాక నీతడు స్వమతమునందు మిక్కిలి పట్టుదల కలవాడు. కనుక నే తీర్థయాత్రకై గయాశిరి యందు తాను వేయించిన శాసనముపై మహిషాసురమర్దని శిల్పమునుకూడ గయ వద్ద చెక్కించియుండును. మరియు శాసనములను అందుండు శిల్పములనుబట్టి అన్వయించుట సర్వత్ర కుదరదు. ప్రస్తుతకాలములో చక్కటి శాసనశిలలను మనవారెట్లు ఇండ్లకు, కట్టడమునకు నుపయోగించుచుండిరో అట్లే వారి యవసరార్థ మిదివరలో శిల్పము చెక్కబడిన శిలలపై పూర్వులు శాసనములు చెక్కించుట కూడగలదు. అంతమాత్రమున ఆ రెండింటికి సంబంధముండెనని నిశ్చయించుటకు వీలుపడదు. ఈ శిలాఫలకములో శాసనాక్షరములు లోనికిని, శిల్పముపైకిని చెక్కబడియుండుటచే శాసనమునకై తీసిన ప్రతిబింబములో శిల్పము పూర్తిగా రాదు. దానిని ప్రత్యేకముగ ఫొటో తీసి పరిశీలించవలెను. ఇట్లు అస్పష్టమగు శిల్పము నాధారముగ వారు చేసిన సిద్ధాంతము సరియైనది కాదు.

కృష్ణరాయల శాసనముతో బాటు గయాక్షేత్రమున దొరికిన మిగత యాడు శాసనములు నా వాదమున కనుకూలింపవనియు వాని ప్రస్తావనే అనవసరమనియు డాక్టర్ రమణయ్యగారనిరి. మొదటి రెండు - అనగా కాకతి ప్రతాపరుద్రుని నాటిది, హొయసళ వీరనారసింహదేవుని నాటిది శాసన పరిశోధకుల పరిభాషలో “ప్రైవేటు” శాసనము లనిరి. నిజమునకు ఆ పరిభాషలోనే గయ మొదలగు సుప్రసిద్ధ పుణ్యక్షేత్రములందు గల శాసనములకు యాత్రికుల శాసనములు (Pilgrim's records) అని వీనికి చరిత్రకారు లెవ్వరు నంతగా ప్రాధాన్య మివ్వరు. కారణము యాత్రికులకు వాస్తవ చరిత్రాంశములతో పని లేకుండు

టయే. రాజు దైవాంశసంభూతుడు; అతనిరాజ్యములోని ప్రజలెవరైనా యెక్కడైనా దానధర్మాది పుణ్యకృత్యము లాచరించునపుడు "యో రాజా స పితా మాతా ప్రజానా మేవ నిశ్చయః"—అనునూక్తి ననుసరించి యాతనికి గూడ కొంత పుణ్యము నంటగట్టుటకే వారు వేయించిన శాసనములలోను రాజులను పేర్కొందురు. కనుకనే మన శాసనములలో నూటికి తొంబది తొమ్మిదింట ఆయాశాసనములతో రాజుల కేమియు ప్రమేయము లేకుండినను వారిని పేర్కొనుట. అట్లే తీర్థయాత్రకై యరిగిన గౌరి శాసనములో కాకతి ప్రతాపరుద్రుడు, అప్పణ్ణన శాసనములో హొయసళ వీరనారసింగదేవుడు, ముక్క తిమ్మన్న శాసనములో విజయనగర శ్రీకృష్ణదేవరాయలు, తిమ్మణన్న శాసనములో విజయనగర అచ్యుతదేవరాయలు ఆయాకాలపు రాజులు పేర్కొనబడిరి. ఈ శాసనములను బట్టి ఆయా రాజులచే వారు పంపబడినారో లేదా తమంతట తామే తీర్థయాత్రలకై యరిగి శాసనములు వేయించుతిరి ఆచారప్రకారము ఆయా రాజులను పేర్కొనినారో స్పష్టముగ చెప్పలేము.

"కృష్ణరాయలు తిమ్మనను గయకంపెననుటకు శాసనమునం దెట్టి యాధారమును లేదు. మఱియు నంది తిమ్మన నియోగిబిడ్డ యని శర్మగారే చెప్పుచున్నారు. అతడు మహాకవి. శ్రాద్ధాదికర్మలను చేయించుటగాని, యజమానునకు ప్రత్యామ్నాయముగ చేయుటగాని రాజపురోహితుని నియమితకృత్యము. కావున శ్రీకృష్ణదేవరాయలు తన పితౄళ్ళకు గయాశ్రాద్ధము జరుపవలనని యుద్దేశపడియుండిన నిజపురోహితుడైన రంగనాథదీక్షితులనో లేక మఱియొక వైదికునో పంపక నియోగిబిడ్డ నంపియుండడు. తిమ్మనయు నట్లు పోయి యుండజాలడు. కావున, కృష్ణరాయల విజయశాసనమును ధర్మశాసనముగ మార్చవలయునని శర్మగారు చేసిన ప్రయత్నమామోదింపదగినది కాదు. పైగా అందు పితృస్మరణయే లేదు."—అని డాక్టరు రమణయ్యగారు నిరసించిరి. వారు ముక్క తిమ్మన యొక్కడే గయకువెళ్ళి రాయల పితౄళ్ళకు స్వహస్తములతో శ్రాద్ధాదికర్మలు నిర్వర్తించిన ట్లభిప్రాయపడినట్లున్నారు. ఏ కాలములోనైనా తీర్థయాత్ర అంటే అనను మయిదారుగురికి తక్కువ కాకుండ వెళ్ళరుగదా! (ఆ విషయము హొయసళ నారసింగదేవుని శాసనమునుబట్టి స్పష్టము) కావున ఆ వెళ్ళినవారిలో నిజపురోహితుడైన రంగనాథ దీక్షితులు నుండవచ్చు, లేదా అట్టి విధ్యుక్తకర్మలు జరిపించుటకుగాను వైదికబ్రాహ్మణులు నుండవచ్చును. కేవల వైదికవృత్తిగా గయవద్దనుండే బ్రాహ్మణు లేమైనారు? ఆ యాత్రికు లందఱిలో మహాకవి ముక్క తిమ్మన ప్రధానుడు. మఱియు శాసనము వేయించినవాడు గనుక యాతని పేరుమాత్రము శాసనములో గలదు. "పైగా అందు పితృస్మరణయే లేదు." అని వ్రాసిచ్చిరి గదా. "ఈశ్వర నరసభూపురందరవర"—అను పద్యపాదములోని ఈశ్వర, నరసానాయకులు కృష్ణరాయల తండ్రి తాతలుగాక మఱెవ్వరు?

ఇక అచ్యుతరాయల శాసనమును గూర్చి—"ఇది ధర్మశాసనమని యందే స్పష్టముగ గలదు. ధర్మశాసనమనగా మతమునకు సంబంధించినది. ఈ శాసనము వ్రాయించినవాడు తిమ్మణన్న—అతడు గయయందు చేసిన కార్యమెద్దియో వివరించియుండలేదు గాని 'విజయనగర సింహాసనకర్తల గయాముక్తం చేసెను' అని యున్న"దని నుడివిరి. గయయందు తిమ్మణన్న చేసిన కార్యమే అది; అంటే విజయనగర సింహాసనకర్తలను గయాముక్తము సేయుట. మఱి ఆ కార్యము వివరించక పోవుట యనగా నెట్టిది?—ఇప్పుట నొక యనర్థాచిక చెప్పి అందిట్లు వివరించిరి. "ఇందు పేర్కొనబడిన విజయనగర సింహాసనకర్త లెవ్వరో విచారించదగియున్నది. శాసనములో తిమ్మయ ఈశ్వర నారసింహ అను పేర్లున్నవి. వీరు అచ్యుతరాయల పితృపితామహులు అని శర్మగారు నుడివిరి. పితృపితామహ ప్రపితామహు లని యుండిన పై మూడు పేరులును కలసివచ్చియుండెడివి. ఈ సందర్భమున శర్మగారు తమ మనస్సును విప్పిచెప్పకున్నను వారి ధోరణినిబట్టి చూడగా పై పేర్కొనిన తిమ్మయ ఈశ్వర నారసింహులే తిమ్మణన్నచే గయాముక్తులుగ చేయబడిన విజయనగరసింహాసన కర్తలని వారి యభిప్రాయమై యుండునని తోచుచున్నది. (నా మనస్సులోని యభిప్రాయమును సరిగా విప్పి చెప్పినందులకు డాక్టరు రమణయ్యగారికి నా అభినందనములు.) సింహాసనకర్త యనగా సింహాసనాధిపతియని యర్థము. తిమ్మయ ఈశ్వరనారసింహులయం దెవ్వరును విజయనగర సింహాసనము నధిష్ఠించియుండలేదు."—ఈ శాసనమును వేయించిన తిమ్మణన్న చరిత్రకారుడు కాదు. పండితుడు కాడు. తా నెవరికి గయాముక్తము సేసెనో వారల పేర్లను జెప్పి వాడుకప్రకారం మందఱిని విజయనగర

సింహాసనకర్తలని పేర్కొనినాడు. మనుచరిత్ర, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద మున్నగు ప్రబంధములలోను, తుళువవంశజుల తామ్రశాసనములలోను రాయలపితృపితామహప్రపితామహులుగా వర్ణింపబడే తిమ్మయ, ఈశ్వర, నారసింహులు వీరలేకదా! తిమ్మయ్య ఈశ్వరులు వారు చెప్పినట్లు విజయనగర సింహాసనము నధిష్ఠించనిమాట వాస్తవమే కాని నరసానాయకుడు విజయనగరసింహాసనము నధిష్ఠించనిదే యాతనిపుత్రులగు వీరనారసింహ, కృష్ణరాయ, అచ్యుత రాయలకు విజయనగర సింహాసన మెట్లు లభించినది? "కావున తిమ్మగన్నచే గయానుక్తులు గావింపబడిన విజయనగరసింహాసనకర్తలు వారయి యుండరాయని సంశయము గలుగుచున్నది."—ఈ సంశయమును బాపి నిర్ధారణ చేయవలసిన బాధ్యత విజయనగరచరిత్రకారులగు డాక్టరు రమణయ్యగారిపైనే యున్నది.

ఇక కృష్ణదేవరాయల చరిత్ర పట్టుననే గాక సమస్తమైన పూర్వ హిందూరాజుల యొక్కయు రాజ్యముల యొక్కయు చెల్లగల సత్యము నొక్కదాని నిట్లు వక్కాణించిరి. "మనపూర్వికు లెవ్వరును మనదేశచరిత్రాత్మక గ్రంథములను రచించియుండలేదు. బ్రిటిషు యుగమున ఆంగ్లేయులతోడి సంపర్కమువల్లను నాంగ్ల విద్యాభ్యాసమువల్లను భారతీయులకు, ముఖ్యముగ హిందువులకు చారిత్రకజ్ఞానోదయమైన పిమ్మట క్రీ. శ. 19 వ శతాబ్దము తుదను 20 వ శతాబ్ద ప్రారంభమునను నిజదేశ పూర్వచరిత్ర నెరుకగా నప్పుడు తద్విషయగ్రంథముల యభావము వారి కెరుకపడెను."—మనపూర్వులు చరిత్రాత్మకగ్రంథము లని ప్రత్యేకముగ వ్రాయకున్నను చారిత్రకవిషయములను గూర్చి క్రీస్తుపూర్వము నుండియే మన పురాణ, ఇతిహాస, కావ్య, నాటక, ప్రబంధాదిగ్రంథములలో యథాతథముగ గాకపోయినను అతిశయోక్తులు జొప్పించియైన తెల్పుచునే యుండిరి. అట్లే తామ్రశిలాశాసనములలో రాజులవంశవర్ణనలు, రాజ్యాభిషేకకాలములు, దిగ్విజయములు మున్నగు విషయము లన్నియు గలవు. తూర్పు చాళుక్యుల తామ్రశాసనములలో నెవరెవ రెన్ని సంవత్సరములు పాలించిరో యెన్నెన్ని యుద్ధములు చేసిరో కూడ ఆ శాసనకావ్యకర్తలు స్పష్టముగ తెల్పుచు నేయుండిరి. ఆముక్తమాల్యదలో కృష్ణరాయలే తన దిగ్విజయముల నన్నింటిని వర్ణించినాడు. రాజతరంగిణి, భోజచరిత్ర, ప్రతాపచరిత్ర, వెలుగోటివారివంశావళి, కృష్ణరాయవిజయము, రాయవాచకము మున్నగు గ్రంథములు చారిత్రక గ్రంథములు గాక యేమగును?

శికందర్ లోడీనిగురించి వ్రాయుచు డాక్టరు రమణయ్యగారు "జగన్నాథగల్లభనాటకవిజయమునందు ప్రతాపరుద్రగజపతియొక్క ప్రతిపక్షిగ పేర్కొనబడిన సికందర్ ఎవ్వడో కాదు; అతడు ఢిల్లీశ్వరుడైన శికందరు లోడీయే. అతడు యమునాపురాధినాథుడైన హుసేన్‌షా షార్కి నోడించి యతని రాజ్యమును హరించెను. హుసేన్‌షా ప్రతాపరుద్రగజపతి నాశ్రయించెను. ఈ కారణముచేతనో ప్రతాపరుద్రగజపతి సికందర్ లోడి నెదిర్చి యుద్ధముజేసి విజయము గైకొనెను. ఆ విజయకారణముననే ప్రతాపరుద్రగజపతి 'పంచగౌడాధినాయక' యని బిరుదు ధరించినది."—అని తెల్పిరి. దీనినిబట్టి ఢిల్లీశ్వరుడైన శికందర్ ప్రతాపరుద్రగజపతికి నోడిపోయినసంగతి స్పష్టమేగదా! ఈ ప్రతాపరుద్రగజపతి నే కృష్ణరాయలు తన కరిగాపు చేసికొనినదికూడ. కనుకనే పెద్దనార్యుడు "ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమారతను" అనే సీసపద్యములో ఢిల్లీశ్వరుడైన శికందర్ లోడీని జయించిన ప్రతాపరుద్రగజపతియే రాయలకరిగాపగుటచే సికందర్ కూడ నరిగాపైవశ్లే భావించి "శికందర సింధురాధ్యక్షు" లని యిద్దరిని చేర్చి వర్ణించి యుండవలెను.—"క్రీ. శ. 1517 వఱకు ఢిల్లీ పఠానురాజ్యమును పాలించిన శికందర్ లోడియొక్కడును, 1526లో మూడు మాసములకాలము గుజరాతును పాలించిన శికందర్ షా యొక్కడును దప్ప రాయల సమకాలికులైన భారతీయ మహమ్మదీయ ప్రభువులలో శికందర్ నామధారులు మఱియెవ్వరును గానరారు. కలరేనివారిని శర్మగారు పేర్కొందురుగాక."—అని సవాలు చేసిరి. రాయల సమకాలికులగు భారత మహమ్మదీయ ప్రభువులలో శికందర్ నామధారు లుండుటను చారిత్రక శాసన వాఙ్మయముల పేర్కొనబడిరను సిద్ధాంతము డాక్టరు రమణయ్యగారు చేయగలరా? అట్లు సిద్ధాంత మగువఱకును ఆ నిర్ణయము కుదరదు.

కృష్ణరాయలు ముక్కు తిమ్మనను దనకు ప్రత్యామ్నాయముగ గయకు తీర్థయాత్రార్థము పంపెనని ఋజువు సేయుటకుగాను మఱియొకమార్గ మవలంబించి నేను కృష్ణరాయలు గొప్ప దైవభక్తుడు—శ్రీ వెంకటేశ్వరు డాతని యిష్టదైవము—తీర్థయాత్రాపరాయణుడు—

# గయాశాసనము జయశాసన మెట్లు?

వివరణగారి—అని యప్రస్తుతప్రశంస చేసితివనియు. అని యేమియు కృష్ణరాయలు ముక్కు తిమ్మనను తన మాతాపితల సుకృతార్థము గయకు తీర్థార్థ మంపెనను విషయమును స్థాపించుటకు సాక్ష్యములు కాజాలవు? గాన "నిరాధారమైన పట్టికథ నొకదానిని కల్పన సేయుటవలన గలుగు ప్రయోజన మేమి?"-అని గట్టిగా నన్ను గండలించినారు. "అవి యుత్తరాపథమున హిందూ మహమ్మదీయమతముల సంఘర్షణ భీషణమై జరుగుచుండిన రోజులు. మహమ్మదీయ ప్రభువులు హిందూ ధర్మమును నిర్మూలముసేయ నిశ్చయించి తమసంకల్పము నెఱవేర్చుకొనుటకు నిరంతరము కృషిసల్పుచుండిరి. సికందరు లోడీ స్వమతాభిమాని, పరమతద్వేషి. నిజమత మందలి దురభిమానము పెంపున హిందువుల నతిదారుణముగ పీడించెను. హిందూదేవాలయములను విఱుగ గొట్టించి వానిస్థానమున మసీదులను గట్టించెను. విగ్రహములను తునియలుగావించి యా తునకలను మాంస విక్రయమునందు కసాయివానిచే తూకరాళ్లుగ వాడుకొననియోగించెను. తీర్థములలో గ్రుంక రాదని శాసించి దేశాంతరగతులయిన యాత్రికులను ఘోరముగ బాధించెను. స్వమతాభిమానులైన హిందువుల నేకులను జంపించెను.

"హిందూధర్మసంరక్షకుడైన కృష్ణరాయలు సికందరు లోడికృత్యములను సహింపక యతనిపై దండువిడలి యుండవచ్చును"—అని వాస్తవ చరిత్రాంశములను ముచ్చటగా వివరించిరి.

"భారతీయ ప్రాచీనచరిత్రనుగూర్చి మనకు తెలిసిన విషయ మల్పము. తత్పూర్వ మపరిచితమైన చరిత్రాంశ మేదైన బయలుపడినపుడు మన యాదరణీయమైన జ్ఞానము నాధారముచేసికొని యవి యసంబద్ధములని చెప్పి వానికపార్థమును గల్పించుట పాడిగా"దని యనుచున్నారు.

కాని ఇట్లరకొరగ లభ్యమైన సాధనసామగ్రి నాధారముగ మనమేల సిద్ధాంతములు చేయవలెను? భావి పరిశోధనల వాని సత్యాసత్యములు వెల్లడియగువఱకు వేచియుండుట సమంజసము కాదా!

విజయనగరచరిత్ర, అందును కృష్ణరాయలను గూర్చి డాక్టరు రమణయ్యగారుచేసిన కృషి యద్వితీయము, పాశ్చాత్య భారతచరిత్రకారులలో నెవ్వరు నిట్టి పరిశ్రమ చేసియుండలేదనుట అతిశయోక్తి కానేరదు. మరల మరల వారివ్యాసములపై వ్రాయుచుండుట వారియందు నాకుండు గౌరవమును శంకించుటకే కారణమగును గాన రాయల గయాశాసనమును గూర్చిన చర్చ నంతటితో విరమించుచున్నాను.

---

2. కృష్ణరాయల నిర్యాణమును గూర్చి వ్రాయుచు డాక్టరు రమణయ్యగారు 'ఎపిగ్రాఫియా కర్ణాటికా' 9 వ సంపుటము మాగడి తాలూకా మాదనహళ్ళిలోని రాయలశాసనము నొకదానిని ప్రస్తావించిరి. అందు "కృష్ణదేవమహారాయరిగె గంగోదక సేవితరప్ప... కోనప్పనాయకరు"—అని గలదు. ఈ సందర్భమున వారు "పై శాసన పరిష్కర్తయగు లూయీరైసు గారు 'గంగోదకసేవితరప్ప' యను మాటలకు గంగోదకమును మోయువాడని (The bearer of the Ganges water to Krishnadevamaharaya) యర్థము చెప్పిరి. కృష్ణరాయలు స్వయముగా యాత్రచేసి గంగలో స్నానముసేయుటకు వలనుపడక పోగా నీ కోనప్పనాయకుని పంపి యతనిచే గంగాజలమును దెప్పించుకొని యందు స్నానమాడి యుండవచ్చును. ఇందసంగత మెద్దియు లేదు"—అని వచించిరి. (భారతి 80 వ సంపుటము, పేజీ 404)—వారి యభిప్రాయమును మరల మార్చుకొనకపోతే గయాశాసనమును గూర్చి నా యూహ కిదియు తోడ్పడగలదు.

# స్వాత్మార్పణము

శ్రీ మోచర్ల రామకృష్ణ కవి

ఛత్రపతి శివాజి చంద్రధ్వజాల యశః
పతనమునకు రాచబాట వైచి
పోయె దివికి — బ్రహ్మీభూయ మందెను గురు
స్వామి శ్రీ సమర్థ రామదాసు.

రాజయ్యెను బిమ్మట శంభాజీ – ఛత్రపతి కొమరుడు – పరిపాలన పుం
దేజుగల జేము గాడని రౌజప్వాన మొగలు పాదుషా దండెత్తెన్.

"చింతా శల్యము వాసె బరంతపుడు శివాజి మడిసె, బ్రాజేతలకున్
మంతువులకు బ్రతికృతి కావింతు జుమీ" యంచు మొగలు విభుడు తలంచెన్.

ఈ యోజ బాదుషా నిశ్చయకుడై బహుళసైన్య సన్నాహముతో
సూయాణము నడపె జిగీషాయత్త మనీషమై మహారాష్ట్రముపై.

అటు కాబూలు మొదల్కొని యిటు బంగాళమ్మువఱకు నెనగెడి వసుధన్
భటఘనపటలిన్ వలసినయటు లెవ డవురంగజేబు కంపక బ్రదుకున్?

అట్టి మొగలాయి సమ్రాట్టు పట్టవట్టి మూడుంతుల దండుతో గూడి వచ్చి
ముట్టడించి మహారాష్ట్రమును జయించి పతిని శంభాజి నలవోక బందిజేసె.

సంగర జయప్రమత్తు డౌరంగజేబు నిగళబద్ధుని శంభాజిని దన సమ్ము
ఖమునకుం దెమ్మటంచు లెంకలకు ముదల పూంచి రావించి నిలువబెట్టించి చూచి,

విల్లువలె వంగిపోయిన వెన్ను పూన సుకుగ బస్తున్న మానిసి చూడ్కి గదుర,
బుసలు వెట్టుచు, వెక్కసమ్మన మొగమ్ము జేగుఱింపంగ నౌరంగజేబు పలికె.

"ఓయీ, హేయము నీ మతమ్ము; దురితం బుత్పన్నమౌ దూష్యమౌ
నీ యాకారము కన్నులం బడిన; మన్నింపంగ రానట్టి వె
న్నో యేనస్సు లొనర్చె నీ పిత దురుద్యోగంబున న్నాకు; ద
న్న్యాయావిత్వము మూర్తిగై కొనియె యుష్మత్తుచ్ఛ జన్మంబునన్.

ఎవరు ముసల్మానులు గారవని గాఫర్లు వార లధములు చెడుగుల్
వివశులు శీర్షచ్ఛేద్యులు పవతులు మొగలాయిచక్రవర్తికి నాకున్.

నరకమున గూలనున్న ముష్కరుల నెల్ల దేర్ప వర్తిల్లెడి మహమ్మదీయ మతమె
నీకు నేడు శరణ్యము - స్వీకరింప వలయు నిది - ప్రాణములనైన వదలవలయు.

# స్వాత్మార్పణము

మా మత మవలంబించిన నీ మనుగడ నెగడు బుడమి నిరపాయముగా
సామంతుల మేల్బంతివి గా మెఱయంగలవు నిజముగా శంభాజీ!

మతకర్తవై నీ మతమే హితమని భావింతువేని; ఇపుడే నీ జీ
విత మంతము నొందుట నిశ్చితము సుమీ, చేయు మేమి చేయందగునో!"

నా విని నెఱ గుఱుతులకుఁ దావలములు గాని కన్నుఁదామరలఁ ఢి
ల్లీ విభుని మొగము గని, యా ప్రావ శివాజీ సుతుండు బదులు వచించెన్.

"తురకల్ పుణ్యులటంచు దక్కిన మతస్థుల్ పాపులంచుం, బొరిం
బొరి, వాకొంటివటోయి, ముస్లిముల దేవుం డెక్కడా? హైందవుల్
నరకం బంద జనించిరా? మఱి ముసల్మానుల్ చిదానందముం
బొరయం బుట్టువు నందిరా? యవుర నీవుం గొప్ప విజ్ఞానివే!

భగవత్తత్వము నీకు బోధపడునా? ప్రాణివ్యథాధీను లే
వగ దన్మర్మ మెఱుంగ జాలుదురు? నిర్వైరుల్ నిరీహుల్ మనీ
షి గరిష్ఠుల్ గద బ్రహ్మతత్వము విమర్శింపంగ బాత్రుల్ భువిన్!
మొగలాయి ప్రభువైన మాత్రమున నబ్బో! నీవు వేదాంతివా?

కత్తితో మానవుల చిత్తకమలములకు గ్రొత్త రంగులు వేయ గోరుదువటయ్యా?
కుంచె మొగమైన గనని ముగ్ధుడవు నీవు రంగరివిగా నటింతు వౌరంగజేబ!

వితగాదే మతికెక్కని మత మిల? బలవంతమైన మాఖస్నానం
బలికించు మని సుకృతంబుఁ ప్రబలికృష్టుం డగు నికృష్టునకు నెన్నటికేఁ?

జీవములఁ హరింతువని చేప్పడి, యిమ్మగు నా మతమ్ము గో
ల్పోవుదునా? శరీర మది పోయిన బోవునుగాక! నిత్యమై
పావనమై యఖండమయి భాసిలు బ్రహ్మపదార్థ మున్నదో
యీ, వధియింపరానిది - దహింపగ రానిది - నిశ్చయమ్ముగఁ.

నే నీ దేహమ్మని యజ్ఞానమ్మున మోసపోదునా? నా మతమన్
మానికము నిచ్చికొందునె పూనికమై మేడిపండు బోలిన తనువున్?

మతముపేర నెంతమందిని సంహారించితివో, పాపమెంత సేకరించి
యుంచినావో, సుంత యోజించుకొనుము తద్ వృజినదంష్ట్రి నిన్ను దినకమున్నె."

ఇత్తెఱంగున శంభాజి యుత్తరమ్ము వినిన యౌరంగజేబు క్రొవ్విదపు గినుక
తలము దప్పగ, గద్దియ వెలలి, పుడమి యొడ్డగెడవయినట్లు నిట్టూర్చి యార్చి,

పండ్లు పెటపెట గొఱుకుచు బల్కెనిట్లు -
"పొండు, కొనిపొండు ఖలుని మా మ్రోలనుండి

క్షణములో వచ్చుమీకు మా శాసనంబు
దండ్యుఁడగు వీని చిత్రవధక్రమంబు."

అతం డీగతి రోషపరీతాత్ముఁడు నిప్పు లుమిసి తిప్పున జనియెన్ ;
సీతుం డయ్యెను భటతతిచేత మహారాష్ట్రనేత చెఱకు బిరాన.
"ఏడు గుఱ్ఱాల తేరున్న నేమిఫలము? కరము లొక వేయిగల్గిన కార్యమేమి?
ఒక విపన్నుని గాపాడ నోపనైతి" అనుచు దలదాచుకొనె నన నినుడు క్రుంకె.

చేరె గూండ్లకు బులుగులు, ఫేరవములు నెమకె నామిషములను, ఘూకములు గూసె,
నాడు నష్టేందుకళయౌట నాల్గుదెసల నంధతమసంబు లత్యర్థ మాక్రమించె.

"పగటి చెయ్వుల సాకిరి బాధలేదు - చేయఁగావచ్చు నెదియైన రేయిగాన"
అన్న తల పూనకుడు లోకు, లరయుచున్న వారమని తారకలు వెల్గుతీరు దోచె.

గడచె జాము రేయి, వడివడి శంభాజి నపుడు ఖడ్గహస్తులైన భటులు
నగర బాహ్యవనికి నడిపించుకొని వచ్చినారు కాగడాలు దారిజూప.

అయ్యది రుద్రభూమి బొఱియల్ నెఱియల్ గంట్లు - గ్రద్దలున్
క్రయ్యలు వియ్యమందిన యగారము - తెక్కలికాండ్ర యిక్కయున్ -
ముయ్యేలగుట్ట పాములకు బూమెల కెమ్మ్రుంకున్ - గుజాళిపై
నుయ్యెల లూగుచుండు బ్రబలోద్ధతి దయ్యపుమూక లచ్చటన్.

చిదుగు లెగద్రోయుచుండిరి సొదలో నైదుగురు మానుసులు వికృతాస్యుల్
తదుపాంతపు జిచ్చున బిట్టుదటున ముక్కాక గాగుచుండెను గుజ్జల్.

అచ్చోటికి శంభాజిం దెచ్చిన లెంకలు మహమ్మదీయులు తమచే
డిచ్చిన ముదల బదంపడి నిచ్చలపు టుదంబలూని నెఱవేర్చ రాగిన్.

ఇనుపగుండెలవారల కేని వచ్చు వేకి మేనికి వెంటనే, యాశతోర
దండనోదంతమును విన్న; దండధరుని శిక్షలం దుండు వట్టి విచిత్రవిధులు.

కన్నుల్ గత్తులగ్రుచ్చి, నాల్కల్ జీలుసేసి, కను కాయమ్ము నె
న్నెన్నో ముక్కలు చేసివైచిరి - "హరీ, యీశా, జగద్రక్షకా,
నిన్నే నమ్మితి, పాహి పాహి" యని బొందిన్ జీవ మున్నంత నే
పు నోరాడిన యంతమట్టు ధృతి గోల్పోలేదు శంభాజి తాన్.

మతమున కాత్మార్పణ మీ వితమున బూజ్యుడు శివాజి బిడ్డ యొనర్చెన్;
క్షితి నిట్టివారి దే కద బ్రతుకన, మృతజీవు లిట్టివారలు గారే!

పులికడుపున గలుగునటే చలిచీమ? పవిత్రుఁడైన శంభాజి మహో
జ్జ్వల చారిత్రము గద రావలయు శివాజీ కథాప్రవచనాంతమునన్.

# నేటి తెలుగు : వర్ణ సమామ్నాయం

శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి

ఇంతకుముందు రాసిన "ధ్వని : వర్ణం" అన్న వ్యాసంలో (మా॥ భారతి, అక్టోబరు, పేజీలు 38-44) భాషలో ధ్వనికీ, వర్ణానికీ గల పరస్పర సంబంధం నిరూపించబడ్డది. అర్థభేదకాలు కాని తుల్యోచ్చారణ గలిగిన ధ్వనుల సమూహం వర్ణమనీ, ఒక్కొక్క వర్ణానికి చెందిన ధ్వనులను పరిసరభేదాన్ని బట్టి నిర్ణయించటం సాధ్యమనీ, భాషలో వర్ణాలకే లిపిచిహ్నాలు ఆవశ్యకం గాని ఉచ్చరించే ధ్వనులన్నిటికి గుర్తులు పెట్టనక్కర్లేదనీ ఆ వ్యాసంలో ప్రతిపాదించాను. ఈ సిద్ధాంతానికి లక్ష్యంగా నేటి తెలుగులోని వర్ణ సమామ్నాయం విపులంగా చూపించటమే ఈ వ్యాసం ఉద్దేశం.

నేటి తెలుగులో ప్రాంతాల్ని బట్టి, కులాల్ని బట్టి, వృత్తుల్ని బట్టి, ఉచ్చారణలోనూ పదజాలంలోనూ ఎంతో వైవిధ్యం వుంది. ఆయా భేదాలన్నిట్నీ ఒక్కచోట క్రోడీకరించి వర్ణించటం అసాధ్యం కాకపోయినా సామగ్రి లోపాన్ని బట్టి ప్రస్తుతం మానుకున్నాం. ఇక్కడ చూపించబోయే వర్ణ సమామ్నాయం మూలంగా కోస్తా జిల్లాల్లోని శిష్టుల (నవీనతరగతి నాగరికుల) వ్యవహారంలోది. చాలావరకు రాయలసీమ, తెలంగాణా వారి వ్యవహారానికి కూడా ఈ వర్ణ సమామ్నాయం సరిపోవచ్చు. ఎందుకంటే భిన్న మాండలికాల మధ్య పదగతవర్ణాల్లో ఈషద్భేదాలుండవచ్చును గాని వర్ణాల మొత్తం సంఖ్యలో ఎక్కువ తక్కువలు సామాన్యంగా ఉండవు. ఇలాటి భేదాలు నాలుగు రకాలుగా ఉంటాయి.

1. రెండు మండలాల్లో, కొన్ని పదాల్లో ఒకే వర్ణం ప్రయోగిస్తున్నా, ఆ వర్ణోచ్చారణల్లో (సవర్ణోచ్చారణల్లో) కొద్ది భేదాలుండవచ్చు. ఉదాహరణకు కోస్తా జిల్లాల శిష్టుల వ్యవహారంలోనూ, రాయలసీమ వారి వ్యవహారంలోనూ 'మ' వర్ణం ఉంది. కాని కోస్తా వ్యవహారంలో 'మ' వర్ణానికి భిన్న స్థానాల్లో 'మ-వఁ' అని రెండు రకాల ఉచ్చారణ ఉంది. రాయలసీమ వ్యవహారంలో అన్ని పద పరిసరాల్లోనూ ఒక్క మకారోచ్చారణే ఉంది. ఇక్కడ సామాన్య లక్షణం రెండు ప్రాంతాల్లోనూ 'మ' వర్ణం ఉండటం. సవర్ణాల (వర్ణ ధ్వనుల) భేదం అవగాహనకు అడ్డం కాదు. కాబట్టి అది అంత లెక్కలోనిది కాదు. కాని కోస్తా జిల్లాల్లో 'మ' వర్ణం ఉపయోగించే చోట రాయలసీమలో మరో వర్ణం, ఏ 'న' వర్ణమో 'గ' వర్ణమో, ఉపయోగించేట్టయితే కొంతవరకు అర్థబోధ కష్టమౌతుంది. మాండలిక వ్యాకరణాలు రాసేటప్పుడిలాటి వర్ణభేదాలు ముఖ్యంగా గుర్తించాలి.

2. సమానపదాల్లో ఒక మండలంలో ఒక వర్ణం ఉంటే - రెండో మండలంలో మరొక వర్ణం ఉండటం. ఉదా: శ్రీకాకుళం, విశాఖపట్టణం ప్రాంతాల్లో 'గిన్ని, దొన్ని' అన్న మాటలు మిగిలిన దిగువ కోస్తా జిల్లాలవారు 'గిన్నె, దొన్నె' అంటారు. అంటే ద్విత్వహల్లుమీద పదాంతంలో ఒక ప్రాంతంలో 'ఎ' వర్ణం. మరొక ప్రాంతంలో 'ఇ' వర్ణం నియతంగా వినిపిస్తాయి. కాని మిగిలిన పదపరిసరాల్లో ఇ, ఎ లు రెండు మండలాల్లోను ప్రత్యేక వర్ణాలుగా ఉన్నాయి కాబట్టి వర్ణాల మొత్తం అక్కడా ఇక్కడా ఒకటిగానే ఉంటుంది.

3. రెండు వ్యవహార మండలాలమధ్య, కొన్ని పదాల్లో, ఒక మండలంలో లేని వర్ణం మరొక మండలంలో అధికంగా ఉండటం గాని, ఉన్న వర్ణం లేకపోవటం గాని జరగవచ్చు. ఉదా: గుంటూరు ప్రాంతంలో 'అట్లా, ఇట్లా' అనే మాటలకు తెలంగాణాలో చాలామంది (శిష్టులు కూడా) 'గట్లా, గిట్లా' అంటారు. అలాగే 'వాన, వచ్చింది' అనే మాటలకు సరిగా 'ఆన అచ్చింది' అంటారు. ఈ ఉదాహరణల్లో ఒక ప్రాంతంలో లేని 'గ' వర్ణం మరొక ప్రాంతంలో ఉండటం, ఉన్న 'వ' వర్ణం లేకపోవటం అర్థబోధను బాధకమవుతుంది. కాని మొత్తంమీద ఇంత మాత్రంవల్ల 'గ' వర్ణం ఒక ప్రాంతంలో అంతటా లేకపోవటం, మరొక ప్రాంతంలో 'వ' వర్ణం అంతటా లేకపోవటం గాని సంభవించదు గాబట్టి, పదజాలమంతా పరిశీలిస్తే వర్ణాల మొత్తం అక్కడా ఇక్కడా ఒకటే.

4. శిష్టుల వ్యవహారంలో ఉన్న కొన్ని వర్ణాలు శిష్టులు కానివారి వ్యవహారంలో సర్వత్రా లేకపోవచ్చు. నేటి తెలుగులో శిష్టుల వ్యవహారంలో క—ఖ, గ—ఘ, ద—ధ మొదలైన అల్పప్రాణ మహాప్రాణాలు ప్రత్యేక వర్ణాలు. వారు 'సుఖం, ఘనత, ధర్మం, ఫలం, భర్త' అని వాడే మాటలకు సరిగా శిష్టేతరులు 'సుకం, గనత, దర్మం, పలం, బర్త' అని వ్యవహ

కూరించటం కద్దు. అంటే శిష్టులభాషలో ఉన్న రెండేసి వర్ణాలకూ (అల్పప్రాణ—మహాప్రాణ వర్ణాలకు) సమానంగా ఇతరుల్లో ఒక్క వర్ణమే (అల్పప్రాణవర్ణమే) ఉంటుంది. ఇటువంటిచోట ఈ రెండు తెగలవారి వ్యవహారానికి సరిపడే వర్ణాల మొత్తంలో తేడా వస్తుంది. కాని ఈ వ్యాసంలో శిష్టుల భాషనే గ్రహిస్తున్నాం గాబట్టి ముందిచ్చే వర్ణ సమామ్నాయం భాష అంతటికీ సరిపడవచ్చు. మాండలిక పరిశోధన ఇతోధికంగా జరిగితేనేగాని ఈ విషయం నిష్కర్షగా చెప్పలేం. ప్రతివర్ణానికీ చెందిన ఉచ్చారణలోని భేదక ధర్మాలు ఆధారంగా నేటి తెలుగులోని వర్ణాలను ఈ కింది పద్ధతిలో చూపించవచ్చు. ముందుపయోగించే పారిభాషిక పదాల అవగాహనకు, 'ధ్వని-వర్ణం' వ్యాసం చివరిఅనుబంధం పాఠకులు చదవటం అవసరం.

శ్వా. = శ్వాసయుతం (పరుషం లేక అఘోషం); నా. = నాదయుతం (సరళం లేక ఘోషం);
అ. = అల్పప్రాణం (ఒత్తులేనిది); మ. = మహాప్రాణం (ఒత్తి ఉచ్చరించేది).

## హల్లులు

### స్థానకరణాలు

| ప్రయత్నం | | | ఓష్ఠ్యం | దంత్యం | దంతి మూలీయం | తాలవ్యం | మూర్ధన్యం | కంఠ్యం | కంఠ మూలీయం |
|---|---|---|---|---|---|---|---|---|---|
| స్పర్శం | శ్వా. | అ. | ప | త | | | ట | క | |
| | | మ. | ఫ | | | | ఠ | ఖ | |
| | నా. | అ. | బ | ద | | | డ | గ | |
| | | మ. | భ | ధ | | | ఢ | ఘ | |
| ఊష్మం | శ్వా. | | ఫ | | స | శ ష | | | హ |
| స్పృష్టోష్మం | శ్వా. | అ. | | | | చ | | | |
| | | మ | | | | ఛ | | | |
| | నా. | అ. | | | | జ | | | |
| | | మ | | | | ఝ | | | |
| అనునాసికం | నా. | | మ | | న | | ణ | | |
| పార్శ్వికం | నా. | | | | ల | | ళ | | |
| రేఫం | నా. | | | | ర | | | | |
| అంతస్థం | నా. | | వ | | | య | | | |

## అచ్చులు

| | తాలవ్యం (నిరోష్ఠ్యం) | కంఠ్యం (నిరోష్ఠ్యం) | కంఠ్యం (ఓష్ఠ్యం) |
|---|---|---|---|
| సంవృతం | ఇ ఈ | | ఉ ఊ |
| అర్ధసంవృతం | ఎ ఏ | | ఒ ఓ |
| అర్ధవివృతం | ఏ̲ | | |
| వివృతం | | అ ఆ | |

# నేటి తెలుగు : వర్ణ సమామ్నాయం

ప్రక్కన నిరూపించిన వర్ణాల్లో ఒక్కొక్క దానికి భిన్న పరిసరాల్లో ఏర్పడే ఉచ్చారణ భేదాలు అంటే ధ్వనులు లేక సవర్ణాలు:—

## హల్లులు

### స్పర్శాలు :

స్పర్శ వర్ణాలన్నిటినీ పదం మొదట, ద్విరుక్తిలోను బరువు (Tense) గాను, అచ్చులమధ్య అద్విరుక్తంగా వచ్చినప్పుడు తేలిక (Lax) గాను, ఉచ్చరిస్తాం. అంటే ప్రతిస్పర్శవర్ణానికి భిన్న పరిసరాల్లో రెండేసి సవర్ణాలు ఉన్నాయన్నమాట. బరువుగా ఉచ్చరించిన వాటిలో స్థానకరణాల మధ్య స్పర్శ ఎక్కువగా ఉంటుంది. తేలిగ్గా ఉచ్చరించినవాటిల్లో తక్కువగా ఉంటుంది. ఈ భేదం పరుషాల్లోకంటె సరళాల్లో (నాదవద్ ధ్వనుల్లో) మరింత స్పష్టంగా వినవచ్చు. తేలిక ఉచ్చారణను సూచించే ధ్వనికి కింద ఒక చుక్క గుర్తుగా పెట్టుకుందాం. ఉదా.

| | బరువు : | తేలిక : |
|---|---|---|
| (గ) | గాలి, పగ్గు | పగ్గలు, తగాదా |
| (డ) | డబ్బు, అడ్డం | గడప, పడక |
| (ద) | దారి, గద్ది | మొద్దలు, చదువు |
| (బ) | బావ, జబ్బు | తబలా, జలుబు |

పై మాటల్లో వున్న సవర్ణాల ఉచ్చారణభేదాలు తెలుగు మాట్లాడేవారు, ఎవరికి వారు జాగ్రత్తగా ఉచ్చరించి స్థానకరణస్పర్శ పరిశీలిస్తే చాలా స్పష్టంగా తెలుస్తుంది. ఈ విధంగానే పరుషాల్లోనూ మహాప్రాణాల్లోనూ పైన చెప్పిన పరిసరాలనుబట్టి వచ్చే ఉచ్చారణ భేదాలు వినిపిస్తాయి.

శిష్టభాషలోనూ మహాప్రాణాలు ప్రత్యేక వర్ణాలుగా వచ్చేపదాలు సామాన్యంగా తక్కువ. చాలవరకు అన్య భాషల్లో వచ్చే మహాప్రాణ ధ్వనులు, అల్పప్రాణ ధ్వనులతో సవర్ణాలుగానే ఉంటాయి. ఉదా. ఖాళీ—కాళీ, ఖర్చు—కర్చు, ఖరీదు–కరీదు, తనిఖీ—తనికి, ఠావు—టావు.

వ్యవహారంలో ఉన్న పదాలన్నిటిలోనూ అల్పప్రాణ మహాప్రాణాలు ఈ విధంగా అన్ని పరిసరాల్లోనూ అర్థభేదాన్ని కలిగించకుండా వినిమయం పొందగలిగితే అప్పుడు క—ఖ మొదలైనవి సవర్ణాలవుతాయి గాని ప్రత్యేకవర్ణాలు గావు. కాని శిష్టుల భాషలో ఇవి అలాగేవు. సుఖం. దుఃఖం (లేక దుహ్ఖం), సంఘం, శిఖి, కంఠం, ఢంకా, గాఢం, ధర్మం, కథ, ఫలం, భార్య, స్తంభం- ఈ శబ్దాల ఉచ్చారణలో శిష్టులు మహాప్రాణాల బదులు అల్పప్రాణాలు ఉపయోగించటం అరుదు. సుకం, దుక్కం, గదతి, సంగం, మొదలైన ఉచ్చారణలు ఉండవు. కొన్నిచోట్ల ఈ రకంగా ఉచ్చరిస్తే అర్థభేదం కలుగుతుంది కూడా. ఉదా. ఫలం (పండు), పలం (తూనికలో) మొ. ఈ కారణంవల్ల కోస్తా జిల్లాల శిష్టుల భాషలో అల్పప్రాణమహాప్రాణాలు ప్రత్యేక వర్ణాలుగానే గుర్తించాలి.

నేటి వ్యవహారంలో 'థ' ప్రత్యేక వర్ణంకాదు. 'కథ, అర్థం' మొదలైన శబ్దాలన్నిటిలోనూ 'థ' వర్ణాన్ని శిష్టులు అంతటా 'ధ' వర్ణంగానే ఉచ్చరిస్తారు. విశిష్టులు 'థ' గానే ఉచ్చరించవచ్చు. కాని రోతను సూచించే ధ్వన్యనుకరణశబ్దమైన 'థూథూ' లో మాత్రం 'థ' వర్ణోచ్చారణ వినిపిస్తున్నది. కాని ఇటువంటి అనుకరణ శబ్దాలు (Clicks) భాషలో చేరవని కొందరు శాస్త్రజ్ఞుల మతం.

### ఊష్మాలు

స్థానిక నిరోధం లేకుండా ఒరపిడితో వెలువడే ధ్వనులు ఊష్మాలు. స, శ, ష. వర్ణాలన్నీ శ్వాస ప్రయత్నం కలవి. హవర్ణం నాదప్రయత్నంతో ఏర్పడుతుంది. వీటి సవర్ణాల ఉచ్చారణ స్థానకరణాలు :

/ఫ/ స్థానం. పై దంతాల అంచు; కరణం, కింది పెదవి. అన్యదేశ్యాల్లో ప్రధానంగా ఆంగ్లం నించి వచ్చి చేరిన శబ్దాల్లో ఈ వర్ణాన్ని ప, ఫ వర్ణాలకంటే భిన్నంగా శిష్టులుచ్చరిస్తారు. ఉదా : కాఫీ, ఆఫీసు, ఫస్టు మొ.

/స/ స్థానం, దంతమూలం, కరణం నాలుక అంచు. సంస్కృతంలోలాగ ఇది దంత్యం కాదు. తకారం ఉచ్చరించిన వెంటనే సకారాన్ని ఉచ్చరించి చూస్తుంటే స్థానంలోని భేదం తెలుస్తుంది.

/శ/ దీనికి స్థానం, కఠినతాలువుముందుభాగం, కరణం, పాపుగా వున్న నాలుక ముందుభాగం.

/ష/ దీనికి స్థానం కఠిన తాలువే. నాలుక ఇరువైపులూ మడతబడి కఠిన తాలువును దాకి సన్నగా ఏర్పడ్డ అవకాశంగుండా ఈ ధ్వని వెలువడుతుంది. సంస్కృతంలోని ష కారం కేవల మూర్ధన్యం. ట, ఠ, డ, ఢ, ణ ఉచ్చారణ స్థానమే దీనికీ. నేటి తెలుగులో ట కారం మూర్ధన్యమేగాని ష కారం అలాగే ఏర్పడదు. ట కారోచ్చారణలోలాగ ష కారోచ్చారణలో నాలుకను వెనక్కు మడత వేసి ఉచ్చరించం.

/హ/: దీనికి స్థానకరణాలు నాదతంత్రులు. నాదతంత్రులమధ్య ఉన్న అవకాశంగుండా గాలి ఒరపి

# నేటి తెలుగు : వర్ణ సమామ్నాయం

పదాంతవాక్యాంతాల్లోనూ, ప్రయోగంలో య,వ,హల ముందు. ఉదా: మూడుఁ, ఉన్నావుఁ, పవిత్రతవుఁ, మావాడుఁ, సిపాయిఁ.

/న/ న — దంత్యం; దంత్యస్పర్శాల ముందు, ఉదా. అన్త, ఆన్దం.

ఞ — తాలవ్యం; తాలవ్య చ జ ల ముందు (దంత్య. స్పృష్టోష్మాలు), ఉదా. పఞ్చి, గఞ్జి.

ఙ — కంఠ్యం; సంయోగంలో క వర్గ స్పర్శాల ముందు, ఉదా. సుఙ్కం, శఙ్ఖం, సఙ్గతి, సఙ్ఘం

న — దంతమూలీయం; దంతమూలీయ చ జ ల ముందు. పైన చెప్పినవి గాక మిగిలిన పరిసరాలన్నిటిలోను ఉదా. మనచో, కన్జూ, నాన్న, పన్లేదు (పనిలేదు), సన్యాసి, అవున్నా.

పైన నిర్దేశించిన ధ్వనులన్నీ పరస్పర భిన్న స్థానాల్లోనే వస్తాయి కాబట్టి /న/ వర్ణానికి చెందిన సవర్ణాలుగా గ్రహించవచ్చు.

/ణ/ ణ — మూర్ధన్యం; అపదాదిని ద్విరుక్తంగాను, అద్విరుక్తంగాను, మూర్ధన్య స్పర్శాల ముందు, ఉదా. అణా, దణ్డం. గణ్ట, కణ్ఠం. కాణ్డ

నేటి మన రచనా సంప్రదాయంలో ఉపయోగించే అనుస్వారం [ం] ప్రత్యేక వర్ణం కాదు. అనునాసికవర్ణాలైన /న, ణ, మ/లకు బదులు కొన్ని పరిసరాల్లో ఉపయోగించుకొనే లేఖన చిహ్నం మాత్రమే. సాధారణంగా పదాంత, వాక్యాంతాల్లోనూ, సంయుక్తాక్షరాల్లోనూ దీన్ని ఉపయోగిస్తుంటారు. పై ఉదాహరణలు చూస్తే సున్న అనుస్వారాన్ని వివిధంగా భిన్నవర్ణాల స్థానంలో ఉపయోగిస్తున్నామో తెలుస్తుంది.

## పార్శ్వికాలు

నాలుక ముందుభాగం తాలువువైపు పైకెత్తి రెండు వైపులనుండా గాలిని వెలువరించటంవల్ల ఈ వర్ణాలకి చెందిన ధ్వనులు ఏర్పడుతున్నాయి.

/ల/ దంతమూలీయం, పార్శ్వికం, నాదం, ఉదా. లాగు, కల, మల్లె.

/ళ/ మూర్ధన్యం, పార్శ్వికం, నాదం; కళ, కళ్ళం.

వీటిలో /ళ/ వర్ణం, /ణ/ వర్ణంలాగానే పదాదిని ఉండదు. సాంప్రదాయిక వ్యాకర్తలు లఘుప్రయత్న భేదాన్ని క్రమంగా ల ళ లకు ఆరోపించారు. కాని దీన్ని ప్రయత్నభేదం అనటంకంటె స్థానకరణాల్లోని భేదం అనటం సమంజసం.

రేఫ (కంపితం) : దీనికి నేటి తెలుగులో భిన్న స్థానాల్లో రెండురకాల ఉచ్చారణ ఉంది.

/ర/ ర :— దంతమూలీయం, శిథిల స్పర్శం లేక ఈషత్కంపితం, నాదం; పదాదిన, పదమధ్యంలో అద్విరుక్తంగా వచ్చినపుడు. సంయోగంలోను, ఉదా. రాజు, సరాసరి, క్రమం. తర్కం.

ఱ :— దంతమూలీయం, అధిక కంపితం, నాదం; ద్విరుక్తంగా వచ్చినపుడు, ఉదా: కఱ్ఱ, గొఱ్ఱె.

## అంతస్థాలు

య, వ. లు. సంస్కృతంలో యకారోచ్చారణ అధికోష్మప్రయత్నంతో ఉండటంవల్ల ప్రాకృతాల్లో 'జ'కారంగా మారింది. కాని తెలుగులో యకారాన్ని తేలిగ్గా ఉచ్చరిస్తాం.

/య/ తాలవ్యం, శిథిలోష్మ ప్రయత్నం, నాదం; పదాదిని /అ ఆ/ ల ముందు, పదమధ్యంలో అద్విరుక్తంగాను, ద్విరుక్తంగాను ఉదా. యముడు, యాతన, కాయ, అయ్య.

/వ/ వ (W)—ద్వ్యోష్ఠ్యం, శిథిలోష్మ ప్రయత్నం, నాదం; అద్విరుక్తంగా ఉండి /అ ఆ/ లు పరంగా ఉన్నప్పుడు. ఉదా. వంట, వాడు.

వ (V)—దంతోష్ఠ్యం, శిథిలోష్మ ప్రయత్నం, నాదం, ద్విరుక్తిలోనూ, తాలవ్యాచ్చులు — ఇ, ఈ, ఎ, ఏ, ఏ లు పరంగా ఉన్నప్పుడు. ఉదా. వీడు. వేసి, వేళ, కవ్వం.

## అచ్చులు

'నేటి తెలుగులో స్వరవర్ణాలు ఏడుమాత్రమే; అ, ఇ, ఉ, ఎ, ఒ, ఏ, ఋ; స్వరదీర్ఘతను (:)' ప్రత్యేక వర్ణంగా గ్రహిస్తే దీర్ఘాచ్చులన్నీ రెండేసి వర్ణాలుగా వ్యాఖ్యానించుకోవాలి. అంటే 'ఆ=అ:' అని. అలానే ఈ ఊ లకు కూడా. /ఏ/ వర్ణం (=:ఏ) ఎప్పుడూ దీర్ఘంగానే ఉంటుంది. ఉదా. మేష, కొటేషు. మరొక పక్షంలో దీర్ఘాచ్చులను ఒక్కొక్కటి ఒక్కొక్క వర్ణంగానే గ్రహిస్తే వర్ణాల సంఖ్య పెరుగుతుంది. కాని ఈ రకమైన విభజన లోనూ శాస్త్రవైరుధ్యం లేదు. ఈ వ్యాసంలో హ్రస్వదీర్ఘాలు ప్రత్యేక వర్ణాలుగానే గ్రహించబడ్డాయి. వీటిలో ఇ, ఈ, ఎ, ఏ, ఏ లు తాలవ్యాచ్చులు, నిరోష్ఠ్యాలు. ఉ, ఊ, ఒ, ఓ లు కంఠ్యాచ్చులు, ఓష్ఠ్యాలు. అ, ఆ లు కంఠ్యాలు, నిరోష్ఠ్యాలు. ఓష్ఠ్యాచ్చుల ఉచ్చారణలో పెదవులు రెండూ వృత్తాకృతిలో ఉంటాయి. నిరోష్ఠ్యాచ్చుల ఉచ్చారణ

లో ఈ ప్రయత్నం ఉండదు. ఇ, ఉ లు సంవృతాచ్చులు. 'అ' వివృతాచ్చు. ఎ, ఒ లు అర్ధసంవృతాలు. ఏ అర్ధవివృతం. పదాది స్వరవర్ణాలన్నీ, 'అ' వర్ణం పరాన వచ్చినప్పుడు వివృతోచ్చారణను కలిగివుంటాయి. ఉదా: గూడు—గూడ. మొదటి మాటలోని 'ఊ' కారం కంటే రెండో మాటలోని 'ఊ' కారం మరింత వివృతోచ్చారణతో ఉంటుంది. అలానే 'గోడు—గోడ. చిలుకు—చిలక, పెట్టు—పెట్ట', ఈ జంటల్లో రెండో పదాల ఆద్యచ్చులు మొదటి పదాల ఆద్యచ్చులకంటె భిన్నంగా వినపడ్డం పరపదాల్లో మీద వచ్చిన వివృత 'అ' కారం వల్లనే. సంవృతాచ్చులైన ఇ, ఉ లు పరంగా ఉన్నప్పుడు పూర్వాచ్చుల్లో సంవృతోచ్చారణమే ఉండటం గమనించగలం.

/ఎ/: పదాంతస్థానంలో దీనికి కొన్ని మాండలికాల్లో అర్ధవివృతోచ్చారణ ఉంటుంది. (స్థాన వివరాలకు మా. పటం) ఉదా. గిన్నె, కరిగె, గోరె మొ. పదాదిన అర్ధసంవృతంగానే ఉంటుంది. మెట్టు, పెట్టు మొ. కాని రెండో అక్షరంలో 'అ' వర్ణం ఉన్నప్పుడు పైన చెప్పిన సూత్రాన్ని బట్టి అర్ధవివృతంగానే, అంటే 'ఏ' లాగానే వినిపిస్తుంది చూ. మెట్ట—మెట్టు. ఇలా 'ఎ-ఏ' లు పరస్పర భిన్నపరిసరాల్లోనే వస్తాయి కాబట్టి /ఎ/ వర్ణానికి సవర్ణాలుగా భావించవచ్చు.

నేటి తెలుగులో /ఏ/ ప్రత్యేకవర్ణం. ఉదా. 'కొట్టేవ్ సుమ', 'నిన్న కొట్టేవ్'. ఈ రెండు వాక్యాల్లోను 'ఎ—ఏ' ల కనిష్ఠభేదం వల్లనే అర్థభేదం తెలుస్తున్నది. అందువల్ల వీటిని ప్రత్యేక వర్ణాలుగా లిపిలో కూడా చూపెట్టడం ఆవశ్యకం.

విరామం తర్వాతగాని, వ్యవధానం తర్వాతగాని వచ్చిన ఇ ఈ, ఎ, ఏ లకు ఉ, ఊ ఒ, ఓ లకు క్రమంగా య వ లు ముందు చేరతాయి. అంటే /ఇ/ వర్ణానికి 'యి—ఇ' లు సవర్ణాలు. సంధిలో 'ఇ' అనే సవర్ణం, సంధి లేనిచోట 'యి' అనే సవర్ణం వినిపిస్తుంది. ఉదా. వాకి-ఇచ్చాడు, వాకే యిచ్చాడు. విరామం తర్వాత: యిల్లు, యిక్కడ, యిప్పుడు మొ. మిగిలిన అచ్చులకు కూడా ఈ విధంగానే అన్వయించుకోవాలి. ఈ విధంగా పరిసర భేదాన్ని బట్టి 'ఇ—యి' మొదలైనవి /ఇ/ మొదలైన వర్ణాలకు సవర్ణాలుగా నిరూపించవచ్చు గనుక వర్ణనిర్దేశకంగా రాసే రాతలో ఈ రెండిటికీ ఒకే గుర్తు పెట్టుకుంటే సరిపోతుంది.

సాంప్రదాయిక వర్ణసమామ్నాయంలో ప్రత్యేక లిపి సంకేతాలతో చూపించే 'ఐ ఔ' లు (వక్రతమాలు) నేటి తెలుగులో 'అయ్, అవ్' లుగా, అంటే రెండేసి వర్ణాలుగా స్వీకరించటం లాఘవదృష్ట్యా సమంజసం. ఉచ్చారణలో 'అయ్-ఐ' లకు 'అవ్-ఔ' లకు తెలుగులో భేదం లేదు, ఉదా. 'అయ్య-ఐన', 'అవ్వ-ఔను'. కాకపోతే ఛందస్సులో యతి ప్రాస సందర్భంలో ఐ-ఔ లు అచ్చు+హల్లుల లాగా గాక, దీర్ఘాచ్చుల (ఉదా. ఆ-ఓల)లాగా ప్రవర్తించటంవల్ల, వాటిని ప్రత్యేక వర్ణాలుగా గుర్తించినా శాస్త్రవైశద్యం లేదు. అందుకనే లాఘవం, ఉచ్చారణ, ప్రమాణాలుగా తీసుకొన్నప్పుడు 'అయ్-అవ్' లుగానే గ్రహించటం సమంజసమన్నాను. అనుస్వార విసర్గలు తెలుగు వర్ణసమామ్నాయంలో చేర్చటం, సంస్కృతవ్యాకరణాల అనుసరణవల్లనే. వీటికి ఈ వ్యాసంలో అన్యత్ర గతి కల్పించబడ్డది.

## వ్యవధాన భేదాలు

సహజంగా మాట్లాడేటప్పుడు సన్నిహితవర్ణాల్లో ఒకదాన్నుంచి ఇంకొకదానికి ఉచ్చారణ ఉపక్రమించే పద్ధతి (transition) లో వచ్చే భేదాలనుబట్టి అర్థాలు మారుతుంటాయి. ఉదాహరణకు ఈ కింది వాక్యాల జంట చూడండి. 1. ఆ అమ్మాయి పాట్ నాకు రాదు 2. ఆ అమ్మాయి-పాట్నాకు రాదు. మొదటి వాక్యంలో 'ఆ అమ్మాయి పాట-నాకు రాదు. అని 'పాట' తర్వాత వ్యవధానం నిలపవచ్చు. కాని 'అమ్మాయి' శబ్దం తరువాత నిలపటానికి వీల్లేదు. రెండో వాక్యంలో 'ఆ అమ్మాయి-పాట్నాకు రాదు', అన్నప్పుడు 'పాట్నా' ఒక పట్టణం. మొదటివాక్యంలో లాగా కాక 'అమ్మాయి' పదం తర్వాత వ్యవధానం ఉండవచ్చు. 'పాట్నాకు' అన్నది ఏకపదం కాబట్టి దాన్లో ఉన్న వర్ణాలమధ్య ఉచ్చారణలో వ్యవధానం ఉండదు. అలాటిదే ఇంకొక వాక్యాలజంట. 1 రెండ్-ఎడ్ల బండ్లు-తీసుకురా; 2 రెండెడ్ల బండ్లు-తీసుకురా. ఈ రెండు వాక్యాలమధ్య ఉన్న అర్థభేదం తెలుగువాళ్ళందరికీ విదితమే. నిదానంగా ఉచ్చరిస్తే మొదటి వాక్యంలో సంధి చెయ్యకుండా 'రెండు-ఎడ్ల బండ్లు' అనవచ్చు. కాని రెండో వాక్యంలో అలా నిలపటానికి వీల్లేదు. 'రెండెడ్ల బండ్లు' అనే అనాలి. సహజోచ్చారణలో మాత్రం వ్యవధానాలు స్పష్టంగా కనపడకపోయినా, వాటి ఉనికి మరో విధంగా అనుమేయమవుతుంది. అంటే, 'పాట్-నాకు' అన్నప్పుడు భిన్నపదాలైన 'పాట, నాకు' అనే రెండిటి మొదటి అక్షరాలమీద గట్టి ఊనిక (stress) ఉంటుంది. 'పాట్నాకు' అన్నది ఏకపదం కాబట్టి 'పా' మీదనే ఊనిక ఉంటుంది. అలానే 'రెండ్-ఎడ్లబండ్లు' అన్న

పృడు '-' గుర్తుతో వేరుచేసిన రెండు పదాల మొదటి అక్షరాలమీద ఊనిక నిలుస్తుంది. 'రెండెడ్ల బండ్లు' ఏక పదంగా, లేక పదబంధంగా ఉచ్చరించినప్పుడు 'రెం' అన్నదాని మీదనే ఊనిక ఉంటుంది. అంటే, వాక్యంలో ఊనికలు నిలిచే పదాలన్నీ ముందుపదాల నించి తెగిపోతాయనీ, అటువంటిచోట్ల వ్యవధానం నిలుస్తుందనీ గుర్తించవచ్చు. ఇక రెండోరకమైన వ్యవధానం ఉపవాక్యాలచివర వస్తుంది. దీనికి గుర్తుగా /+/ గాని, కామా /,/ గాని పెట్టుకోవచ్చు. ఉదా. వాడూ—మానాణే+నేనూ—మావాణే. నోరు—మంచిద్—అయితే, ఊరు—మంచిద్—అవుతుంది. ఇల్లు—చిన్నద్—అయినా, అద్దె—తక్కువేన్—గాదు.

ఇక మూడో రకమైన వ్యవధానం వాక్యాంతాన వచ్చేది దీన్ని విరామం అనవచ్చు. వాక్యంమధ్య వచ్చే /,/ గుర్తుతో సూచించే వ్యవధానానికీ దీనికీ భేదం, కాలపరిమితిలోను, కొన్ని స్వరస్థాయి భేదాల్లోను తెలుస్తుంది. వాక్యాంతాన ఎంతసేపు ఆపినా ఆపవచ్చును గాని వాక్యంమధ్య /,/ తర్వాత వ్యవధానం కొద్దిసేపే ఉంటుంది. పైభేదాలోని ఉదాహరణలు చర్చించిచూస్తే ఈ విషయం బోధపడుతుంది. వాక్యాంత విరామానికి ఇప్పుడు మనం పెట్టుకొంటున్న గుర్తే, (చుక్క) /./ పెట్టుకోవచ్చు. ఇంతవరకు నేటి తెలుగులో మూడురకాలైన వ్యవధానభేదాలు అర్థభేదకాలుగా నిరూపించాను. సహజోచ్చారణలో వ్యవధానంలేకుండా వర్ణాలు రావటం సాధారణం. అంటే ఇది పైచెప్పిన మూడుభేదాలకు చెందని వర్ణోపక్రమణ పద్ధతి కాబట్టి నాల్గోభేదంగా స్వీకరించాలి. దీన్ని సంస్కృతవ్యాకరణ సంప్రదాయంలో 'సంహిత' అన్నారు. "వర్ణాల అతిశయితమైన సన్నిధి సంహిత" అని వారి నిర్వచనం. ఉదా. అదెక్కడుంది? అన్నప్పుడు అన్నివర్ణాలు వీలైనంత సన్నిహితస్థితిలో ఉన్నాయి. 'అది, ఎక్కడుంది?' అన్నప్పుడు 'ది—ఎ' వర్ణాల మధ్య సంహిత లేదు. అందుకనే సంధిజరగక యడాగమం వచ్చింది. పైవాక్యంలో కలిపినదివే మిగిలిన పదాల వర్ణాలన్నీ మామూలుగా సంహితస్థితిలోనే ఉన్నాయి.

## స్వరాశ్రయభేదాలు

వాక్యస్వర (Intonation) భాగాలుగా వచ్చే ఉచ్చనీచ సమాహారాలు అనే స్థాయిభేదాలనుబట్టే మనకు వాక్యార్థం పూర్తిగా తెలుస్తున్నది. ఉదా: 'ఊళ్ళో లేడు'. 'ఊళ్ళో లేడు?' ఈ రెండువాక్యాల్లో అచ్చులూ హల్లులూ సమానమే అయినా ఒకవాక్యం నిర్ధారణకు, రెండోది ప్రశ్నను సూచించటంవాక్యస్వర భేదాన్నిబట్టే. పైనచెప్పిన మూడురకాల స్వరస్థాయి భేదాలకు 3 (ఉచ్చ), 1 (నీచ), 2 (సమాహార) అనే అంకెలు గుర్తులుగా తీసుకుంటే, మొదటి వాక్యం చివర /2-2/. రెండోవాక్యం చివర /1-3/ ఉంటాయి. అంటే మొదటి వాక్యం సమస్వరంతో ముగుస్తుంది, రెండోవాక్యం ఉచ్చస్వరంతో ముగుస్తుంది. ఇంకో వాక్యం చూడండి, 'హాలే. పో'. ఈ వాక్యం చివరి స్వరం /3 1/ అని సూచించవచ్చు. అంటే వాక్యాంత స్వరం 3వ స్థాయినించి అధోముఖమవుతుంది. నేటి తెలుగులో ఉపవాక్యాలు (Clauses) అసమాపకాలుగా సూచించేవి చాలావరకు ఈ స్వరస్థాయి భేదాలే. ఉదా. 'వాడు తెలిసినా, చెప్పడు'. 'వెళ్తే వెళ్ళేవ్ గాని, నాతో యెందుకు చెప్పలేదు?' ఇలాటి వాక్యాల్లో /,/ కు ముందు వినబడే స్వర సంయోజనాలను బట్టి వాక్యం పూర్తికాలేదని తెలుస్తుంది. అంటే వాక్య విరామంతో అలాటి స్వర సంయోగాలు రావు. చెప్పదలుచుకొన్న వాక్యం పూర్తి అయిందా, లేక ఇంకా ఉందా అన్న సంగతి వాక్యస్వర భేదాలను బట్టే తెలుసుకుంటాం. ఏభాషకైనా వాక్యప్రకరణం (Syntax) రాసేటప్పుడు వీటి ప్రవర్తనను సమగ్రంగా వర్ణిస్తేనేగాని వాక్య స్వరూపనిరూపణం సాధ్యంకాదు.

## ముగింపు

భారతదేశం భాషారాష్ట్రాలుగా విభక్తమయిం తర్వాత ఒకప్రాంతంవారి భాషను మరోప్రాంతంవారు నేర్చుకోటంవల్లనే దేశైక్యం నిలుస్తుంది. ఈ ఉద్దేశంతోనే భారత ప్రభుత్వంవారు తెలుగు, తమిళం, కన్నడం బోధించటానికి కాశీ, అలహాబాద్, ఢిల్లీ, ఆగ్రా, మొదలైన విశ్వవిద్యాలయాల్లో ప్రత్యేక భాషా శాఖలు స్థాపించారు. భాషలను శాస్త్రీయ పద్ధతిలో బోధించటానికి ఆధునిక భాషాశాస్త్రజ్ఞానం ఆవశ్యకం.

ఈ వ్యాసంలో సూచించిన విషయాలు తెలుగువారికి సుపరిచితాలైనా, వాటి శాస్త్రీయ ప్రతిపాదన నూతనంగా తోచవచ్చు. మన భాషా నిర్మాణాన్ని అర్థం చేసుకోవాలన్నా, అన్యభాషా వ్యవహర్తలకు బోధించాలన్నా ధ్వనులను గురించి, వర్ణాలను గురించి యిలాటి సమగ్రవర్ణనలు ఎంతైనా ఆవశ్యకం. ఏ భాషకైనా వర్ణసమామ్నాయంలో ప్రతివర్ణ సహితోచ్చారణను చెప్పకుండా కేవలం వర్ణాల జాబితను మాత్రం ఇస్తే కొత్తగా భాష నేర్చుకొనేవారికి బోధించే వారికికూడా దానివల్ల అట్టే ప్రయోజనం ఉండదు.

అతను వాళ్లిద్దర్నీ చూడలేకపోయాడు. నడక సాగించాడు తన ప్రపంచంలోనికి. వెనక్కు తిరిగి చూశాడు. జాలిగా చూస్తున్న ముసలమ్మ— స్తబ్ధంగా నిల్చున్న గుడ్డిపిల్ల, వారివైపునుంచి విచారకరమైన గాలి. కొన్ని అడుగులు ముందుకు వేశాడు. వెనక్కు చూశాడు. ఇంకా నిల్చొని తనవైపు చూస్తున్న వృద్ధురాలు చేయి వూపుతున్నట్లు నిలబడ్డ గుడ్డిపిల్ల—ఇంకా కొన్ని అడుగులు ముందుకు వేశాడు. పూర్వం లాగే నిల్చున్న గుడ్డిపిల్ల, వృద్ధురాలు, ఎదురుగా ఆకులు రాలి చిగుర్చుతున్న చెట్టు, 'అంబా' అని అరుస్తూ తల్లివైపు చూస్తున్న లేగదూడ — మరలా తిరిగి చూశాడు. చేయి విసురుతున్న ముసలమ్మ, నిల్చున్న గుడ్డిపిల్ల. మనసు కరిగింది. తలపు మారింది. నయనాలు ఆర్ద్రాలైనాయి. కాళ్ళు ముందుకు సాగలేదు. వెనక్కు తిరిగాడు. ఒక్కటే పరుగు—ఒక్కటే విశ్వాసం ఒక్కటే దీక్ష. ముసలమ్మ పాదాలపై పడిపోయాడు.

'అమ్మా! నే వెళ్ళనింక!'

'నా నాయనే! నా నాయనే!' కౌగలించుకొంది. ముసలమ్మ కన్నుల్లో నీరు చిప్పిలినాయి. ఏతాముమీద నుంచున్న పిల్లమనసులో హర్షం కురిసింది. ముఖంలో సంతోషరేఖలు గుడ్డికన్నుల్లో ఆనందబాష్పాలు.

## 2

ముసలమ్మ 'కృష్ణుడూ' అనిపిలిస్తే అతను ఆనందం పొందేవాడు. 'రాధా' అని కృష్ణుడు పిలిస్తే ఆపిల్ల ఉప్పొంగిపోయేది. ముసలమ్మ పేరు నాగమ్మ.

కృష్ణుడు రాధతో పనులు చేయించడంలేదు. రాధ కొంతకాలం ససేమిరా అంది కాని తరువాత అతని మాట శిరసావహించింది. ఏవో చిన్నపనులు చేసేది. ముసలమ్మ అప్పుడప్పుడు అనుకొంటూ వుండేది — తన కొడుకే గనక బ్రతికివుంటే కృష్ణునికిలాగా పదహారేళ్లు వుండేవి; పుట్టగానే తండ్రిని పొట్టనబెట్టుకుని, చిన్నతనంలోనే తల్లిని చంపుకొని, పొరలుక్రమ్మి దృష్టి లేని కూతురు బిడ్డ రాధకు ఈడుజోడు అయ్యేవాడు అని.

కృష్ణుడు ముసలమ్మదగ్గర వుంటూ అర ఎకరం మెట్టలో కూరగాయలే కాకుండా రకరకాల పూల మొక్కలు తెచ్చి నాటాడు — గులాబీ, కాగడామల్లెలు, మల్లెతీగలు, పన్నీరు జాతులు, కనకాంబరాలు నాటాడు. శ్రమ అనుకోకుండా పసిపిల్లల్ని పెంచినట్లు పోషణ చేయసాగాడు. ఇప్పుడు గమ్యరహితంగా సంచరిస్తున్న అతనిహృదయంలో ఏదో తృప్తి తొణికిసలాడింది. మాతృమూర్తివంటి ముసలమ్మ—లోకం తెలియని రాధ అవలంబంలేని అనాథస్థితి కృష్ణుణ్ణి బంధించివేశాయి. ఇక వారి యోగక్షేమాలే తన లక్ష్యంగా నిర్ణయించుకొన్నాడు.

అశాంతిలో సతమతమౌతున్న నాగమ్మ మనస్సుకు యిప్పుడు ప్రశాంతి దొరికింది. కొడుకువంటి కృష్ణుడు ఎదురుగా వుంటే ఆమెకళ్ళు ఆమె హృదయంలోకి చూచేవి. ఆమె నిశ్చింతగావుంది.

రాధ హృదయం కృష్ణుని దాక్షిణ్యత్యాగాలవల్ల పరిప్లుతమైంది. ఉషారుగా మాట్లాడుతూ, చలాకీగా పనిచేస్తున్న కృష్ణుడంటే రాధకు చాల ఇష్టం. అంతేకాదు; అతనంటే అమితభక్తి. ఎలాంటిసంబంధం లేకుండా తన అమ్మమ్మకు, తనకు సహాయంగా వున్నాడు అంటే అతను ఎంతో మంచివాడు అనుకుంది. క్రమక్రమంగా కృష్ణుణ్ణి ఊహించి అతని ఆకారం హృదయంలో లిఖించుకొంది. రోజుకి రోజు తన భావనామూర్తికి నగిషీ పెడుతున్నది.

విసుగు విరామంలేకుండా కృష్ణుడు పనిచేస్తున్నాడు. రాధకు ఎన్నో సంగతులు చెప్పేవాడు. ఆమెకు చిత్రంగా వుండేవి అతని మాటలు. అందుకనే కృష్ణుణ్ని దేవుడనుకొన్నది. బాధలతో, అశాంతితో అణగారిపోయే దౌర్భాగ్యజీవులకు సహాయంచేయడానికి దేవుడు మారువేషంలో వచ్చేవాడని ఆమె అమ్మమ్మ చెప్పినమాటలు కృష్ణుని విషయంలో సమన్వయమవుతూ వుంది. 'ఏమో! దేవుడేమో!' అనుకొనేది. అమ్మమ్మ తనకు గోపాలకృష్ణుడు దయామయుడని కుచేలునివంటి నిరుపేదలకు సహాయంచేశాడని, నమ్మినవాళ్ళకు కొంగు బంగారమని చెప్పగా విని నిజంగా ఆ కృష్ణుడే ఈ కృష్ణుడుగా వచ్చాడేమో అనుకొనేది రాధ.

'రాధాకృష్ణులు' అని నోట్లో అనుకొని సిగ్గుపడేది రాధ.

మల్లెతీగలు సాగుతున్నాయి. పూలమొక్కలు ప్రాణాన్ని పొందాయి. కృష్ణుడు శ్రమ అనేమాట లేకుండా కృషిచేస్తున్నాడు. ముసలమ్మ 'నా కన్నతండ్రి! నా చక్కనయ్య' అని మురిసిపోయేది కృష్ణుణ్ణి చూచి. అమ్మమ్మ ఆ కృష్ణపరమాత్మకు చాల అందమైనవాడని, ఆకారం చూసినట్లైతే జన్మ తరిస్తుందని, ముల్లోకాలు పరవశమౌతాయనే మాటలనుబట్టి రాధ 'కృష్ణుడు చాల అందంగా వుంటాడు' అని ఊహించు

కొన్నది. 'అందం అంటే ఏమిటి?' అనుకుంది రాధ మొదట ఆనాట విన్నప్పుడు. ఇప్పుడు అందం అనే మాటకు అర్థం కొంత తెలిసింది—కళ్ళుండి, దయార్ద్ర స్వభావంవుండి, తీయగా మాట్లాడితేనే అందం అనుకుంది రాధ. 'ఈకృష్ణుడు చాలా...అందమైనవాడు. అందరికన్నా—అందమైనవాడు.....కళ్ళున్న వాళ్ళకు గుడ్డివాళ్ళకన్న అందంగా కనబడతాడేమో?' అనుకుంది రాధ. రాధ మనసులో కృష్ణుడు నిండిపోయాడు.

రాధ భావనాభారంతో కాలం ఉత్సాహంగా సాగుతున్నది.

కృష్ణుడు ఎనిమిదిమైళ్ళదూరంలోవున్న బస్తీకి వెళ్ళి కూరగాయలు అమ్మి రాధకు ఏవో తినుబండారాలు, క్రొత్తబట్టలు, ఇంట్లోకి చిల్లరసామగ్రి తెచ్చేవాడు. ఆ సమయంలో అతను ఒక పిల్లనగ్రోవి తెచ్చుకొన్నాడు. ఒకనాడు సాయంత్రం కొంచెందూరంగా వున్న కొండపైలమీదనుండి పిల్లవాయువులు ఆనందాన్ని కబుర్లుచెబుతూ, గోరువంకలకంఠాల్లో ఉత్సాహాన్ని కురిపిస్తూ, గగనరంగస్థలంలో నడయాడుతున్న మబ్బులకు మందగమనాన్ని నేర్పుతున్న సమయంలో వేణుగానం సాగించాడు లేమామిడిచెట్టుక్రింద.

తీగలు తీగలుగా, తెరలు తెరలుగా, క్రమ క్రమంగా వేణునాదంస్థాయి అందుకొన్నది. ప్రకృతి పరవశమైపోయింది. రాధ సమ్మోహితయైపోయింది. ఆమెరక్తంలో ప్రణయాణువు నాట్యంచేసింది. రోమాంచం కల్గింది. గుడ్డికళ్లు ఆనందంతో మెరిశాయి. భాష్పకణాలు రాల్చాయి.

'అవును నిజంగా ఈకృష్ణుడు—ఆ కృష్ణుడేమో! ఆ కృష్ణుడు బృందావనంలో, యమునాతీరంలో, గోపికలదగ్గర, గోవులు ఆనందపడేటట్లు, పువ్వులు వికసించేటట్లు పిల్లనగ్రోవి ఊదేవాడని అమ్మమ్మ ఏమిటేమిటో గొప్పగా చెబుతుంది. అమ్మమ్మ చూసిందేమో మరి! కాని ఈకృష్ణుడు పిల్లనగ్రోవి ఊదటం చాలా బాగుంది. ఏమిటో సంతోషంగా వుంటుంది. ఎట్లా ఊదుతాడోమరి' అనుకొనేది రాధ.

మొత్తంమీద కృష్ణుడు రాధ తలంపుల్లో తాదాత్మ్యం చెందాడు. ఆమె నిశ్వాసంలో సమ్మిళితమైనాడు. అతను మాట్లాడుతుంటే హృదయం ఆనందంగా వుండేది. ఒక్కసారి కృష్ణుడు సంతోషంగా 'రాధా' అని పిలిస్తే ఆమె గుండెలో వేయివసంతాల చిగురుల మృదుత్వాల సిగ్గు మొగ్గ అయ్యేది.

'ఒరే కృష్ణుడూ! మన కొండుకురా యీపిల్ల! నువ్వు దానితో మాట్లాడమాక' అని నాగమ్మ అంటే ఒకరకంగా నవ్వేవాడు కృష్ణుడు. అప్పుడు రాధ బాల్య ముగ్ధత్వం నునుచెక్కిళ్లలోకి దూరి, హృదయంలో నాట్యంచేసి 'హా! అమ్మమ్మా' క్రిందమూరేది.

## 3

నాలుగు వసంతాలు కాలంముఖంలో శోభను కూర్చాయి.

స్నిగ్ధ గగనపు గులాబిరంగు అగాధసాగరం ముఖంలో ప్రతిబింబం చూసుకుంది. భూదేవి తుంగస్తనాలైన పర్వతాలు ఆకుపచ్చని రంగుపయ్యెద కప్పుకొన్నవి. సూర్యనిరాశలో కలువలు సిగ్గుతో ముకుళించుకొన్నాయి. మామిడిచిగురు మెసవిన కోయిల కన్నెల కంఠనాదాలు ప్రకృతిహృదయాన్ని తట్టి లేపాయి. ఆకాశంలో మబ్బులు అందంగా అడుగులు నేర్చుకొంటున్నాయి.

మల్లెలు, మొల్లలు రెప్పలు విప్పాయి. గులాబీలు సౌరభాన్ని ప్రశస్తంగావించాయి. మూగపూలు నిట్టూర్చాయి.

వసంతంలో మధుమాసంలాగా, మధుమాసంలో నవపల్లవంలాగా, నవపల్లవంలో లతాంతంలాగా, లతాంతంలో మకరందంలాగా, మకరందంలో మాధుర్యంలాగా రాధలో నవయౌవనచిహ్నాలు చోటుచేసుకొన్నాయి. ఆమె అందం సూర్యుడు లేని ఉదయంలా వుంది, చంద్రుడు లేని వెన్నెలలా వుంది, మృదుత్వం లేని నవనీతంలా వుంది, ప్రేమలేని హృదయంలా వుంది.

నాగమ్మ జవసత్త్వాలు ఉడిగిపోతున్నాయి. రాధ, కృష్ణుడు ఆమెకు నేత్రాల్లాగా వున్నారు. అదివరకు కంటె, ముసలమ్మ యింటిపరిస్థితి మారింది. కృష్ణుడు నాటిన పూలమొక్కలు కన్నులు విచ్చి కటాక్షిస్తుంటే వాళ్ళలేమి తిరుగుముఖం పట్టింది. నాగమ్మ కృష్ణుణ్ణి మనసులో మొక్కుకునేది. కృష్ణుని ఆదరానికి రాధ మురిసిపోయేది. ఆమెకు కావలసినవన్నీ కృష్ణుడు తెచ్చేవాడు. అతనిగురించి ఆలోచించడమే ఆమెకు చర్యగా అయింది. కృష్ణుడు ఎంత మంచివాడు! అతనిహృదయం ఎంత విశాలం! కృష్ణుడు ఎలా వుంటాడు! బాగా మాట్లాడుతాడు కూడా! తానంటే చాల అభిమానం! అసలు అతనికి వాళ్ళకు గల సంబంధం ఏమిటి? కళ్ళున్నవాళ్ళందరూ మంచివాళ్ళే నన్నమాట! ఏమో! ఎందుకు సహాయం చేస్తున్నాడు? - అని రాధ అనుకొనేది.

అందరికీ కళ్ళెందుకు వున్నాయి? తనకెందుకు లేవు. అమ్మమ్మ పూర్వజన్మలో చేసుకొన్న పాపంవల్ల గ్రుడ్డి కళ్ళు వచ్చాయి అంటుంది. అసలు పాపం అంటే ఏమిటో? అయినా తానొక్కతేనా పాపం చేసింది? ఎవరూ చేయలేదా పాప?—

ఈ లోకం ఎలా వుంటుందో! అమ్మమ్మ చీకటి, పగలు అంటుంది. తనకేమో అంతా నల్లగావుంది. గులాబీలు, మల్లెపూలు బలే మంచివాసన! అవి ఎల్లా వుంటాయో? గువ్వపిట్టలు...పిచ్చిక...కళ్ళు లేకపోతే ఎందుకు బ్రతుకు? ఒక్కసారి కళ్ళొస్తే! కృష్ణుణ్ణి చూడొచ్చు. అమ్మమ్మను చూడొచ్చు! అంతా చూడొచ్చు—అనుకొనేది రాధ.

కృష్ణుడు మట్లాడుతుంటే—'వెన్నెలలాగా చల్లగా-ఉదయంలాగా ఉల్లాసంగా-ఏమిటో ఒకలాంటి ఆనందంగా వుంటుంది. ఎందుకోమరి? అసలు.. కృష్ణు డెలావుంటాడు?' - అనుకొనేది రాధ.

ఒకనాడు సంధ్యాసమయం. కృష్ణుడు ఇంటి ఎదురుగావున్న మామిడిచెట్టు క్రింద కూర్చొని, కూని రాగం ఆలపిస్తూ మామిడిచెట్టును కలయజూస్తున్నాడు. అతని అలికిడినిబట్టి రాధ నెమ్మదిగా అక్కడకు వచ్చింది.

'రాధా! ఈ మామిడిచెట్టు నాలుగేళ్ళకు పూత పూసింది' అన్నాడు.

'అవును. నాకు వాసనవస్తుంది. అబ్బ! నాలుగేళ్ళకు పూతపూసింది!'

'రాధా! మనం...ఆరోజు ప్రొద్దున...ఎద్దులు నన్ను తరుముకొన్నాయని చెప్పానే అప్పుడు కదూ దీన్ని నాటింది?'

'ఆఁ...మరేఁ...'

'చూశావా! రాధా! కాలం ఎంత త్వరగా పరుగెడ్తావుందో? నేనువచ్చి నాల్గు సంవత్సరాలు అయిందా? ఇదిగో! మామిడిచెట్టు పూసింది. అదుగో! అక్కడ పొగడచెట్టు పెద్దదయింది. మల్లెపొదలు గుబురులయ్యాయి. గులాబిమొక్కలు బాగా పెరిగాయి. అంతా మారిపోయిందికదా?'

'నీకిదంతా మారిపోవడమే చిత్రంగా వుందా?' ముఖంలో ఏదో కదలికలు కన్పించాయి.

'ఏం...నీకు లేదా?'

'అబ్బే ఎందుకులేదూ? నాకు నేనే చిత్రంగా లేదూ?' హృదయంలో బాధ మాటల్లో కనబడింది.

'ప.. తప్పు రాధా... నేను ఏం చెప్పాను నీకు; ఎప్పుడూ అట్లా అనొద్దు!' బాధగా అన్నాడు.

'అవును నేనెందుకు బతకటం...చెప్పు...ఈ గుడ్డికళ్ళు .చీకటి...నలుపు...ఒకరి ఆధారం...నాబతుకెందుకు?' ఆమె కన్నులు ఏడ్చాయి.

'అదే తప్పు రాధా! బాధ...ఆనందం మానసిక వికారాలు. ఇంతే రాధా!...నీకు కళ్ళులేవని బాధ పడ్తున్నావ్. నేనూ బాధపడ్తున్నా నీకు కళ్ళులేవని; ఏముంది లేదా? నువ్వు గ్రుడ్డిగావుండి లోకం ఎంత బాగుందని - అనుకొంటావు. కళ్ళువస్తే లోకం గ్రుడ్డిది అనుకొంటావు. లోకం సమాధిలాంటిది. నువ్వు ఏడవబోకు రాధా...ఏడవబోకు'. రాధా మాట్లాడలేదు. కొన్ని నిముషాలు గడిచాయి.

కృష్ణుడు చుట్టూ కలయజూచాడు. పశ్చిమ దిక్కున సూర్యుడు అస్తంగతుడైనప్పటికీ కిరణాలు ప్రపంచాన్ని వీడలేని ఆశల్లాగా పైకి ప్రసరిస్తున్నాయి. ప్రక్కన పర్వతాలమీద నెలవంక. పూత పూసిన మామిడిచెట్లు. ఆకులు రాలుతున్న వెదురు పొదలు. అతను ఆనందభరితుడవుతున్నాడు.

'రాధా! ఈవాళ చాల బాగుంది. కుంకుమ రంగుతో సూర్యుడు అస్తమిస్తున్నాడు. నల్లని పర్వతం మీద వున్న నెలవంక పరమేశ్వరుని జటాజూటంలో వున్న బాలచంద్రుడులా వున్నాడు. అదిగో! మన ఏతంవగ్గర గట్టుమీద ఈతచెట్టుపై నుండి మినుక్కుమంటున్న చుక్క. చెరువుపొదలవగ్గర గువ్వలు సరసాలాడుకొంటున్నాయి. ఇదిగో! మనమామిడిచెట్టు పూతకు తేనెటీగలు ముసురుకొంటున్నాయి. విన్నావా! శేషమ్మగారి తోటలోనుంచి కోయిల ఎంత బాగా కూస్తోందో! మల్లెపూలు విరిసి చాలా రాలిపోయాయి. అబ్బ! గులాబీలు ఎంత బావున్నాయి. కాగడా మల్లెల్ని దేవుడు మూగపువ్వులుగా ఎందుకు చేశాడబ్బా...' ఆగిపోయాడు. ఏడుపు విన్పించింది.

అతను స్తబ్ధుడయ్యాడు. హృదయం విస్రస్తత అయింది. రాధ ఎందుకు ఏడుస్తుందో అర్థమైంది.

'రాధా పొరపాటయింది...ఏదో ఉషారుగా అన్నిటిని చూస్తూ చెప్పానుగాని నా మాటలు నీకు బాధ కలిగిస్తాయనుకోలేదు. అనుకోనిరీతిగా నిన్ను బాధపెట్టాను. నన్ను క్షమించు రాధ,' భుజంమీది కండువాతో ఆమె ముఖంమీద ప్రవహిస్తున్న కన్నీళ్ళను తుడిచాడు. రాధశరీరంలో విద్యుత్తు ప్రసరించింది.

గుండెలోని రక్తానికి పోటు అధికమైంది. శరీరం గగుర్పొడిచింది.

'ఒక్క సంగతి చెబుతున్నా రాధా నీకన్నుల్లో నీటితెరను నేను చూడలేను. నీ ముఖంలో విషాదాన్ని ఊహించలేను. నువ్వు ఉత్సాహంగా వుండక పోతే నేను వుండలేను ఇక్కడ. ఇంకా ఎన్నడైనా నీ కన్నుల్లో కన్నీరు కనబడితే నాకళ్ళల్లో అగ్ని...'

రాధ కృష్ణుని పెదాలు చేతితో మూసివేసింది. అతడు రాధ చేతిని మెల్లగా స్పృశించాడు. ఆమె హృదయం పాటపాడింది. ఆనందం వంత వేసింది. రాధ అతనికళ్ళు చేతితో స్పృశించింది.

'ఏమిరా పొద్దుపోవడంలా. చెట్టుక్రింద నుంచున్నారేం' అన్న నాగమ్మ మాటలు విని కృష్ణుడు రాధ చెయ్యిపట్టుకొని నవ్వుకొని వెళ్లాడు.

4

నిద్రలో రాధకు కలవచ్చింది. కలలో తను ఘాటి వచ్చింది. అనుభూతి అనుభవాన్ని మననం చేయించింది. చల్లనిచీకటి...నీళ్ళ గలగల...మల్లెపూల వాసన...సంపెంగల సౌగంధ్యం...కోయిలకూత...తనను పెనవేసుకోబోతున్న కృష్ణుని స్పర్శ...ఆనంద ప్రవాహం..మైకం..క్షణంలో విడిపోయి దూరంగా వెళ్ళిన కృష్ణుడు... భయానకమైన అతని కేక... ఆర్తనాదం కృష్ణా! అని కేక వేసి దుఃఖపూరితకంఠంతో రాధ.

'పిచ్చిపిల్ల! కలవరిస్తున్నావా! లేవమ్మ తెల్లారిం. కృష్ణుడు పూలు కోసుకొని బస్తీకెళ్ళాడు' అంది ముసలమ్మ తట్టుతూ. కలలోకల చెదిరిపోయింది. కంగ లేచింది రాధ.

సూర్యుడు నెత్తిమీదకు వచ్చాడు. కృష్ణుడు లేకపోవడం రాధకు ఒంటరితనంగా, ఒకరకమైన భీతావహంగావుంది. మౌనంగా కూర్చున్నది. అప్పుడే కృష్ణుడు వచ్చాడు 'అమ్మా' అంటూ. వడ్లు ఎండబెడుతున్న ముసలమ్మ 'వచ్చావా నాయనా! కాళ్ళు కడుక్కురా. అన్నం తిందువు' అంది.

రాధ ముఖంలో సంతోషరేఖల విహ్వలు. ఉప్పొంగిన హృదయం.

'అమ్మా! బస్తీలో భలే పెద్ద డాక్టరు వచ్చాడు. అబ్బా! చాలమంది గుడ్డివాళ్ళకు కళ్ళు తెప్పించాడనుకో! నేను ఆసుపత్రిదగ్గరకు వెళ్ళి మాతో అమ్మాయి వుంది. తీసుకొస్తా అన్నా; తొందరగా తీసుకురా అన్నారు. కాబట్టి రాధను ఇప్పుడు తీసికెళ్తానమ్మా.'

'ఒరేబాబూ! నీపిచ్చిగాని వస్తయి అంటావా?' ఆశ్చర్యంగా అంది ముసలమ్మ.

'ఎందుకు రావే. చాలామందికి కళ్ళువస్తే. తప్పక తీసికెళ్తాను. ఏమంటావమ్మా'

నాగమ్మ కృష్ణుడి నిశ్చయాన్ని కాదనలేక పోయింది. చివరకు 'సరే' అంది.

ఈమాటలు వింటున్న రాధమనసు సంతోషంతో గంతులేసింది. కృష్ణుణ్ణి గట్టిగా కౌగలించుకొందామా అనిపించింది. అతనిపాదాలు ఆనందాశ్రువులతో అభిషేకం చేద్దామా అనిపించింది. అతని ముఖాన్ని ముద్దులలో నింపి తృప్తిపడదామా అనిపించింది. జీవితాంతం అతని దాసిగా వుందామా అనిపించింది.

బస్తీకి ప్రయాణమయ్యారు. వాళ్ళు బయలుదేరుతుంటే నాగమ్మకు అయోమయంగావుంది. తన నేదో ఏకాకితనం ఆవరించినట్లు బాధపడింది. రాధకు ఎన్నో జాగ్రత్తలు చెప్పి ధైర్యం చెప్పింది. అయినప్పటికి ముసలికన్నుల్లో నీళ్ళు తిరిగాయి. నేనుండగా భయం ఏమిటమ్మా—అని కృష్ణుడు అన్నతర్వాత స్థిమితపడింది. నాగమ్మ వాళ్లు కనబడేంతవరకు చూసింది.

బస్తీలో మోటార్ల మోతలు. జనులకోలాహలాన్ని విని రాధ ఆశ్చర్యపోయింది. కృష్ణుడు ప్రతిదాన్ని గురించి ఎంతో గొప్పగా చెప్పేవాడు రాధ బాధపడకుండా. 'నువ్వుకూడా చూస్తావులే లోకాన్ని' అనేవాడు. రాధ ఆనందంలో మునిగిపోయేది. అప్పటికి సాయంత్రం అయింది.

హాస్పిటల్ కు వెళ్లారు. డాక్టరు రాధ కళ్లు పరీక్ష చేశాడు. 'కళ్ళు రావచ్చు. పొరలుమాత్రమే ఆపరేషన్ చేయాలి. ఇంతవరకు ఏ డాక్టరుకు చూపించలేదా ఎందుకనంటారు? అయినా భయంలేదు. ఇక్కడ నాలుగు రోజులు వుండండి; ఆపరేషన్ చేస్తాం' అన్నాడు. కృష్ణుడు మహానందంతో మునిగిపోయాడు. రాధకు క్రొత్తలోకం లోనికి ప్రవేశిస్తున్నాను అనే భావన కలుగుతున్నది.

అక్కడ ఏర్పాట్లన్ని సక్రమంగా జరిగాయి. డాక్టరు ఆపరేషన్ జరిగేరోజు తప్పక రావాలి అన్నాడు. తలూపాడు కృష్ణుడు.

'నేను యింటికివెళ్తున్నా రాధా! ఇక్కడ నర్సులు బాగా చూస్తారులే. అమ్మకు ఈసంగతు లన్నీ చెప్పొద్దూ మరీ!'

'అమ్మా నేను ఒక్కదాన్నే; నాకు భయం. నువ్వు వెళ్ళొద్దు.'

'ఎల్లా రాధామరి? చెట్లకు నీళ్ళు పెట్టాలా? పూలు కోయ్యాలా? పాదులు చెయ్యాలా? ఇవన్నీ ఎవరు చేస్తారు చెప్పు. రేపు ప్రొద్దున పూలు అమ్మడానికి ఎట్లాగూ రావాలిగా.'

'రేపు తప్పక రావాలి...తప్పక రావాలి' అంది.

'ఓ' అన్నాడు.

నాలుగురోజులు గడిచాయి. ఆరోజు సాయంత్రం ఆపరేషన్ చేసే సమయంలో కృష్ణుడు అక్కడే వున్నాడు. ఆపరేషన్ జయప్రదంగా అయింది.

'ఇదిగో! వారంరోజుల్లో కట్లువిప్పుతాం. కళ్ళు వస్తాయి. అప్పుడు దగ్గరవుండాలి. నువ్వేనా వస్తావు? తప్పక రావాలి.?' అన్నాడు డాక్టరు.

'రోజూ వస్తున్నానండీ' అన్నాడు కృష్ణుడు. 'ఆల్ రైట్' అని వెళ్లాడు డాక్టరు. డాక్టరుమాటలు విన్న రాధ మనస్సు ఆకాశంలో తేలిపోతున్నట్లుగా, సంతోషప్రవాహంలో పయనిస్తున్నట్లుగా. ఆనంద స్వర్గంలో విహరిస్తున్నట్లుగా అనుకుంది. 'నాకు కళ్లు...వస్తాయి. నాకు కళ్ళు...వస్తాయి...వస్తాయి' మనసులో అనుకొని తృప్తిపడింది. కృష్ణుని ఆనందం వర్ణనాతీతం.

'రాధా నీకు కళ్ళు వస్తాయంట! నాకెంతో సంతోషంగ వుంది. అమ్మ ఎంత సంతోషపడుతుందో? కళ్ళువస్తాయన్నారు – అని చెప్తే నే అబ్బో ఎంత యిద యిందనుకొన్నావ్?'

'ఆఁ...నాకూ ఎంతో సంతోషంగావుంది... నే ననుకున్నానా? జీవితంలో యిలా అవుతుందని... నాకు...లోకం కనబడ్తుంది...నేనూ...; అది సరే గాని అమ్మమ్మరాలేదూ నన్ను చూడ్డానికి?'

'ఎలా వస్తుంది రాధా? ముసిలిదగ్గర ఓపిక లేక పాయె. లేకపోతే రాకుండ వుండగలదా?'

'మల్లెపొదలు, మామిడిచెట్టు, పొగడచెట్టు ఎలా వున్నయ్?'

'మామిడిచెట్టు చిన్న చిన్న పిందెలు వేస్తున్నది. పొగడపూలు యిప్పుడిప్పుడే కనబడుతున్నాయి. మల్లెపూలు, గులాబీలు విరగబూస్తున్నాయ్. నీ పిచ్చిక కూడా బాగానే వుంది రాధా! అప్పుడప్పుడూ అరుస్తూ వుంటుంది నీకోసమే నేమో?!' రాధ చిన్నగా నవ్వింది.

'వస్తా రాధా! పొద్దుపోతుంది; ఇంటికెళ్ళేటప్పటికి. కదలకుండా పడుకో.'

'నీ చెయ్యేది కృష్ణా...ఇలా...ఇవ్వు...ఇక్కడ మనుషులు లేరుగా,' అంది. కృష్ణుడు చేతిని అందించాడు. రాధ అతని చేతిని సున్నితంగా తన స్నిగ్ధకపోలాలమీద రాచుకొన్నది. క్రొత్తగా ప్రసవించిన బాడిత పువ్వులోని రేఖలతో సామ్యంకలిగిన అరుణాధరాలతో ముద్దు పెట్టుకొన్నది.

కృష్ణుడు కొంచెంసేపు మౌనంగావుండి మెల్లిగా చెయ్యిలాక్కొని 'వస్తా రాధా' అని వెళ్ళిపోయాడు. రాధ కృష్ణుణ్ణిగురించి ఆలోచిస్తూ సుషుప్తిలో పడింది. ఆమె భావనాప్రపంచం, స్వప్నప్రపంచంగా మారిపోయింది. దానిలో అస్పష్టరేఖలు...నిర్దిష్టము కాని ఆకారాలు...

పదకొండవ రోజు...కృష్ణుడు రాలేదు. ఆరోజు కట్లు విప్పలేదు. రాధ ఆతురతతో కృష్ణునిరాకకోసం ఎదురుచూస్తున్నది. రెండుసార్లు డాక్టరు అడిగాడు. ఇంకా కృష్ణుడురాలేదు. తన ఆలోచనల పరిష్వంగంలో మిళితమైన కృష్ణుడు–తన ఆశలో ఆశ–తన సంరక్షకుడు, తన సర్వస్వం...ఇంకా రాలేదు? ఎందుకు రాలేదు? రాకుండా వుంటాడే? కట్లు విప్పగానే అతనిముఖం చూడాలని వున్న రాధ మనసు ఆందోళనపడింది. మనస్సులో అనుకుంది రావాలి...రావాలి...అని. కొన్ని నిముషాల్లో కట్లు విప్పుతారు. కృష్ణుడు రాలేదు.

కట్లు విప్పారు. విశాలనయనాలమీద కనురెప్పలు భారంగా, బిడియంగా సోయగంతో, సుకుమారంగా— దృష్టికి అంతరాయానికి మధ్య తెరల్లాగా లేచాయి— కంటిలోకి వెలుగుచొచ్చుకుంది...వెలుగులోకి కంటి కిరణం ప్రసరించింది...క్షణం చీకటి...మరుక్షణం దృష్టి...డాక్టరు నవ్వుతున్న ముఖం...అతని కళ్ళు. నర్సులు తెల్లనిబట్టలలో...చెలాకీ కళ్లు. బయట ప్రకాశమైన వెలుతురు. పైనవిశాలమైన ఆకాశం...పలుచని మబ్బులు. పచ్చని...గుబురు నిద్రగన్నేరు చెట్టు...రాలుతున్న ఆకులు...చెట్టుమీద కిలకిలలు...పచ్చని చిలుకలు...చెట్టుక్రింద మందారచెట్టు...రాలిపోయిన ఎర్రనిపూలు రంగురంగుల పూలమొక్కలు...నిండు కదలిక...వాటిపైన సీతాకోకచిలుకల సంచారం... ప్రేమవిహారం...పచ్చనిగడ్డి...గాలికి కదులుతున్న వాటికంకులు...ప్రక్కన రోడ్డుమీద నడుస్తున్న మనుష్యులు...చిత్రదర్శనం...ప్రపంచం. లోకాన్ని రాధ చూసింది. లోకం రాధను చూసింది. అప్పుడే పుట్టిన జ్ఞానంగలశిశువులా రాధ విస్తుపోయి చూస్తున్నది. కళ్ళున్న సమస్యల జీవితంలో తొలిమాపును ప్రసరింప జేసింది రాధ. తనకు తానే క్రొత్తగా వుంది.

# ఉత్ప్రేరితులు!

మరుక్షణంలో రాధహృదయంలో కృష్ణుడు మెదిలాడు. ఎలావుంటాడు? వీళ్ళ అందరికన్నా బాగుంటాడు! డాక్టరుకన్నా బాగుంటాడు! లోకంలో అందరికన్నా బాగుంటాడు! చూపులో.. రూపులో ప్రతి విషయంలో బాగుంటాడు! మూర్తీభవించిన మార్దవంలాగా వుంటాడు. కృష్ణుణ్ణి చూడాలి...రాధకళ్ళు కోరుకున్నాయి. కృష్ణుని మాటలు వినాలి...చెవులు యాచించాయి. అతన్ని స్పృశించాలి. రక్తంలో ప్రత్యణువు అర్థించింది. నయనాలు రెప్పలు విప్పుకొన్నాయి. హృదయం కవాటాలు తెరిచింది ఉత్సాహం ఉరకలు వేసింది...ఉద్వేగం పరిధి దాటింది...

మరుక్షణంలో నాగమ్మ జ్ఞప్తికి వచ్చింది. అమ్మగార్ని...ఎలావుంటుంది? తన శరీరాన్ని నిమిరే చేతిని ముద్దు పెట్టుకోవాలి. తనకు సపర్యచేసిన ఆమెను పూజించాలి. తనను పిలిచిన ఆమెకు ప్రాణం యివ్వాలి. తనను అనునయించిన ఆమెకు అభివందనాలు చేయాలి.

రాధకు ప్రీతిపాత్రమైన వస్తువులు...వ్యక్తులు నిర్దుష్ట ఆకారవిహీనంగా మసకగా మనసులో కదిలాయి. ఆనందం వర్షించింది. అనుభూతుండు ఆలోకం వచ్చింది యథాస్థితికి వచ్చింది. ఎదురుగా డాక్టరు చిరునవ్వులో.

'ఏమండీ...మా కృష్ణ...రా...లే...దు' అంది దిగులుగా రాధ.

'వస్తాడులే గాని నువ్వు కళ్ళుమూసుకొని పడుకో; నర్స్! టేక్ కేర్!' అని వెళ్ళాడు డాక్టరు.

రాధ కృష్ణుణ్ణి మసలమ్మను తలచుకొంటూ కన్నులు మూసింది. సాయంత్రం అయింది. రాధను చూడడానికి చాలమంది వచ్చారు. ఆమె అందాన్ని కళ్ళతో ఎంగిలిచేశారు. రాధ ప్రతివారిని పరీక్షగా చూసింది. ప్రతివారిని కృష్ణుడితో పోల్చుకుంది. కృష్ణుడు వాళ్ళకన్నా అందంగావుంటాడు...ఎంతో బాగుంటాడు. అనుకొంది. రాత్రి అయింది. కృష్ణుడు రాలేదు. ఎందుకురాలేదు? అనే ప్రశ్న ఆమె మనసులో పదేపదే ధ్వనించింది. తాను ఒక్కతే ప్రపంచంలో ఏకాకిగా, దిక్కుటిక్కుమంటున్నా ననిపించింది. ఆమెకన్నులు అశ్రుపూరితాలైనాయి. ఏడ్చి నిద్రపోయాయి.

తెల్లవారింది. రాధ సూర్యోదయాన్ని తొలిసారిగా చూసింది కాకుల అరుపులు, ప్రాతఃకాలపు ప్రత్యేక వాతావరణాన్ని నిశితంగా పరిశీలించింది. మనసులో ఏవేవో భావాలు క్రమ్ముకొన్నాయి. ఆరోజు కూడా ఎంతోమంది రాధను చూడడానికి వచ్చారు. అందాన్ని దర్శించారు. రాధ ప్రతివారిని చూసి కృష్ణుణ్ణి గొప్పగా మనసులో ఊహించుకొన్నది. మధ్యాహ్నాన్ని సాయంత్రం ఆక్రమించుకొంది. రాధ హృదయం ఉత్కంఠతో ఉరకలు వేస్తున్నది. కన్నులు మూసుకొని ఆలోచిస్తున్నది.

'రాధా!' సంతోషపూరితమైన కంఠధ్వని వినిపించింది. నాగస్వరం నిస్వనానికి కుబుసం విప్పిన కోడె త్రాచులాగా రాధ ఉవ్వెత్తుగా లేచింది. అతనిదే కంఠం! తన ఆశామోసు! దయానిధి; తను అందంగా ఊహించుకొన్న సుందరుని కంఠం. రెప్పలు విరియించి చూసింది— ఎదురుగా కృష్ణుడు. మ్రాన్పడి పోయింది. గగనాగ్రం నుండి పాతాళంలోని కఠిన శిలాతలంమీద పడి చిద్రుపలై పోయింది ఆశాఫలం. చల్లని నీటితుంపరుల వర్షిస్తాయనుకొన్న మేఘాలు అగ్నికణాలు వర్షించాయి. కృష్ణుణ్ణి చూడలేకపోయింది...ఎఱ్ఱనిజుట్టు, వికారమైన నల్లనిముఖం, ఎక్కడోవున్న కళ్ళు. బండ పెదవులు, మెళ్ళోతుంటా, కావిరంగు బట్టలు, నల్లని శరీరం. కళ్ళుభారంగా మూసుకొన్నది. కన్నుల్లో క్షణంసేపు చీకటి, హృదయంపై క్షణంసేపు నల్లనీడ, మెదడు పొరలలో కొంచెంసేపు అధిక ఉష్ణం. మనసులో చీకటి సుముఖ మరుగులోని నిశ్శబ్దపు నిస్వనం – ఊహించుకొన్న శిల నిరాశల చిగకొనల నిశ్వాసాలు–ప్రకోపించిన రక్తపు స్తంభనం–కళ్ళు మూసుకొన్నది. కృష్ణుని ముఖంలో ఉత్సాహం తగ్గింది. వెవక్కమైన నవ్వు నవ్వాడు.

'నేనే రాధా! నిన్న రాలేకపోయా. ఎద్దులు నన్ను తరుముకొని పొడిచాయి. అందుకని రాలేదు. అమ్మ అసలు తోటకెళ్ళద్దు అంది. కాని నేను వచ్చా రాధా. నీకు కళ్ళు వచ్చాయి. నాకు ఎంత సంబరంగా వుందనుకొన్నావ్. అబ్బ! నాకు ఏమిటోలాగావుంది. అమ్మ ఎంత సంతోషపడ్తుందో! బాగున్నావా రాధా? నాకు ఏమి మాట్లాడాలో తెలియటం లేదు రాధా. నీకళ్ళు బాగున్నాయి కదూ? వంట్లో కులాసాగా వుందిగా? ఏమన్నా అనుకొంటావేమో ననుకొన్నాను. మాట్లాడు రాధా. డాక్టరు రేపుపొద్దున యింటికి తీసుకెళ్ళమన్నాడు. నేను రాత్రి యిక్కడేవుంటా. బాగావున్నావుగా?' ఆప్యాయత గోచరించింది మాటల్లో.

రాధ గొంతు పెగల్లేదు. నిస్త్రాణగా రెప్పలు విప్పి కృష్ణుణ్ణి చూసి మళ్ళా కన్నులు మూసుకుంది. ఆమె మనసులో ఆశకు నిరాశకు మధ్యవుండే స్థితి, భావనకు వాస్తవానికి మధ్యవుండే స్థితి, వెలుగుకు చీకటికి మధ్య వుండే స్థితి, కల్పనకు కలకు మధ్యవుండే స్థితి నడయాడింది. కళ్ళ చివరలలో నుండి అశ్రుధారలు. ఆమె శక్తిని కూడా తీసుకొన్నది. ఆమె అధరాలు స్పందించాయి.

'నేను బాగానే వున్నాను కృష్ణా! చాలా బాగున్నాను. నా కళ్ళు బాగా చూడగల్గుతున్నాయి. నేను చూసేవి ఇక్కడ ఏమున్నాయి చెప్పు. నా పరిస్థితి ఆలోచనలలో వుందిగా? ఎదురుగా ఏమీ కనబడ్డం లేదు. అంతా అగమ్యంగా వుంది.'

'అవును రాధా నువ్వు చెప్పింది నిజం. నువ్వేమీ చూడలేవు యిక్కడ; ఇంటిదగ్గర అయితే మామిడి చెట్టు...పొగడ చెట్టు...నీ పిచ్చిక...' ఫాల భాగంలో గీతలు కన్పించాయి.

రాధ నవ్వింది. పొంగిపోయే సముద్రపు నీటి చిరునవ్వులాగా నవ్వింది. హృదయంలో ఏడుస్తూ నవ్వింది. ఏమీ చేయలేక నవ్వింది. నవ్వలేక నవ్వింది. కృష్ణుడు బయటకు వెళ్ళాడు; రాధను నిద్రపొమ్మని చెప్పుతూ.

రాధ మనసులో ఏడ్చింది. తాను అనుకొన్న దానికన్నా విషమంగా పరిస్థితులు పరిణమించాయని వ్యధతో క్రుంగిపోయింది. కర్తవ్యం ఏమిటో అర్థం కాలేదు. ఏమి జరుగుతుంది? ఏంచెయ్యాలి? కర్తవ్యం బోధపడలేదు. చూస్తూ చూస్తూ మనస్సును యిష్టంకాని వాన్ని ఎలా ఎన్నుకోవాలి? వాసనలేని పువ్వును ఎలా ఆఘ్రాణించాలి? కృతఘ్నుడని తెలిసి ఎందుకు పరుగెత్తాలి? అతను మానసికంగా మంచివాడు. దేవుడు...కాని కురూపి...తనపాలిటి రక్షకుడు... కాని—ఎలా? అటువంటివ్యక్తితో ఎలా ప్రవర్తించాలి? జీవితానికి భావికి మధ్యవుండే సమస్య ఎలాపరిష్కరించుకోవాలి?......అని మనసులో సమస్యలు క్రమ్ముకొన్నాయి.

ప్రశాంతమైన సముద్రంలో ఉత్తుంగ తరంగాల్లాగా, ఆ క్షణంలో వికసించిన పూలరేకులు ప్రచండమైన గాలిలో కదులుతున్నవిధంగా, మధురమైన గానంలో అపశ్రుతిలాగా, ఆనందంలో ఆవేదనలాగా మనస్సులో సమస్యలు. చీకటి లోకాన్ని ఆక్రమించుకొంది. చీకటి రాధ మనసులో చోటుచేసుకుంది. ఆమె రెప్పలు చీకటిని ఆహ్వానించాయి. నిద్రాదేవత కౌగలించుకొంది. మనస్సు ఘనీభవించింది.

తెల్లవారింది. రాధాకృష్ణులు యింటికి బయలుదేరారు. రాధ ప్రతివస్తువును క్రొత్తగా చూసింది. కృష్ణుడు అన్ని సంగతులు చెప్తున్నాడు. కాని రాధ మౌనంగావుంది. గోమ్మది గంభీరంగా. ఇంటి సమీపానికి వచ్చారు. మామిడిచెట్టు. పొగడచెట్టు, వేపచెట్టు, ఏతాము, గోలెం, పూలమొక్కలు—భావన కళ్ళల్లో కనిపిస్తూవుంది. అంతా క్రొత్తప్రపంచం... క్రొత్తభావాలు...క్రొత్త అనుభూతులు...దైన్యం... అగమ్యం...సమస్యలు......

ఎదురుగా ముసలమ్మ—ఆనందబాష్పాలతో క్రొత్త ఉత్సాహంగా భావిస్తున్న ముసలమ్మ రాధ వేగంగా నడిచింది...ముసలమ్మ కౌగిలిలో పడిపోయింది. కన్నుల్లో నీరు తిరిగింది రాధకు. 'నా తల్లికి కళ్ళొచ్చాయి. నా తల్లికి కళ్ళొచ్చాయి' ఆనందంతో అంది ముసలమ్మ. రాధ శరీరాన్ని ప్రేమతో నిమిరింది. రాధ ప్రతిచెట్టు దగ్గరకు, ప్రతిపిట్టదగ్గరకు వెళ్ళి పలకరించి వచ్చింది. వారికన్నా, కృష్ణుడు ఆనందంలో మునిగిపోయాడు.

రోజులు భారంగా గడుస్తున్నాయి. రాధ పూర్వంలాగా కృష్ణుడితో కలసివుండటం లేదు. ఏదో ఆలోచిస్తున్నట్లు వుంటుంది ఎప్పుడూ. అకారణంగా ఏడుస్తుంది. నిద్రలో కలవరిస్తుంది. కృష్ణుడికి ఎదురుగా వుండలేకపోతుంది. అలంకరించుకోవటం కూడా లేదు. ముసలమ్మకు ఏమిటో క్రొత్తగా వుంది. మనసులో లోతులు చూసేశక్తి ఆమెకు లేదు.

కృష్ణుడు రాధనుపూర్తిగా అర్థంచేసుకొన్నాడు; దానికి అనుగుణ్యంగా ప్రవర్తిస్తున్నాడు. అతని హృదయంలో సీలలు గ్రుచ్చినట్లుగావుంది. పూర్వంలాంటి ఆనందం లేదు. రాధ మాట్లాడ్డం లేదు. ఎవరో పరాయి మనిషిని చూసినట్లు ప్రవర్తిస్తున్నది. నవ్వుతో మాట్లాడ్డం లేదు. కనీసం ముఖంకూడ చూడటం లేదు. అతను కుమిలిపోతున్నాడు. కళ్లురాకపూర్వం రాధకు, కళ్లువచ్చినతర్వాత రాధకు యెంత పోలికవుందో పోల్చుకున్నాడు 'రాధ మారిపోయింది...రాధ మారిపోయింది. గ్రుడ్డితనంపోయి మూగతనం వచ్చిందా అన్నట్లు మారిపోయింది' అని అనుకొన్నాడు.

# ఉత్ప్రేరితులు!

రోజులు భారంగా గడుస్తున్నాయి. ఆవాళ పౌర్ణమి. పశ్చిమదిక్కున కారుమేఘాలు.

'కృష్ణుడూ! రాధ పెండ్లిసంగతి ఏం జేయాలి. నాకు అంతుపట్టడంలేదు. ఏమిటో అదివరకంత చలాకీ లేదురా. నువ్వు ఏం జెపుతా?' అంది నాగమ్మ.

'నేనుండగా నీకెందుకమ్మా బాధ. అన్ని సంగతులు చూసుకో నేవాణ్ణి నేనున్నాగా? రాధకు ఏం లోటు వస్తుందమ్మా నీపిచ్చిగాని?' అన్నాడు. అంతలో రాధ ఇంట్లోకి వచ్చింది. కృష్ణుడు బయటకు వెళ్లాడు. రాధ కళ్లలో ఏదో బాధ వ్యక్తమౌతున్నది.

'అమ్మమ్మా! నేను కృష్ణుడిని చేసుకోను. అసలు ఈ యింట్లో నే వుండను. నాకు కళ్ళు వచ్చేటట్లు చేసింది యిందుకా అమ్మమ్మా? నాకు యిష్టంలేదు. ఏమాత్రం యిష్టంలేదు' అని గుండె పగిలేటట్లు ఏడ్చింది.

నాగమ్మ నోరు తెరచి అలానే వుండిపోయింది. మాట్లాడలేకపోయింది. ఆ మాటలు విన్న కృష్ణుడు ఇంట్లోకి వచ్చాడు. అతని కంట్లో రక్తపుజీరలు, హృదయంలో బాధాతరంగాలు, ముఖంలో చీకటిరేఖలు తెరలు తెరలుగా కొనవస్తున్నాయి. రాధ బయటకు వెళ్ళబోయింది.

'ఆ...గ...రాధా...'

'ఎందుకు?'

'మా......ట'

'ఏం మాట?' బయటకు చూస్తూ అంది.

'రాధా...నువ్వు—నన్ను...అర్థం చేసుకోలేదు. అసలు...నా ప్రక్క నిన్ను కలలో కూడా...ఊహించుకోలేదు రాధా...నువ్వు...వెన్నముద్దవి...నేను...రాయిని. నువ్వు మంచిదానివి... నేను వికారిని...ఎందుకూ పనికిరానివాణ్ణి. మొదట్లో అన్ని సంగతులు చెబుతామనుకొన్నాను కాని...నీకు మనశ్శాంతి లేకుండా చేస్తానేమోనని చెప్పలేదు రాధా. ..............నువ్వు సుఖంగా...వుండాలి—నీ...కన్నుల్లో...తడి కనబడకూడదు.........నువ్వు...ఎక్కడకూ...వెళ్ళకూడదు...నీ...ముఖంలో...ఎప్పుడూ...విచారం... తొంగిచూడకూడదు...నీ...మనశ్శాంతికోసం...యిప్పుడే...వెళ్తా. రా..ధా..అమ్మని...జాగ్రత్తగా...చూడు...నువ్వు...చాలా.. మంచి దానివి...నీకు...మంచి...భర్త...వస్తాడు...నీ జీవితం...బాగా గడవాలి...అంతే...నా చివరికోరిక రాధా...' అని నాగమ్మవైపు తిరిగి...'నేనువస్తా...నమ్మా... రాధ...జా...గ్రత్త...పూల....మొ...క్కలు......నాకు....ఎంతో...,.సంతోషంగా...వుం...నమ్మా...వస్తా...నమ్మా...వస్తా, రా..ధా., అమ్మా...నన్ను....కలలో....అనుకో....అమ్మా...వస్తా' ఇల్లు అంతా ఒక్కసారి కలయజూచి బయట ప్రకృతిని సానునయంగా చూసి కన్నీళ్ళు తుడుచుకొన్నాడు. వెనకకు తిరిగిచూడకుండా బయలుదేరాడు.

నాగమ్మ గుండెల్లో తడిలేదు. కళ్ళల్లో నీరు యింకిపోయింది. నోరు పడిపోయింది.

రాధ శిలాప్రతిమలాగా, అచేతంగా, స్తబ్దంగా, మూగగా, పిచ్చిగా నిలబడిపోయింది. కపోలాలమీద కన్నీరు ప్రవహిస్తున్నది. నిరంతరం ప్రవహించేటట్లు ఉందా తీరు.

ఆకాశం నిండుపొట్టుగా పెట్టుకొన్న చందమామను పశ్చిమదిక్కున నల్లని మేఘాలు క్రమ్ముకొన్నాయి. రాత్రి కొంత నిశ్వాసం ఉద్ధృతంగా వీచింది.

వెన్నెల మబ్బుల మాటున దాగింది. చీకటి స్వైరవిహారం చేసింది.

మెరుపుతీగ ఆకాశహృదయాన్ని పగులగొట్టింది. ఆకాశం చిన్నాభిన్నమైంది.

పిడుగుపాటుకు దూవికొమ్మ పెళుక్కుమంది. పొగడకొమ్మలు రాలాయి.,

మల్లెపాదులు వణికాయి. గులాబిమొక్కలు తల వంచుకొన్నాయి.

రాధ కన్నుల్లో పిడుగు మిరుమిట్లు ప్రతిబింబించాయి.

కన్నుల్లో వెలుతురు హృదయంలో వెలిగింది.

'భగవాన్! నాకు కళ్ళెందుకిచ్చావ్...నాకు... కళ్ళెందుకిచ్చావ్' అని రాధ కుప్పగా కూలిపోయింది.

మెరుపుతీగ వెలుతురు యిచ్చింది.

దూరంగా వణుకుతున్న చుక్కలు మబ్బుదుప్పటి కప్పుకొన్నాయి.

# వీరబ్రహ్మముగారి కాలము

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు 1959 సెప్టెంబరు నెల భారతిలో "గోవింద వాక్యాలలోని చరిత్రాంశాలు" అని ఒక వ్యాసమును వ్రాసియున్నారు. చారిత్రకులదృష్టి బ్రహ్మముగారి కాలజ్ఞానము మీదికి, గోవింద వాక్యాలమీదికి ప్రసరించుట ఎంతగానో సంతసింపదగిన విషయము. బ్రహ్మముగారు ఒక అసాధారణాంధ్ర మహాపురుషుడు. ఆంధ్రదేశమునకే గాక యావద్భారతదేశమునకును - ఇంకను విశాలముగా విచారించిన ప్రపంచమునకు-గూడ కలియుగ సంస్కారములను, సందేశములను సూచించి ఒసంగిన మహాజ్ఞాని. అనేకులు మహాపురుషులు సామాన్యులుగా పుట్టి తమజీవితమందే యోగమునో అనుష్ఠించి, తాము తరించి లోకమునకు తరణోపాయమును బోధించి పోవుచుందురు. ఈ మహాపురుషుడట్లుకాక సిద్ధుడుగానే అవతరించి ఆయా సాధనములను ఆత్మముక్తికిగాక లోకసంగ్రహార్థమై తానాచరించి లోకోద్ధరణము చేసినట్లు గ్రహింపగలుగుచున్నాము. హిందూ మహమ్మదీయైకమత్యమునకై తా నొనర్చిన కృషి యేమి, అగ్రాహ్యులైనవారు శూద్రులైనను చండాలురైనను హైందవేతరులైనను వారికి ఉపనిషద్రహస్యము నందించి తరింపజేయుటలో నేమి, రజస్వలానంతర వివాహాది సంస్కారములు, చేతిపనులు, శిల్పము, యోగాభ్యాసము మొదలగువానిని ప్రోత్సహించుటలో నేమి, కులభేద ప్రాధాన్య నిరాసములో నేమి ఈతడు చూపిన బాటలు జగదారాధ్యములు. వీరబ్రహ్మస్వామి జీవితములో వైగుణము లన్నియు నొక యెత్తు; కాలజ్ఞానరూపమున భవిష్యద్విషయములను వక్కాణించుట ఒకయెత్తు. బ్రహ్మముగారనగనే కాలజ్ఞాన ప్రవక్తగానే ఈతడు మనుష్యుల మనస్సులలో ప్రవేశించును. కనుక బ్రహ్మముగారి కాలజ్ఞానమును మనము చిన్నచూపుచూడక అంతటి ప్రత్యేకముగా జాగరూకతతో పరిశీలింపవలసి యున్నది. అనేకవాక్యములు గూఢార్థ బంధురములు. బ్రహ్మముగారి తత్త్వములలోను, కీర్తనలలోను "రూపకాతిశయోక్తియు, వ్యతిరేకలక్షణము అన్యదుర్లభములై యున్నవ"ని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారొకచో వ్రాసియున్నారు. ఇట్టి మహనీయుని రచనలను చారిత్రకులుగాని, తార్కికులుగాని, రాగద్వేషములకు వశులుగాక సముదారమగు దృష్టితో పరిశీలించి యుపయోగించుకొనుట సమంజసము. ఈ ప్రయత్నమును ఆంధ్రదేశములో తొలిసారిగా చేసిన శ్రీ భావయ్య చౌదరిగారు ఆంధ్రులకు మార్గదర్శకు లయినారనుట సత్యము.

భారతి వ్యాసములో శ్రీ భావయ్య చౌదరిగారు గోవిందవాక్యములలోని అనేక చరిత్రాంశములను ప్రస్తావనచేసి సమన్వయము చేసినారు. వారు చూపిన చరిత్రాంశములు పెక్కులు క్రీ. శ. 18వ శతాబ్దికి సంబంధించినవిగా నున్నవి. ఉదాహరణమునకు. ఒకవాక్యములో వారు "జరిగిన సంగతులనే భావి విషయములుగా వ్రాసి ఈతడు జనులలో సద్భుత కాలజ్ఞానిగా పేరొందెను." అని వ్రాసినారు. ఈ వాక్యమును బట్టి చూడ వ్యాసకర్త బ్రహ్మముగారి కాలమును పాటించినట్లు లేదు. బ్రహ్మముగారి జీవితకాలమును దృష్టిలో నుంచుకొన్నయెడల వారంత సాహసముగా వ్రాయరు. త్రికాలవేదియగు బ్రహ్మముగారి మహిమను చౌదరిగారి వాక్య మపకర్షను గూర్చుచున్నదని తద్‌జ్ఞులు బాధపడవలసివచ్చినది. కావున ఈ వ్యాసమున బ్రహ్మముగారి జీవితకాలమును గూర్చి నా పరిశీలించినంతవరకు పాఠకులకు నివేదించుట నా కర్తవ్యము.

నేను 1949 ప్రాంతమున వీరబ్రహ్మముగారి చరిత్రాంశములను పరిశోధన చేయుటకు పూనుకొని కొంతవరకు కృషిచేసియుంటిని. తత్ఫలితముగా వీరబ్రహ్మస్వామి క్రీ. శ. 1604 మొదలుకొని 1690 ప్రాంతమువరకు నుండి తన లీలలను మహిమలను ప్రదర్శించినట్లు కొన్ని ఆధారములను సంపాదింపజాలినవాడను. కాగా 17వ శతాబ్ది పూర్తిగా ఈ మహనీయుని చరిత్రోదంతములతో నిండియున్నట్లు తోచుచున్నది.

బ్రహ్మముగారు నేటికి సుమారు మూడువందల యేండ్లకు పూర్వమున్నారని ఆయన శిష్యులును భక్త

లను చెప్పుచుందురు. కందిమల్లయపల్లెలోని బ్రహ్మముగారిమఠము పరిపాలకులను ఇట్లే చెప్పుచుందురు. మఠములో బ్రహ్మము సమాధితోపాటు తద్వంశీయుల సమాధులును పెక్కులున్నవి. ఒక్క సమాధిమీదకూడ సమాధిచెందినవారి సమాధికాలము శాసనరూపముగా చెక్కబడిలేదు. అట్టి శాసనములే ఆ సమాధులయందున్నచో కాలనిర్ణయమునకు మనము పరిశోధన చేయవలసినయక్కర యేర్పడెడిది కాదు. భక్తాగులు చెప్పు పుక్కిటిపురాణములను బట్టియే మనము కాలనిర్ణయము చేయరాదుగదా! కావున బాహిరమును, అంతరములను కొన్ని దృష్టాంతములు దొరికిన గాని సరియగు కాలమును నిర్ణయించుట సంజసము కాదు. ఇందుకు నాకు దొరికిన యాధారభూత గ్రంథము లివి:

1. 1937 లో కందిమల్లయపల్లె నివాసియగు శ్రీ వాటుకొండ సుబ్బయ్యగారు రచించి ప్రకటించిన "శ్రీ వీరబ్రహ్మముగారి జీవితచరిత్రము".

2. 1920 ప్రాంతమున శిల్పసాగరబిరుదాంకితులు శ్రీ తటకొండ వెంకటరాఘవాచార్యులుగారు వ్రాసి ప్రకటించిన "వీరాచార్య చరిత్రము".

3. "కాలజ్ఞాన తత్త్వములు" అను పుస్తకము.

4. కాగితములమీద వ్రాయబడిన 'కాలజ్ఞానము' అను గ్రంథము,

5. కవిశేఖర వడ్డెపాటి నిరంజనశాస్త్రి గారు రచించిన "కల్యాణకాముది" అను పద్యకావ్యము.

మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో మెకంజీదొరగారు సంపాదించిపెట్టిన గ్రామచరిత్రలు (కైఫీయతులు) కొన్ని చూచితిని గాని వానియందు వలసిన యంశములు దొరకలేదు. ఇంకను గాఢముగా పరిశీలించినచో ఏమేని యాధారములు దొరకు నేమో!

## కాలనిర్ణయము

మఠములోనున్న ఒక కాలజ్ఞానగ్రంథములో బ్రహ్మముగారి పౌత్రియగు ఈశ్వరమ్మగారు సమాధియైన కాలము కలియుగాబ్దములు 4871కి సరియైన వికృతి సంవత్సర చైత్రశుక్ల విదియ సోమవారమని వ్రాయబడియున్నది. నేటికి కలిగతాబ్దములు 5060. కాగా ఈశ్వరమ్మగారు సమాధిపొంది నేటికి 189 సంవత్సరములు. ఈశ్వరమ్మగారు 95 సంవత్సరముల పూర్ణజీవితమును గడిపి తత్త్వవిద్యాప్రచారము చేసినదని ప్రసిద్ధియున్నది. ఆమె మహాయోగినియు, బ్రహ్మచారిణియు గావున 95 సంవత్సరముల పూర్ణజీవితమును గడిపినదను ప్రసిద్ధి అయథార్థము గాదు. అప్పుడామె జననకాలము కలియుగ సం|| 4776 అగుచున్నది. బ్రహ్మము జీవసమాధిని ప్రవేశించునప్పటికి ఈశ్వరమ్మగారు 10, 12 సంవత్సరముల వయస్సుగలవారట. ఆ పదిరెండు సంవత్సరములు కలుపుకొన్నచో 4788 ప్రాంతము బ్రహ్మముగారి సమాధికాల మగుచున్నది. కాగా నేటికి 272 సంవత్సరములనాడు బ్రహ్మము సమాధియైనారని తేలుచున్నది. తరమునకు ముప్పది సంవత్సరములని లెక్కచూచిన నేటికి తొమ్మిదితరముల నాడు బ్రహ్మముగా రున్నారని చెప్పుటకు వీలగుచున్నది. దీనికి తగినట్లు బ్రహ్మముగారినుండి నేటివఱకు వారి వంశపరంపరలోనివారి సమాధులు తొమ్మిది బ్రహ్మముగారి మఠములో నేటికి కగపడుచున్నవి. కనుక క్రీ. శ. 1687 ప్రాంతము సమాధికాలము. కాగా అంతకు పూర్వకాలమున బ్రహ్మముగారు జీవించియున్నారన్నమాట. ఆయనకు ఎనుబదియేండ్లకు మించిన జీవితకాలము సూచింపబడుచో పదాఱవశతాబ్ది ప్రారంభమాయన జననకాలమగును. బ్రహ్మముగారు రెనుబది వత్సరముల కెక్కువయే జీవించినారనుట కనేక సాక్ష్యము లున్నవి.

ఇంకొక ప్రమాణమును బట్టి చూతము. అముద్రితములగు కాలజ్ఞానతత్త్వములలోని ఒక మంజరీ ద్విపదలో నిట్లున్నది.

"ఆనంద గురువుల అనుమతిచేత
భావసంధికివచ్చి భక్తవత్సలుడు
ఆదిశేషువులకు అభయంబు నిచ్చి
ఆదిలక్ష్మినికూడి ఆనందమొంది
సిద్ధార్థినామ సంవత్సరమందు
బనగానపల్లెలో పరగంగ నిలిచి
రత్నసింహాసనారూఢుడై తాను
కృతయుగ ధర్మంబు నడిపింపుకొఱకు
విరవసంతుడై వచ్చియున్నాడు
కానకయున్నాము బ్రహ్మంబు మాయ
కారణంబుల ముందు కానవచ్చెదును."

దీనిని బట్టి సిద్ధార్థినామసంవత్సరములో బ్రహ్మము బనగానపల్లెలో విహరించినట్లు తెలియుచున్నది. బనగానపల్లెలో వీరప్పయ్య యనుపేర బ్రహ్మముగారు గరిమిరెడ్డి అచ్చమ్మగారి యింట

ఆవులు గాయుట, అన్నాజయ్య మొదలగు శిష్యులకు కాలజ్ఞానాదు లుపదేశించుట చరిత్రప్రసిద్ధము. నేటికిని బనగానపల్లెలో బ్రహ్మము విహరించిన ఆయా చిహ్నము లగపడుచుండుట, భక్తులు వెళ్లి చూచుచుండుట ప్రత్యక్షము. పై ద్విపదగేయమును బ్రహ్మముగారి ప్రియశిష్యులగు అన్నాజయ్యయో మఱెవరో వ్రాసియుందురని నా అభిప్రాయము.

ఇప్పటి వికారి వత్సరముతో నా ఉనికొరకును దీనికి వెనుకగా అయిదులువదులు మూడు వందలగుచున్నది. తుది వికారినుండి విలోమముగా (వెనుకకు) లెక్కించినచో సిద్ధార్థివాటికి నలుబది సంవత్సరములగును. కాగా ఇప్పటికి 340 సంవత్సరములనాడు వీరబ్రహ్మముగారు బనగానపల్లెలో నున్నారని చెప్పవీలగుచున్నది. పై ద్విపదలోని "భావసంధి", "శిరవసంతాద్రి" పదములు గూఢార్థయుక్తములు. వసంతము లోకమునకు వికాసకారి గావున మానవ వికాసమును గూర్చి తనను వీరవసంతుడని ఆయన చెప్పుకొనుట గాని, శిష్యులన్నటగాని జరిగియుండవచ్చును. బ్రహ్మము విష్ణువు నవతారమనియు, ఆయన భార్య గోవిందమ్మ ఆదిలక్ష్మి అనియు కాలజ్ఞానాది గ్రంథములలో నుపవర్ణితము. ఆ యంశములు పై ద్విపదలోను సూచితములైనవి.

గరిమిరెడ్డి అచ్చమ్మగారి యావుల గాచునప్పటి కాయనకు 12 లేక 15 వత్సరముల కెక్కువయుండవు. దీనింబట్టి చూచినచో నేటికి 355 ఏండ్ల నాడు-క్రీ. శ. 1604 ప్రాంతమున బ్రహ్మముగారు జన్మించియుండవచ్చునని తెలియుచున్నది. 1687 ప్రాంతమున జీవసమాధియందు ప్రవేశించినారని పూర్వము చెప్పికొంటిమి గాన 17 వ శతాబ్దియంతయు ఆ మహనీయుని జీవితకాలతో గడచినట్లు భావింపవచ్చును.

ఇప్పటి కలియుగాది గతాబ్దసంఖ్య 5060 లో 355 తీసివేయగా కల్యాది 4705 బ్రహ్మముగారి జనన కాలమగుచున్నది. కాలజ్ఞానములోని వర్ణనమును బట్టి చూచినను పై లెక్క సరిపడుచున్నది. కాలజ్ఞానములోని వర్ణనలు — వాక్యములు పెక్కులు శ్రీకృష్ణదేవరాయల యనంతరము జరిగిన వృత్తాంతములను సూచించుచున్నవి. కృష్ణరాయల పిమ్మటనే-అందును తల్లికోట యుద్ధమునకు పిమ్మటనే — విజయనగర ప్రాంతము మహమ్మదీయాక్రాంత మగుటయు, భారతధర్మము దెబ్బదినుటయు సంభవించినది గావునను, హిందూ మహమ్మదీయ విభేద విద్వేషములు పొడచూపినవి గావునను తత్సంస్కరణమునకే తానవతరించి కృషి చేయుచున్నట్లు కాలజ్ఞానములో బ్రహ్మము విస్పష్టముగా చెప్పికొనినాడు.

"కలియుగము సుమారు 3180 సం|| (సరిగా 3172 సం||) జరుగగా శకపురుషుడగు శాలివాహనుడవతరించి ధర్మపరిపాలనము చేసెను. శాలివాహన శక సం|| 1258 గడవగా ఆనెగొందియందు రాయసింహాసనమునకు హరిహర రాయలు రాజై ధర్మపరిపాలన మొనర్చుచు విజయనగరమను నొకపట్టణమును నిర్మించుకొని యదియే రాజస్థానముగా ప్రజాపరిపాలనము చేసెను. వారి తరువాత వారి సంతతి వారు మూడుతరములవారు పాలించిరి. (?) అటు పిదప సాళువ నరసింహరాయలు 13 ఏండ్లేలెను. అతని కుమారుడు వీరనరసింహరాయలు తిమ్మరాయలను జంపించి ఆరువత్సరము లేలెను. నరసరాయని రెండవకుమారుడు కృష్ణదేవరాయలు 21 వత్సరములు పాలించెను. అచ్యుతరాయలు ఎనిమిది నెలలు రాజ్యమేలెను సదాశివరాయలను ముందుంచుకొని రామరాజు 22 సం|| విజయనగరపాలనము చేసెను. అతనితో విజయనగర హిందూసామ్రాజ్య మంతరించెను. (తరువాత తురకల పరిపాలనలోని దుర్భాగ్యాల వర్ణనమున్నది. అది యిట ప్రస్తావింపనైతిని.) అప్పటికి కలియుగము 4700 సంవత్సరములు గడచెను."

ఇది కాలజ్ఞానములోని భాగము. తరువాత భూదేవి పాప భారమును మోయలేక విష్ణుమూర్తితో మొఱపెట్టుకొన్నట్లును, ఆమె మొఱ నాలకించి యాతడు బ్రహ్మముగాను, శంకరుడానంద భైరవయోగిగాను, బ్రహ్మదేవుడు అన్నాజయ్యగాను భూలోకమున బుట్టినట్లును కాలజ్ఞానము చెప్పుచున్నది.

ఇంకను బ్రహ్మముగారు బనగానపల్లెలో అన్నాజయ్యకు కాలజ్ఞానము నుపదేశించుచు, విజయనగర రాజుల వృత్తాంతమును వివరించిన పిమ్మట ఇట్లనుడివిరి:

"రామరాజుతో విజయనగరసామ్రాజ్య మంతరించెను. తరువాత నారాష్ట్రమునకు మహమ్మదీయులు ప్రభువులై ధర్మముల తిరస్కరింపుచు న్యాయమెఱుగక రాజ్యపాలనము చేయుచుండిరి. ఇట్లధర్మములు దేశమున పెచ్చుపెరుగుటచేత వాని నణచుటకై నేనిట్టి యవతారమెత్తితిని. నాయనా! నాకీయవతారమందు వీరబ్రహ్మము సాధారణ నామధేయము. బాల్యమున వీరం

భట్లయ్య యనియు, నిపుడు వీరప్పయ్య యనియు, నిక ముందు వీరబ్రహ్మమనియు నామాంతరములు గలవు. ఈ నామధేయముతో కొందఱికి విజ్ఞానము గఱపి సమాధి నిష్ఠవహింతును" అనియు, మఱియొకచో "...పిమ్మట అనంతావతార మహిమలకుగాను పదునొకండవ యవతారమెత్తి బనగానపల్లెలో పంచవింశద్వర్షములు తపము జేసి పిమ్మట కొంతకాలము గృహస్థాశ్రమమునను౦డి యనేక శిష్యకోటికి జ్ఞానోపదేశము చేసి యటు పిమ్మట సమాధినిష్ఠ వహింతును" అని యున్నది.

దీనింబట్టి బ్రహ్మము మహాత్ముడయి దుశ్చేష్టల నరికట్టి వారికి మతసామరస్యమును బోధించుటకును, హిందూజాతిని సంస్కరించుటకును బూనినట్లు తెలియుచున్నది. ఇంకను ఇది పదునొకండవ యవతారమనియును దెలియుచున్నది. ఇందలి అతిలోకములు—దైవతాత్త్వికములు నగు వర్ణనలను ఎల్లరు విశ్వసింపజాలకపోయినప్పటికిని, చారిత్రకాంశములను గ్రహించి వానికి ప్రాధాన్యమిచ్చి, తత్త్వమును విచారించుటకు వెనుకంజవేయరాదని తలంచెదను.

పైనుదాహరించిన కాలజ్ఞానవాక్యములనుబట్టి మా. బ్రహ్మముగారు బనగానపల్లెలోనుండి తపస్సు చేసినది ఇరువదియైదేండ్లని తెలియుచున్నది. అతడు సంగ్రహించినయేటగాని, తపస్సు చేసినయేటగాని బనగాని పల్లెకు వచ్చినాడనుకొన్న దాదాపు నలుబదివత్సరముల ప్రాయమున ఆయనకు వివాహము జరిగినట్లు నిశ్చయింపవచ్చును. బనగానిపల్లెనుండి కందిమల్లయపల్లెకు వచ్చిన పిమ్మటనే ఆయన వివాహము జరిగెను. వెంటనే ప్రథమసంతానముగా గోవిందయ్య జన్మించినాడు. ఆయన కుమారికయే ఈశ్వరమ్మ. బ్రహ్మముగారి జననము క్రీ. శ. 1604. ఆయనకు నలుబదవయేట వివాహము జరిగినదనుకొన్న 1644 పెండ్లికాల మగును. వివాహానంతర మొకటి రెండు సంవత్సరములలోనే గోవిందయ్యగారు జన్మించినారన్న 1645, 46 గోవిందయ్య జన్మకాలము కాగలదు. ఆయనకు 30 యేండ్ల ప్రాయమున ఈశ్వరి జనించియుండును. ఆమె పుట్టిన 12 వత్సరములకు బ్రహ్మము సమాధియైనారు కావున 1687, 88 ప్రాంతము బ్రహ్మముగారి సమాధికాలమగుచున్నది. ఇదియును మనము మొదట వేసికొన్న లెక్కకు సరిపోవుచున్నది. కనుక ఇప్పటికి నాకు దొరికిన ఆధారములనుబట్టి బ్రహ్మముగారు పదునేడవ శతాబ్దమున నున్నారనియు, దాదాపు 1690 తో ఆయన జీవితము ముగియుచున్నదనియు నిర్ణయింపజాలినాను. బ్రహ్మముగారి మఠములో బ్రహ్మము స్వయముగా వ్రాసిన కాలజ్ఞానము (మూలము) గూడ నేనై చూచుటకు ప్రయత్నించుచున్నాను. ఆ పరిశీలనమైన పిమ్మట ఇంతకంటెను సునిశితముగా కాలనిర్ణయమును జేయుటకు అవకాశములు చిక్కిన లోకమునకు నివేదించు కొందును.

మొత్తముమీద బ్రహ్మముగారి యుగము మాత్రము ఆంధ్రదేశచరిత్రలోనే గాక భారతదేశచరిత్రలోగూడ ఒక ప్రత్యేకతగలదని నాయభిప్రాయము. కారణమేమన, భారతదేశములోని వివిధప్రాంతములలో పలువురు మహాపురుషులుదయించి భారతీయసంస్కృతి నుద్ధరించుటకు కృషిచేసిన కాలమది. ఈ 17 వ, శతాబ్ది మధ్యభాగముననే, మహారాష్ట్రములో శివాజీ చక్రవర్తి మహమ్మదీయుల దాడుల నరికట్టబూనినాడు. ఆయనకు గురువుగారైన సమర్థరామదాసస్వామి—తుకారాం బ్రహ్మసంపన్నులు ఆధ్యాత్మికవిద్యాప్రచారము చేసినారు. ఆ శతాబ్దపు టుత్తరభాగముననే కంచర్ల గోపన్న రామదాసుడై భక్తితత్త్వమును విస్తరింపజేసినాడు. అటు కన్నడదేశములోను పెక్కురు శైవసిద్ధు లుదయించి తత్త్వప్రచారము నొనర్చియున్నారు. ఈవిధముగా యావద్భారతదేశము ఆనాడు ఆధ్యాత్మికతత్త్వపరిమళముతో గుబాళించిపోయినట్లు చరిత్రచక్షువులకు గోచరించెడిని.

ఇట్లు 17 వ శతాబ్దినున్న బ్రహ్మముగారు 18 వ శతాబ్దిలో జరుగనున్న చారిత్రకవిశేషమును చెప్పగా, అవి యాయనకు సమకాలమున జరిగిన వెట్లగును? ఆయన జరిగిన సంగతులనే భావివిషయములుగా వ్రాసి జనులలో అద్భుతకాలజ్ఞానిగా పేరొందిన వాడెట్లగును? కావున బ్రహ్మముగారి కాలజ్ఞానాంశములకుగాని, గోవిందవాక్యములకుగాని లీలలు, తత్త్వములు, గీతములు మున్నగువానికి గాని, చరిత్రాంశ సంయోజన—సమాలోచనలు చేయువారు వారికాలమును దృష్టిలో నిడుకొని మఱి చేయవలయునని ప్రార్థించుచున్నాను.

# క్రీస్తు జననము

శ్రీ బి. పురుషోత్తం

"కన్య గర్భము దాల్చి కనును పుత్త్రు
వాని నామధేయమ్ము ఇమ్మానుయేలు"
అంచుఁ బ్రవచించె నెన్నొ శతాబ్దములకు
మునుపె 'యెషయా' ప్రవక్త యేసును గుఱించి.

"బెత్లెహేమ! యూదయ [1] పుట భేదనముల నల్పవేమియుఁ గావు నిన్నరసిచూడ;
ఇశ్రయేలను నా ప్రజ నేలువాఁడు కలుగు నీలోన" ననియె 'మీకా' ప్రవక్త.

దండిగలిగిన యాసియాఖండమందుఁ బశ్చిమోత్తర భాగాన వాసిగన్న
దేశములలోన 'యూదైయ' దేశ మొకటి ఇందు గాన వచ్చును బెత్లెహేమ పురము.

కైసరాగస్తు [2] సమ్రాట్టు కాలమందు యూదయాదేశమునకు హేరోదు[3], రాజు;
సింహస్వప్నము ప్రజలకు సీజ[4]రనిన నింక హేరోదుపాలన హేయమాయె.

అఖిలలోకాల జనసంఖ్య లిఖితమౌట కాన తిచ్చెను గైన రా యవసరమున
'గాలిలయ'[5]లోని నజరేతు గ్రామ మెడలి వచ్చె యోసేపు దావీదుపట్టణంబు.

తనకు నిర్ణయమైన కన్నను మరియను వెంటఁ దోడ్కొనిపోయెను బెత్లెహేము;
స్థలము లేదాయె వారికి సత్రమందు అయ్యెఁ బసువులపాక గత్యంతరంబు.

ప్రవచింపఁబడిన తీఱున నవతారము నొందెను బరమాత్మ నరుండై
లవమున బెత్లేహేమునఁ బవిత్ర కన్యక కడుపునఁ బశువుల పాకన్.

అది బీ, సీ, నాలుగు; పుష్యదినమ్ములు; చలియు మంచుఁ జాలగ నుండెన్
కదిసి పసుండెను గొఱ్ఱెల కదుపులు; కునుకుచు వణకుచుఁ గాచిరి గొల్లల్.

దగ్గున మెరిసి నసంతము దిగ్గున మేల్కాంచి యధిక దీధితి వలనన్
అగ్గలముగ గొల్లలకర బిగ్గఱగా దూత క్రింది విధమునఁ బలికెన్.

"భయమందఁ బనిలేదు ప్రజలకందఱకొక్క సంతోషకరమైన శాంతివార్త;
ఉన్నాఁడు పుట్టి మీ కొఱకు రక్షకుఁడు నేఁడు దావీదుపుర[6]మం దతండె క్రీస్తు;
దాని కియ్యదె మీకు నానవాలు లోక బిడ్డఁ దొట్టిలోఁ బొత్తులఁ జుట్టియుంట
మీరు కాంచెద"రని వారితోఁ బలికిన తత్క్షణ మాకాశ దళము గూడి

# క్రీస్తు జననము

దేవ సంస్తుతుల్ చేసినా రీ విధాన :
"కలుగు సర్వోన్నతములైన స్థలములందు
భూరి మహిమ దైవమునకు; భూమి మీఁద
నతని కిష్టులౌ నరులకు సమరు శాంతి."

తదుపరి గొల్లలు రయమున "నిదియేమో చూచి వత్త మిప్పుడ" యనుచున్
గదలిరి నడిరాతిరిలో చదలున దారాగణంబె సాయము కాఁగన్.

పోయి బెత్లెహేము పురమున నొక చోటఁ దొడ్డిపట్టులోని తొట్టిలోన
రాజు మెచ్చువాని రతనాల బాలుని 'యేసు'ఁ జూచి మోకరించినరు.

మరియాంబవదన బింబము అరలునఁ గెంపిక్క చివురుటాకులఁ దొడిగెన్
మరియాంబ పుత్త్రు వదనము కరుణాన్విత దైవ ప్రేమకాంతులఁ జిమ్మెన్.

వసుధపై శర్వరి వాలియున్నప్పుడు ఆత్మలోపల రాత్రి యైన యప్పుడు,
వ్యసనకర్తరి నుండి బైటరాఁగఁ గమను నాస పూర్తిగ నాశమైన యపుడు,
కృప యెటగల దీ నికృష్టజీవికి నింక ననెడు నిరాశలో మునుఁగునపుడు,
నీలాపనిందలు నెత్తిపై బడునప్డు మిత్త్రులే వృకములై మ్రింగునపుడు,

పడక కన్నీటి ధారలతోఁ దడియునపుడు,
బ్రతుకు భారమై గుండెలు పగులునపుడు,
మృత్యువే చాలమే లనిపించునపుడు,
పిలుచుచున్నాడు ప్రభువు నిన్ బెత్లెహేము.

మున్ను పుట్టక మున్న మిన్ను పుట్టకమున్న ఒక్కడై ముగ్గురై యున్నవాఁడ,
బలులు బంగారముల్ పాటింపకయ భగ్నహృదయార్పణమె స్వీకరించువాఁడ,
కాఱు మబ్బులవేళఁ గటికిచీఁకటి వేళ నిన్ను నమ్మినవారి కున్నవాఁడ,
పశువుల తొట్టిలోఁ బవ్వళించినవాఁడ, కన్యక మరియాంబ కన్నవాఁడ,

ఇల్లు కైసేసి పన్నీరు చల్లినాను,
క్రొత్త సంపెంగ దండలు గ్రుచ్చినాను,
వెచ్చవెచ్చని క్షీరముల్ పిండినాను,
ఇట్టు దయచేయుమయ్య ఓ యేసురాజ!

---

1 యూదయు, యూదియ = Jndaea. 2. కైసర్ + ఔగుస్తు = కైసరౌగస్తు : Caesar Augustus. 3. హేరోదు = Herod 4. సీజరు-కైసరును సీజరనియు నందురు. 5. గాలిలయ, గలిలయ=Galilee. 6. దావీదు పురము : బెత్లెహేమున కింకొక పేరు. గోత్రకర్తయైన దావీదు వంశమువారు నివసించునది కాఁబట్టి దానికా పేరు వచ్చినది. యోసేపు దావీదు గోత్రములోనివాఁడు కావున తన పితరుని పట్టణమునకుఁబోయి జనాభా లెక్క యియ్యవలసి వచ్చినది.

# కాకతిశక్తి ఎవరు?

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

క్రీస్తు శకము 1050 సంవత్సర ప్రాంతంనుంచి 1325 వరకూ హనుమకొండా, ఓరుగల్లూ రాజధానులుగా పరిపాలించిన రాజవంశమువారిని కాకతీయు లంటున్నారు. వారు "కాకతి" అనే దేవతను వంశ పారంపర్యముగా అర్చించినవారు కనుక కాకతీయు లైనారు. ఈ 'కాకతిశక్తి' ఎవరు అన్న జిజ్ఞాస కొంత వరకూ సాగినదికాని నిశ్చయము తేలలేదు. శాసనములూ సారస్వతమూ, శిల్పమూ ఎంతో కొంత సాక్ష్యాన్ని సమకూర్చినా ఈ సాక్ష్యాలను సమన్వయ పరిచే యత్నము సాగలేదు. "అసలు 'కాకతిదేవి' అంటూ ఒకదేవి ఉండేదా?" అన్నారు నామిత్రులు పండితులొకరు. ఈ సమస్యపట్ల విద్యార్థుల విసుగును తెల్పడానికి చాలు ఈ ప్రశ్న. అయితే. కాకతీయులు అన్న పేరు స్థిరమై నిలిచింది. దానిని త్రోసివేయలేము. మరి కాకతి ఎవరు? ముందు ముందు ఇంకా సాక్ష్యము లభించవచ్చును. ఇప్పటికి లభించిన సాక్ష్యము చేసే సూచన ఏమిటి? అని తేల్చుకోవడము అవసరమనిపించింది. ఆ యత్నఫలమే ఈ వ్యాసము.

కాకతీయులకు పూర్వులు అని భావింపబడు తున్న 'కాకర్త్యగుండ్యన' పేరులోని 'కాకర్త్య'ము ఎట్టి వచ్చినదో దేనినుంచి వచ్చినదో తెలియ లేదు. ఖాజీపేటశాసనము ఒకటి బేతరాజును 'శ్రీమాన్ కాకతిపురాధినాథో బేతః' అని పేర్కొన్నది. ఈ కాకతిపుర మన్న దేది? అని ప్రశ్న. తెలుగు చోళరాజులు రాజ్యము చేసిన కొణిదెనలో నైనప్పటికీ "ఒరగు నొరయూరి కధిపతు"ల మని చాలాగొప్పలు చెప్పుకొన్నారు. వారివలెనే కాకతీయులు కూడా 'కాకతి'పురాన్ని పాలించిన రాజవంశమువారమని వ్రాయించుకొన్నారేమో అనవచ్చును గదా? ఈ అభిప్రాయముతో చిలుకూరి వీరభద్రరావుగారూ, మారేమండ రామారావుగారూ చాలాజిజ్ఞాస చేశారుకాని ఫలితము ఇదమిత్థమని తేలలేదు. 'కాకతీయవంశపు మూలపురుషులు పాలించిన ఊరిదీ' అని నిశ్చయించ డానికి అవకాశము చిక్కలేదు. కాపూరూ, కాకాని వంటిపూర్లు చాలావున్నాయి కాని యీ ప్రసిద్ధి మాత్రము దేనికీ లేదు.

కాకతిశక్తి వెంచేసివున్న పురము కాకతిపురమని చెప్పవచ్చును. అయితే, అట్లాంటిపురముకూడా ఎక్కడ తెలియరావడము లేదు. కాకతి అన్న దేవతయొకతె ఎక్కడా వున్నట్లు తెలియదు. అటు కాకతి ఎవరు? అన్నప్రశ్నకే నిశ్చయముగ చెప్పగల జవాబు లేదు. మరి కాకతి వెంచేసివున్న పురమేదీ అని ఎట్లా తేల్చడమూ? శాసనాలుమాత్రము కాకతిపురాన్ని దృఢముగా పేర్కొంటున్నాయి ఖాజీపేటశాసనం సంగతి చెప్పినాను. బెక్కల్లు శాసనము "మహామండలేశ్వర కాకతిపురవరేశ్వర మహారాజాధిరాజ రుద్రదేవరాజులు ఓరుగంటిని ఏలగా" అని చెప్తూ ఓరుగల్లు వేరూ, కాకతిపురము వేరూ అని సూచిస్తున్నది. పానుగంటి శాసనము "శ్రీమతు కాకతిపురవరాధీశ్వర రుద్రదేవ మహారాజులకు" అంటూ ఓరుగంటికే కాక రుద్రదేవుడు కూడా కాకతిపురవరాధీశ్వరుడే అంటున్నది. కాకతిపురము అనుమకొండయే కాగలదా? రుద్రదేవుని రాజధాని అనుమకొండయే. అనుమకొండలో కాకతమ్మగుడి ఉన్నాను లేదు. కాని అనుమకొండ కోటలో ఒక చెట్టుక్రింద అష్టభుజములతో ప్రేతాసనాధిష్ఠితయైన శక్తి విగ్రహమూ ఉన్నది, పద్మాక్షమ్మగుడీ ఉన్నది.

క్రీడాభిరామములోని "కాకతమ్మకు సైదోడు ఏకవీర" అన్న పద్యపాదమే సారస్వతంలో కాకతమ్మ మొదటి ప్రశంస. ఏకవీర అనగా రేణుక. ఈమె తలను నరకమన్న జమదగ్ని ఆజ్ఞ మేరకు పరశురాముడు నరుకగా ఆమెతల యెగిరి మాలవాడలో పడెనట. మాలవారూ, ఇతరులూ ఆ తలకు యెల్లమ్మ అని పేరుపెట్టి ఒక దేవతగా పూజిస్తున్నారు నేటికీ. ఈమె నగ్నవిగ్రహము కూడ ఏకవీర పేరిట పూజలందు చుండినట్లు క్రీడాభిరామము లోని "వ్రీడాశూన్యకటీర మండలము" అన్న పదావళి తెలుపుతుంది. అలంపురంలో ఈమెయొక్క నగ్నకబంధాలున్నవి గాని క్రీడాభిరామవర్ణనము 'హోమయూర్యావల క్షేత్రము'లోను

# కాకతిశక్తి ఎవరు?

'అలికుల నీలవేణినీ' స్తుతించటమువల్ల నగ్నకబంధములు కూడా ఈమె పేరనే పూజలందుకున్నట్లు చెప్పలేము. సంతానార్థులైన స్త్రీలు మాత్రము నగ్నకబంధాలను అర్చిస్తున్నారు. ఈమె బ్రహ్మవిష్ణు మహేశ్వరులను కన్న ఆదిశక్తి అని మాతపురాణమనే జానపద గేయకథ చెపుతున్నది. ఈమెకు హైహయరాజు దంతాస్థి పటలము గవాక్షపేరుగా సలుపు గలదట. ఈమె కాకతమ్మకు సైదోడట. ఈ పరాశక్తికి ఉపయిన దేవత అన్నమాట కాకతమ్మ. సృష్టికి తల్లియైన పరాశక్తికి సైదోడెవరు కాగలరు?

విద్యానాథకృత ప్రతాపరుద్రీయములో "కాకతీయకుల దుర్గాదేవి" అని కాకతీయులు కులదేవతగా కొలిచే దుర్గాదేవి ప్రశంస కలదు. కుమారసోమయాజి తన వ్యాఖ్యానములో "కాకతిర్నామ దుర్గాశక్తి రేకశిలానగరేశ్వరాణాం కులదేవతా, సా శక్తిర్భజనీయా అస్యేతి కాకతీయాః" అని వ్రాసి కాకతిని దుర్గాదేవిగానే వర్ణించినాడు. దుర్గాదేవికి కాకతి అన్న రూపమున్నట్లు కానరాదు. స్థానిక చరిత్రలు త్రిభువనమల్ల బేతరాజు "కాకతిదేవి వరప్రసాదమున ఒక్క సుతునిఁగని కాకతి ప్రోలరాజు అని నామకరణము చేసి"నాడని చెపుతూ కాకతిదేవి అంటే పద్మాక్షీదేవియే నేమో అన్న అనుమానము కలిగిస్తున్నాయి. జైనుల ఇరవైమూడవ తీర్థంకరుడు పార్శ్వనాథుడు. ఆయన యక్షిణి పద్మావతి. పార్శ్వనాథుడు సంతాన వరప్రసాదిగా ఈనాడు శ్రీకాకుళమండలము సర్వవరములో, కరీంనగరమండలము కనిగిరిలో, కడపమండలము దానవులపాడులో పూజలందుకుంటున్నాడు. తీర్థంకరులపక్షమున శాసనదేవియే వరములను దయసేయుననీ, తీర్థంకరులు కర్త చేయరనీ జైనుల నమ్మకము. కనుక పార్శ్వనాథుని వరదానముల కీర్తి పద్మావతిదే; భక్తులామెనే కొలిచేవారని అన్నా విప్రతిపత్తి లేదు. కనుక బేతరాజుకు సంతానవరప్రదానము చేసినదేవి పద్మాక్షియే కావచ్చును. ప్రోలరాజు మంత్రి భార్య మైలమకూడా పద్మాక్షీ కొండమీది జైనబసదిని సంతానవరముకొరకే నిర్మింపించి యుండవచ్చును. స్థానిక చరిత్రలు కాకతీయుల మూలపురుషుడైన మాధవవర్మ పద్మాక్షీదేవిని కొలిచినాడని చెపుతూ కాకతీయుల కులదైవము పద్మాక్షియేనా అన్న అనుమానము కలిగిస్తున్నాయి. సంతాన ప్రదాత్రి మాత్రము ఈమెయే, దుర్గశక్తి, చాముండీ కానేకాదు. గణపతిదేవుడు నిర్మింపించాడన్న ఓరుగల్లుద్వార తోరణాలలో దక్షిణద్వారతోరణము వెలివైపు పద్మాక్షీ శిల్పించబడింది. కాకతీయులు పూర్తిగా శివదీక్షాపరులు కానంతవరకూ వారి కులదైవము పద్మాక్షియే నేమో! పద్మాక్షియే కాకతి కులదైవమైతే, ఆమె వెంచేసివున్న అనుమకొండయే కాకతిపురము కావచ్చును.

స్వర్గీయ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దొంతపాముల గ్రామపు "కాకతమ్మబీడు" మీది 'కాకతమ్మ' విగ్రహము నొకదానిని ముక్త్యాల చేర్పించినారు. ఆ విగ్రహము ఫోటో వాణీమంజరి వారు ప్రచురించిన క్రీడాభిరామము తృతీయ ముద్రణములో మనము చూడవచ్చును. ఆ దేవి చతుర్బాహువులలోనూ త్రిశూలమూ, డమరుకమూ, కత్తీ, గిన్నె ధరించి పీఠము మీద కూర్చుని కుడికాలిని మాత్రము కొంత వ్రేలవైచినది. ఈమె పీఠము దిగువన నక్క బొమ్మ రేఖామాత్రముగా గీయబడినది. నక్క చాముండీదేవి చిహ్నము. ఆమె యమునిశక్తి, సప్తమాతృకలలో ఒకతె. త్రిశూల, డమరుక, ఖడ్గ, పాత్ర లామె ఆయుధాలు. ఆగస్టు 15 వ తేదీ ఆంధ్ర దినపత్రిక 17 వ పుటలో మంతపాక గ్రామములోని 'ఎల్లారమ్మ' విగ్రహాన్ని జి. ఆర్. వర్మగారు ప్రచురించారు. ఈ దేవి నాలుగు



చేతులలోనూ కత్తీ, డమరూ, త్రిశూలమూ, గిన్నే కలవు. ఈమె కాకతీయుల కాలములోనే మలచబడి

యుండునని ఈమెకు గల (మకర) తోరణము సూచిస్తోంది. (హనుమకొండ రుద్రేశ్వరాలయంలో, ఓరుగంటి ద్వారతోరణాలమీద, ఈ తోరణము కానవస్తుంది.) అయితే క్రీడాభిరామవర్ణనను బట్టి ఈమె ఏకవీరమ్మ (ఎల్లమ్మ) కానే కాదు; చాముండియే. ఈమె వాహనము చక్కచక్కగా తెలుస్తోంది బొమ్మలో. శ్రీ ప్రభాకరశాస్త్రులుగారికి శ్రీ గరికిపాటి వెంకటేశ్వర్లుగారు చెప్పినారన్న దొంతపాటి కాకతమ్మవృత్తాంతము నిజమైతే ఈమెకూడ కాకతమ్మయే కావలయును. అయితే ఆమె ఈమె చాముండి రూపములే; సందేహము లేదు.

వేలూరు సప్తమాతృకలలోని చాముండి సరిగ్గా యిదే రూపము. క్రీడాభిరామ కాలంలో ఓరుగంట 'చముడేశ్వరి మహాశక్తి నగరు' ఉన్నట్లు మంచనశర్మవర్ణన సాక్ష్యము. ఈ చాముండీశ్వరి, చాడేశ్వరి. ముఖ్యాల ప్రాంతంలోనే కాదు కాకతీయుల రాజ్యమంతటా గోచరిస్తుంది. ఉత్తరమున మంథెనలో ఈమె పీఠానికి దిగువ రెండు తలలున్నాయి; చాముండికి ప్రేతాసనము చెపుతుంది విష్ణుధర్మోత్తరము. ఈ తలలు ప్రేతానికి చిహ్నాలు; చాముండిని పరివేష్టించి ఉండే ప్రేత సమూహాల చిహ్నాములన్నా అనవచ్చును. దక్షిణాన్న తోరణాలలో, వసుమ మేళ్ళచెరువులో ఈమెకు పై ఆయుధాలే ఉన్నవి గాని వాహనము లేదు. ఉలింద కొండలోనూ, మదనపల్లిలోనూ, వద్దిపర్రులోనూ, వర్ధమానములోనూ కూడా వాహనము కానరాదు. హైదరాబాదు మ్యూజియములో నీమె లంబస్తని, వికృతాక్షి, ఘోరరూప. అత్తిరాల విడిశిల్పాలలో ఈమెకు వాహనమూ లేదూ పరివారమూ లేదు గాని పరశురామేశ్వరాలయ అర్ధ శిల్పాలలో ఈమె గూటిచుట్టూ ప్రేత పరివారమున్నది. గోల్కొండ మ్యూజియంలో ఈమె ఆసనానికి దిగువన ఒక తల-ప్రేతాసన చిహ్నము కానవస్తోంది. ఈమె పేర్లు ఎన్నైనా ఉన్నవి: మేళ్ల చెరువులో ముత్యాలమ్మ, ఉలిందకొండలో కుంకులమ్మ, వద్దిపర్రులో ఎల్లమ్మ, మంథెపాకలో ఎల్లారమ్మ, దొంతపాడులో కాకతమ్మ, కొవకుడిలో తలకంటమ్మ. ఈ చివరిచోట నీమెకు త్రిశిరాలూ, (యముని) మహిషవాహనమూ చేరెయి. హనుమకొండకోటలో నీమె లంబస్తన—, కృశోదర—, అష్టభుజ—, ఘోరరూప—, ప్రేతాసన—, మలతో యోగేశ్వరి లేక జోగులాంబ అయినది. స్థానికచరిత్రకారులుకూడా ఈమెయే కాకతి అనుకుని గద్దశక్తి అన్న సంస్కృతప్రతిపత్తి ఈమెకిచ్చి, పద్మాక్షి సిద్ధేశ్వరులతో పాటు ఈమెనూ గోపాల మూర్తినీ ఏకామ్రనాథుడనే జైనసన్యాసి ప్రతిష్ఠించినాడన్నారు. ఈమె దుర్గాశక్తి కాదు. త్రిశూల డమరుకము లా అపోహను కలిగించియుండవచ్చును. అలంపురములో ఈమె పేరు జోగులాంబ. అక్కడి బ్రహ్మేశ్వరాలయము మొదటిలో ఈమె ఆలయమే కాబోలు, ద్వారబంధము దిగువన ప్రేత ద్వారపాలికలున్నారు.

ఈమె రూపశిల్పాలను కాకతీయులే కాదు కందూరుచోడులు వర్ధమాననగరంలో, పొత్తపిచోడులు అత్తిరాల మదనపల్లీనగరాలలో, నెల్లూరుచోడులు నెల్లూరిలో నిర్మింపించారు. ఈమె దుర్గాశక్తి కానే కాదూ, కొత్త దైవమూ కాదు; చాముండి. ఈమె సప్తమాతృకలలో ఒకతె, యమునిశక్తి. అంధకాసుర సంహారకాలములో నీమె ఆ అసురులరక్తము నేలమీద చిందకుండా గిన్నెపట్టి త్రావినది. కృశోదరి కాన ఈమె ఆకలి కంతులేదు. చాముండి యమునిశక్తి అనీ, యోగేశ్వరి శివునికంఠపు సెగనుండి సృష్టి అయినదనీ వేరేకథ వున్నది కాని వీరిద్దరు నెరవేర్చిన పనులూ ఒక్కటే, వాహనాలు అవే; అవతారాలే భేదము. నేటి ఈమె రూపాలు మందులకు లొంగని రోగాలకు అధిదేవతలు. మేళ్లచేరువు ముత్యాలమ్మ, మంథెపాక ఎల్లారమ్మ, నెల్లూరి ఇరుకాళమ్మ, మశూచిరోగానికి అధిదైవతాలు. రాజమండ్రి శ్యామలాంబ, అనకాపల్లి నూకలమ్మవంటి గ్రామదేవతలన్నీ ఈమెరూపభేదాలే. ఈమెను హైదరాబాదులోవలె కపాలమాల యజ్ఞోపవీతంగా ఉండవచ్చునూ, విష్ణుధర్మోత్తరము ప్రకారము కోర లుండవచ్చునూ, పూర్వకారణాగమము చెప్పినట్లు చంద్రకళావతంస ముండవచ్చును. సామాన్యజనులసృష్టిలో సృష్టికి తల్లి అయిన ఏకవీరా, సంహారకారిణి.చాముండీ, ఇద్దరే దేవతలు. ఏకవీరమ్మను రేణుకాదేవి శిరస్సురూపంలోనూ, చాముండిని చతుర్బాహు దేవిరూపంలోనూ అర్చిస్తున్నారు పాటక జనము నేటికీ. "కాకతమ్మకు సైదోడు ఏకవీర."

# ఆలాపన!

## శ్రీ రాఘవ

రాజశేఖరం - సుబ్బులు - సదానందం -
కాంతం - భార్య - అప్పన్న...

[నేపథ్యంలో ప్రయోక్త—

ఒక అమావాస్యనాటిరాత్రి కుండపోతగా నిల్చి కురుస్తున్న జడివానజోరు - సుడిసి సుడిసి వీస్తున్న యీదురుగాలి హోరు-భూమ్యాకాశాలు దద్దరిల్లే వురుములూ-ఫెళేల్ ఫెళేల్ మంటూ మెరుపుతీవల విరుపులూ - అటూ యిటూ ఫెడీల్ ఫెడీల్ మంటూ వూగుతూ గోడకి తగిలివచ్చే కిటికీ తలుపుల చప్పుడూ- మధ్యమధ్య బెక బెకమంటూ కప్పల అరుపులూ-కీచురాళ్లగోల-ధ్వనులన్నీ, ఆందోళనని వర్తచేస్తూవుంటయి.

రాజశేఖరంగారికి అరవైయేళ్ళుంటయి. గంభీరమూ - తియ్యదనమూ - మార్దవమూ మేళవించుకొనిపోయిన కంఠం. ఆర్ద్రతా-ఆత్మీయతా - మమకారమూ రంగరించుకొన్న హృదయం. ప్రతిమాటలోనూ దేనికోసమో పరితపించుతూ - తపనచెందే లాలస - అర్థవంతమై వుంటుంది.

ఆ నాటి వాతావరణం, భప్పినలా ఆయన్ని చుట్టుముడుతుంది...హఠాత్తుగా నిద్రను భగ్నపరుస్తుంది... అదిరిపోతాడు...ఏదో భయం...కంగారూ ఆవరిస్తయి. ఎవర్నో పిలవాలనుకుంటాడు...దగ్గరగా యెవరున్నదీ గుర్తుకి రాదు. వ్యాకులపాటు చెందుతాడు. అసలు గొంతుకే పెగలదు. ప్రయత్నిస్తాడు శక్తికొద్దీ. వెలిగించేందుకు దీపం కనిపించదు. మూలుగుతూ-"ఇస్సో! అబ్బ!! ఊఁ..." అంటూ వచ్చి చప్పుడుగా గది తలుపులు తెరుస్తూ......]

రా. శే: ...(మంద్రస్థాయిలో)...అప్పన్నా...

అప్పన్న: (గురక పెడుతూ...నిద్రపోతూవుంటాడు.. గురకశబ్దం.)

రా. శే: ... (గట్టిగా) ... అప్పన్నా ...ఓ...

అప్పన్న: ... (ఉలిక్కిపడుతూ) ... అయ్యా ...

రా. శే: ...ఏమిటిరా అంత మొద్దునిద్ర...మరీనూ...

అప్పన్న: (కంగారుగా) పిలిచారా బాబూ!

రా. శే: ...ఊఁ...ఇంత చీకటింట్లో భయంలేకుండా ఎట్లా నిద్రపోతున్నావురా? లేచి, కాస్త లాంతరు వెలిగించు...

అప్పన్న: ...అలాగే బాబూ!...(అగ్గిపెట్టెని 'దక్' మని గీసిన చప్పుడు)

రా. శే: ...కాస్త పెద్దదేయరా దీపాన్ని...ఊఁ... ఆ నవ్వారు మంచం వెయ్యి. రవ్వంత నడుం వాలుస్తాను.

అప్పన్న: ...మీ గదిలో పందిరిమంచం మీద బాగా నిద్రపట్టలేదా బాబూ!...

రా. శే: (విసుగ్గా) లేదురా, అప్పన్నా...పట్టిన మంచి నిద్రనే యీ వానా-గాలీ వచ్చి వెరవది... తేల్చి పారేసింది...

అప్పన్న: ...శ్రావణమాసం వర్షాలుగదూ! బాబూ! చెప్పిరావు ... వచ్చాయంటే నిల్చికురుస్తయి కుండపోతగా. వరదలూ-వాగులూ వచ్చి వూళ్ళనీ వూళ్ళనీ యేకంచేసి ముంచెత్తుతయి. ఇక చూశారూ! అక్కణ్ణించి పంటల నష్టమూ... పశువుల కష్టమూ.. చెప్పతరంకాదనుకోండి... ఒకటా...వర్షాలు లేకపోతే ఒకబాధ-వుంటే మరోబాధ...అసలు బ్రతకటమే ఒక పెద్దబాధ లెండి బాబూ!...తెలియదు గానీ... మనకు...

(ఎక్కడో-ఎటువైపో తలుపులు కొట్టుకొంటున్న ధ్వని అస్పష్టంగా వినవస్తూవుంటుంది.)

రా. శే: (భయంతో) నువ్వు సోది చెప్పటం మొదలెడితే యిక అంతూ పొంతూ వుండదు... కాస్తాగు...

అప్పన్న: (కంగారుగా)... దేనికి బాబూ!...

రా. శే: ఏదో చప్పుడవుతున్నట్టు లేదూ!..(మెల్లిగా) ఏమిటది?

అప్పన్న: ఎక్కడా బాబూ! వినిపించటంలేదే! సరిగ్గా.

రా.. శే: ఇంకా నీకు నిద్రమత్తు వదల్లేదు కాబోలు...

అప్పన్న: వదిలిపోయింది బాబూ!...

(మళ్ళా పై చప్పుడు కొంచెం గట్టిగా అవుతుంది)

రా. శే: (మెల్లిగా)...యీ సారి సరిగ్గా చెవియొగ్గి విను...ఏం?...వినిపిస్తోందా?

అప్పన్న: ఏం లేదే! బాబూ!...

రా. శే: అదేరా అప్పన్నా! స్పష్టంగా వినిపిస్తుంటే! ఎవరో తీయలేకతీస్తూ, వెయ్యలేక వేస్తూన్నట్టుగా కూడా వుంటే!!

అప్పన్న : ఈ వేళప్పుడు ఎవరు బాబూ! ఆవైపు నుంచి వచ్చే దట్లా?

రా. శే : 'ఎవరూ?' అంటే 'ఎవరని' చెప్పగలం? గాలీ రావచ్చు - ధూళీ రావచ్చు...! ఒకవేళ వచ్చినవాళ్ళు యీ విపత్సమయంలో చూడటానికీ రావచ్చు..ఒంటరికొంపకి అదుపూ ఆజ్ఞా వుంటేగా...!!

అప్పన్న : ఒకవేళ, మీరు పడమటిగది సర్దాక తలుపులు వెయ్యటం మరిచారేమో!

రా. శే : (అనుమానంగా...ఆలోచనగా) వేశానే!... (చప్పుడు యింకా వినిపిస్తూనే వుంటుంది) వేయకుండా మర్చిపోనే! అయినా యివ్వాళేమైనా పొరబాటున మర్చిపోయానేమో!... వెళ్ళి చూసిరా...అప్పన్నా...

అప్పన్న : (అనుకుల చప్పుడులు) అన్ని తలుపులూ గట్టిగానే వేసివున్నయి బాబూ!

రా. శే : మరేమిటా చప్పుడు ... టిక్కు టిక్కుమనిపిస్తూ...

అప్పన్న : ఇందాకన్నుంచీ నాకేమీ వినిపించటంలేదు ... బాబుగారూ! అదంతా మీ ఆలాపనేమో అనిపిస్తోంది. నిశ్చింతగా వెళ్ళిపడుకోండి. దీపంకూడా మీ గదిలోనే వుంచుకోండి... భయంలేకుండా వుంటుంది.

రా. శే : నువ్వు యింత కటిక చీకట్లోనే పడుకుంటావా? భయం వేయదూ!...

అప్పన్న : నా కలవాటేగా బాబుగారూ! పొద్దోయింది. వెళ్ళి పడుకోండి... తెల్లారితే మళ్ళా నీరసంగా వుంటారు...

రా. శే : టైమెంతవుతుంది అప్పన్నా!...

అప్పన్న : పదకొండుగంటల రైలు వెళ్ళి చాలాసేపైంది బాబూగారూ!

రా. శే : అంటే సుమారుగా ఎంతయిందంటావ్?

అప్పన్న : పన్నెండు దాదాపుగా అవ్వొచ్చు...

రా. శే : అబ్బా!...సరే...నేను లాంతరు తీసుకుపోయి పడుకుంటున్నా...పిల్చినప్పుడే! కొస్త దగ్గరగా పలుకు...మేలుకువగా పడుకో! ఏం?

అప్పన్న : అలాగే బాబూ!...పలుకుతా లెండి... (కొద్దివిరామం... నేపథ్యంలో మరల ప్రయోక్త-మొదటి దృశ్యంలోని వాతావరణమంతా భయానకంగా, రకరకాల వికృత శబ్దాలతో ఆ గది అంతా ప్రతిధ్వనిస్తుంది. బీరువామీద యున్నటో ఆగిపోయిన గడియారం గణగణమంటూ మ్రోగుతూ వుంటుంది. దొంతరగా పెట్టిన అలమార్లోపుస్తకాలు దభేలునపడుతూవుంటయి. గోడలకున్న పటాలు కిందపడుతూ కొట్టుకుంటూ వుంటయి...కుర్చీపీటమీది మంచినీళ్ళ మరచెంబు 'ఠన్' మని గచ్చునేలమీదపడి వికృతంగా, వికిలిగా నవ్వుతుంది...ఎవరో వచ్చినట్లూ...రాజశేఖరంగారు కలవరంగా లేస్తూ...)

రా. శే : (భయంగా) ఎవరా మనిషి?

(గడియారం గణగణ తగ్గుతుంది. ఆయాసం... రొప్పు...ముక్కుడూ వినిపిస్తూవుంటయి...)

రా. శే : (తనలో) వెలిగించిన లాంతి రేది? ఏమిటీ చీకటి? (ఆశ్చర్యంగా) పలకరేం? ఎవరా మనిషని అడుగుతుంటే?

సదానందం : నేనే తాతయ్యా! వచ్చింది! దీపం వెలుగుతూనే వుందిగ—...

రా. శే : (కంగారుగా) ఎవరూ? ఎవరు నువ్వు 'తాతయ్యా!' అంటున్నావు... చెప్పు...ఎవరు నువ్వు? నా ఆస్తికి వారసుడవుదామని వచ్చావా? తాతయ్యా అంటూ... చెప్పు...

సదానందం : నేనే తాతయ్యా!...సదానందాన్ని...

రా. శే : (గొణుగుతూ) సదానందం!...సదానందం... (తనలో) నాకు తెలిసినవాడే! కళ్ళు మసగ్గా వున్నయ్యేమిటి? చూద్దామంటే! యిలారా నాయనా దగ్గరకి...

సదానందం : నేనే తాతయ్యా! సదానందాన్ని. అప్పుడే మర్చిపోయావా?...

రా. శే : (ప్రీతిచెందుతూ) నువ్వా సదానందం! హఠాత్తుగా వచ్చి పక్కరించేసరికి, మరుపు వచ్చేసినట్టయింది...ఎప్పుడొచ్చావురా! ఎలా వచ్చావు?

సదానందం : ఇప్పుడే వచ్చాను తాతయ్యా! నీకోసం వర్షాన్ని కూడా లెక్క చెయ్యకుండా...

రా. శే : (ఆప్యాయంగా) మా నాయనే...! నేనంటే నీకెంత ప్రేమరా! వర్షమూ-వంపుడూ కూడా కాదనివచ్చావు. అంతా కులాసాగా వున్నారా! వాన్నిప్పుడేం చేస్తున్నాడు? అమ్మకి క్షయరోగం నయమైందా? చిట్టిచెల్లాయి చక్కగా ఆడుకుంటోందా? బామ్మ యింకా దగ్గుతూ అవస్థపడుతూనే వుందిరా? ఏమిటో? దానికి

యొక్కడికిపోయినా సుఖమూ—శాంతీ వుండకుండా పోతున్నాయి. చెప్పరా! కొసినికమ్మని కబుర్లు చెప్పరా! ఎన్నాళ్ళకి చూడగల్గారా! మానాయనే! మా బాబే! నువ్వు చాలా చిక్కిపోయావురా! చెప్పనాన్నా! అంతా కులాసాగా వున్నా(రా!

సదానందం: (ఆశ్చర్యంగా) ఏమిటి తాతయ్యా నువ్వు "అంతా కులాసా?" అని అడుగుతావ్? నాకేం అర్థం కావటం లేదు. ఎవర్ని గురించో తెలియటం లేదు...

రా. శే: (తెల్లబోతూన్న కంఠం) అదేమిటిరా! అమ్మనీ-నాన్ననీ-బామ్మనీ చెల్లాయినీ ఎరగవుట్రా! వాళ్ళూ నీతోబాటు కులాసాగా లేరూ!

సదానందం: నాతోబాటు యెవ్వరూ లేరే! కులాసాగా వుండటానికి...(వింతగళం)

రా. శే: నీ మొహం...నీతోబాటు లేకపోవటమేమిటి. నీదగ్గరకనే మొన్న మధ్య వస్తే. నేను గాదూ పంప లేక అందర్నీ పంపింది! ఒంటరిపాటుకి తప్పనిసరిగా యిష్టపడుతూ...

సదానందం: నువ్వన్నీ వుత్తమాటలే అంటున్నావ్ తాతయ్యా! నాదగ్గర కెవ్వరూ రాలేదు... నిజంగా...

రా. శే: వాళ్ళొచ్చినప్పుడు నువ్వు లేవేమో! మళ్ళీ వెళ్ళినప్పుడు చూడు. నీవున్నచోటే వుండి వుంటారు...

సదానందం: తెలియక అడుగుతాను.....తాతయ్యా! అసలు వాళ్ళెవరు? నాకు వాళ్లు అమ్మ-నాన్నా—బామ్మ-చెల్లాయి అవటం ఏమిటే?.

రా. శే: ఓరి! నీ తెలివి మండిపోనూ—ఏమిటా పిచ్చి ప్రశ్న...? వాళ్ళెవరేమిటి? నిన్ను కన్నవాళ్లూ-పెంచినవాళ్ళూ — నీ తోడిదే లోకమనీ— సంతోషమనీ — ఆనందమనీ నమ్మినవాళ్లు... ఒక చెల్లాయిమాత్రం నీతోడబుట్టినది...రక్తధార...వీళ్లంతా నీకయినవాళ్ళే!!!

సదానందం: నువ్వన్ని చెప్పినా నాకేమీ బోధపడటం లేదు. నాకు నేను తప్ప, నావెంట యెవ్వరూ వుండటం లేదు. కనీసం వాళ్లు నాకు కనిపించటమే లేదు. యింకా గుర్తుకేముంటారు?

రా. శే: ఓరి! నీకడుపు బంగారంగానూ! యిన్ని అబద్దాలు అప్పుడే యెట్లా నేర్చుకున్నావురా! నీకోసం తపించి—తపించి, నన్నొంటరివాణ్ణి చేసి, కన్నీటి సముద్రంలో ముంచివేసి, నాగుండెలో కారుచిచ్చు రగిల్చి, నీకోసం వాళ్ళు నిద్రాహారాలు మానేసి, వెతుక్కుంటూపోతే—"నాకు వాళ్ళెవ్వరూ కనిపించలేదూ! నా కెవ్వరూ లేరూ, నువ్వు చెప్పేది నాకర్థం కావటం లేదు. అసలు గుర్తుకే లేరూ!" అంటావూ! యిదేం సోద్యం రా! ఏమన్నా నమ్మశక్యంగావుందా నీమాట...చెప్పు పోనీ...

సదానందం: నువ్వు ఏమన్నా అనుకో తాతయ్యా! నువ్వుతప్ప నాకెవ్వరూ కనిపించటంలేదు. గుర్తుకీ రావటంలేదు...ఏం చేయమంటావ్?

రా. శే: (బాధగా) పోన్లేరా! మనవాళ్లే నీకు ఆనవాలు లేకపోతే, నేనుమాత్రం ఏం చేయగలను?...

సదానందం: నే నిట్లా మారిపోయానని బాధపడుతున్నావా తాతయ్యా!...

రా. శే: లేదు...యింకా ఆ తెలివితక్కువతనంలో పడలేదు...

సదానందం: నువ్వు నిజం చెప్పటంలేదు...ఏమిటో దాచి దాని అయిష్టంతో మాట్లాడుతున్నావ్?

రా. శే: లేదు రా సదానందం! నా మనస్సులో ఏ దాపరికమూ లేదు.

సదానందం: ఉంది...నాకు తెలుసు...నువ్వు తెలియనీయటంలేదు...

రా. శే: తెలియపర్చటందుకు మునుపటిలాగా నే నేమీ లేను. బాధతో-దుఃఖంతో—విరక్తితో గుండె రాయిలాగా మారిపోయింది. ఆవేదనలూ—అనుభూతులూ—ఆలోచనలూ సమసిపోయినయి. మీ మూలంగా ఒంటరితనం ఏర్పడింది. అదే నన్ను ఓ పిండంగా మొద్దుబారేటట్లు చేసింది.

సదానందం: అవన్నీ వాస్తవానికి నీలో యేమీ లేవు. ఉంటయ్యేమోనని భయపడుతూ, వుండిపోయినట్లుగా ప్రవర్తిస్తున్నావు. నువ్వు భ్రమతో జీవిస్తున్నావ్. అంతే...తాతయ్యా!...

రా. శే: కాదురా సదానందం! నీకన్నా పెద్దవాణ్ణి! అనుభవజ్ఞుణ్ణి!! చెపుతున్నాగా! విను. నేను యిప్పుడు "మనిషి చేసిన ఒక రాతిబొమ్మను" తెలిసిందా!!...

సదానందం: (లెక్కచెయ్యని గొంతికతో)...కాదులే తాతయ్యా!

రా. శే: అవును సదానందం! (నవ్వుతూ) నిజం గానే రా!

సదానందం: (విసుక్కుంటూ) "నువ్వు రాతిబొమ్మవి కావు" అని నేను అంటున్నాను ... నువ్వేమో రా నమ్మనంటున్నావు...వినిపించుకో...

రా. శే: ఓరి! నీ తెలివి తెల్లారా! నేను చెప్పేది విన వేరా! నాకున్నా రెండు చెవులు యొక్కవ చెవి విన వాడిలా గా మాట్లాడుతావేరా! పిచ్చి అరిచావా లాగా—

సదానందం: మనుష్యుడికే నువ్వు రాతిబొమ్మవి కావు తాతయ్యా!

రా. శే: నువ్విట్లా అంటే, నాకు ఒళ్ళు మండే కోపం వస్తుంది...నీతో యింకా చాలా విషయాలు మాట్లాడా లనుకుంటున్నాను. అనవసరంగా కోపం తెప్పించకు...తెలుసా...

సదానందం: భగవాన్ నేను లేనట్టే నువ్వు కోపంలో కూడా చాలా బాగా మాట్లాడుతావుగ!

రా. శే: నువ్వు మరీ యింతమెంతై ఘటానివై పోతూ వేరా నాకన్నా.

సదానందం: మనవాడన్నత్వం వాక్కు యొక్క దీక పోతుంది మరి!

రా. శే: అందుకని నన్ను మూర్ఖంగా నమ్మిస్తావట్రా! అర్ధమయ్యేట్లున్నావా...

సదానందం: లేదు తాతయ్యా! అందుకే నిన్ను పిల్చాను గా.

రా. శే: లేకపోతేటు మేమిటి? నాలో ప్రాణాలతో నవ్వుతూ వుండేకూడా...

సదానందం: "నేను మనిషిచేసిన రాతిబొమ్మని కాను" అని నవ్వుతూ మాట్లాడు...యీ వాదనంతా దేనికిగానీ—

రా. శే: నా పూజని పోయినా సరే నేనట్లా అనను. నన్ను నేను తక్కువ చేసుకుని, చులకనగా వాగి, నీ పిచ్చికొన్ని కాపాడమంటావుట్రా! ఆ పక్షవ పని నేస్తే చేయను..... ఏమనుకుంటున్నావో...

సదానందం: నువ్వామాట అనేవరకూ, నేను నిన్ను విసిగిస్తూనే వుంటాను......వదలను...ఏమైనా సరే!...

రా. శే: ఏమిట్రా నీ ఆగడం? నేను "రాతిబొమ్మనురా" అంటే నమ్మవేం...

సదానందం: కాదు... నేను నమ్మను...

రా. శే: అవును...నువ్వు చచ్చినట్టు నమ్మాల్సిందే!!

సదానందం: (స్పష్టంగా) కాదు...

రా. శే: (గట్టిగా–గంభీరంగా) అవును...

సదానందం: (రెట్టిస్తూ–బిగ్గరగా) కాదు...కాదూ... (స్థాయిగా)...కాదు...

రా. శే: (బిగ్గరగా కోపంతో) అవును...అవునురా... అవును...నన్ను విసిగించకు...సదానందం...

సదానందం: కాదు...

రా. శే: అవును...

సదానందం: నువ్వు రాతిబొమ్మవి కావు (గొంతుక పెంచుతూ)

రా. శే: నేను "మనిషిచేసిన రాతిబొమ్మనే...అవును.. నేను రాతిబొమ్మనే...నమ్మ...నమ్మ సదానందం...(గొంతుక చించుకుంటూ—రొప్పుతూ...)

(భూమ్యాకాశాలు వురుములు—మెరుపులు తీవ్రంగా వుంటాయి.....హోరుగాలి...వాన రొద...)

అప్పన్న: (తలుపులు బాదుతూ) బాబుగారూ! (కంగారుగా) బాబుగారూ!

రా. శే: (అప్పన్న కేకలు వినిపించుకోక) నువ్విప్పుడు వచ్చి నన్నెందుకురా యిట్లా విసిగిస్తావు సదానందం?

అప్పన్న: (ఆదుర్దాగా) బాబుగారూ! ఓ బాబుగారూ! తలుపు తియ్యండీ! ఏమిటా అరుపులు? ఎవరితోనండీ! అర్ధరాత్రిపూట ఏమిటా గోల... తలుపు తియ్యండీ!...

రా. శే: (బాధగా) ఎవరో నా మీద ప్రేమానురాగాలు వుండి, చూసిపోవటానికి వచ్చారనుకున్నానే గానీ, యిట్లా చిత్రవధ చేస్తావనుకోలేదురా సదానందం...నన్ను అనవసరంగా కలవర పరిచావు. మనస్సంతా చెదరగొట్టావు...గదరా!

అప్పన్న: (నిరాశతో) యీ శ్రావణమాసమొస్తే యిదే గోల గదా యీయనగారితో! తెల్లవార్లూ వాళ్ళ వాళ్ళతో వాగుతూ ఒకటే రభసచేస్తూ కాలక్షేపం చేస్తూంటారు...ఎవరిమాటా వినిపించుకోరు. ఏమిటో! విచిత్రమైన మనిషి.

(ఉరుములూ–మెరుపులూ నెమ్మదిగా తగ్గుతాయి)

సదా: నువ్వనవసరంగా మనస్సుని పాడుచేసుకొన్నావ్ తాతయ్యా!

రా. శే: (అసహ్యంగా) నీ మూలంగానే...

(హఠాత్తుగా ఒక కంచు కంఠం గచ్చుమీదపడి నట్లు శబ్దం అవుతుంది.. రెండు తలుపులు దభేల్న మూసుకొన్న ధ్వని)

సదానందం : (బిగ్గరగా) వుండాల్సిందే తాతయ్యా!

రా. శే : (విసుగ్గా) నన్ను ఆదేపనిగా విసిగించకు... నేనుండను...వుండలేను...

సదానందం : (గట్టిగా) ఉండగలవు...ఉండాల్సిందే!.

ఒకముసలిగొంతు : నాన్నా! తలుపుతియ్యి...ఎవరితో పోట్లాడుతున్నావ్? (తలుపులు బాదుతూ)

రా. శే : (తలుపు తెరుస్తూ) ఎవరు మీరు? అడగకుండా లోపలి కెందుకొచ్చారు...?

సు. కాం : నేనే నాన్నా! నా యింట్లోకి నేను రావటానికి ఒకళ్ళ నడగటం దేనికీ-...అంతా మన వాళ్ళే!...

రా. శే : ఒరే సుబ్బులూ! యేమిట్రా అలా వున్నావ్? బాగా చిక్కిపోయి.....వాళ్ళెవరు?...కనిపించటం లేదురా సరిగ్గా...

భార్య : (నవ్వుతూ...ముల్గుతూ) నే నేనండీ!...యెలా వున్నారో చూసిపోదామని వచ్చాను...

రా. శే : నీకు యింకా దగ్గు నయంకాలా? ఛ్ఛ!!... ఊహుఁ...

భార్య : ఏం చేయను...నన్నీ దగ్గు...పీల్చి పీల్చి... పిప్పి చేసేస్తోంది. (ముల్గులు)

సుబ్బులు : మానాన్నని పలకరించవేమే కాంతం!

కాంతం : ఏమండీ కులాసా...నేను...మీ కోడల్ని..

రా. శే: నువ్వా చాలా ఎండిపోయావు...కాంతం...

కాంతం: ఇందాకణ్ణుంచీ చూస్తున్నాను...అచీకట్లో నిల్చున్నవాడు మన సదానందం కాదూ!... యిలారారా! కొత్త చొక్కాయిని ఎత్తుకోరా! నీ కోసం బెంగపెట్టుకొని వుంది...

రా. శే : యిందాకణ్ణుంచి నామచ్చ మాపుతున్నా డనుకో!

సుబ్బులు : ఏరా సదానందం...నీకోసం మేమంతా వెతకలేక అవస్థపడుతుంటే నువ్విక్కడికి మళ్ళా వచ్చావా?

సదానందం : శ్రావణమాసం కదూ! తాతయ్య ఎలా వున్నాడోనని చూసిపోదామని వచ్చాను...

రా. శే : వాడికి మీరంతా గుర్తుకే లేరుట!! కనిపించటమే లేదుట!...నే నొక్కణ్ణే బాగా కనిపిస్తున్నానుట...

భార్య : (దగ్గుతూ) చూశారా! మీరంటే వాడికెంత మమకారమో!

రా. శే : ఆఁ...వాడి మమకారమూ, నీ మమకారమూ ముక్కికొట్టినట్లే వుందిలే! నీ మూలంగా కాదూ! వాడిన్ని మాటలు నేర్వగలిగి, నన్ను యిందాకణ్ణుంచీ దంపుకు తింటున్నాడు...

కాంతం : ఏం చేశావురా సదానందం?...

సదానందం : నేనేమీ చెయ్యలేదు...

సుబ్బులు: నువ్వేమీ చెయ్యకపోతే, తాతయ్య యెందుకలా బాధపడతాడు...

సదానందం : తన్ను దాను తెలుసుకోలేక పోయినప్పుడు ప్రతిమానవుడూ అలాగే బాధపడతాడు...వింతయేమీ లేదు.

రా. శే : చూశావా! వాడు నన్నిట్లా పొడిచి— పొడిచి అంటున్నాడో!

సుబ్బులు : ఇక చాల్లేగానీ వూరుకో!...

రా. శే : పోన్లేగానీ సుబ్బులూ!! ఉగ్రసన్యాసి... ఏదో వాగనీయితే!...మీరంతా యిన్నాళ్ళెక్కడుంటున్నారు? ఏం చేస్తున్నారు?

సుబ్బులు : ఏం చేస్తాం...వూరికే వుంటున్నాం...

రా. శే : ఏం తోస్తోందిరా!...

సదానందం : నీకంటే తోయదుగానీ, మాకెందుకు తోచదూ! తాతయ్యా!

సుబ్బులు : ఇంతకాలమూ నీకోసం వెతికలేక అవస్థపడ్డాం...యింతలో శ్రావణమాసం వచ్చింది. ఒకవేళ నీదగ్గర కొచ్చాడేమోనని కట్టగట్టుకుని వచ్చాం...

రా. శే : వాడు రావటమూ అయింది...నస చేయటమూ అయింది...వూరికే వుంటాడా—వుండనిస్తాడా! అమ్మో!...

సుబ్బులు : ఒంటరిగా వుంటుంటే ఏం తోస్తోంది నాన్నా!...

రా. శే : ఏం తోచట మేమిట్రా! హాయిగా వుంటుంటేనూ! కమ్మగా లంకపొగాకు చుట్ట కాల్చుకుంటున్నాను. తిన్నఅన్నం సరిగానే అరిగిపోతోంది. రోజుకో రూపాయి వూరగాయపాపుల మీద మాటవేసుకున్నాను...యిల్లునీ – ఆస్తినీ కళ్ళల్లో పెట్టుకుని, అన్యాక్రాంతం గాకుండా కాపాడుకొస్తున్నాను......ఏటేటా గోడలకి సున్నం వేయిస్తున్నాను...మొన్నమొన్ననే, వేసవిలో యిల్లు తిరగ తీయించాను. ఈయేడు

తొండిపంపు పొలంలో పన్నెండో నెంబరూ, నురికొక్కడుపొలంలో అక్కడ బావి పూడ్పించాను. మన గిలక బావిలో పూడిక తీయించాను.. ఒక పెద్దబీరువా కొన్నాను...యీ మధ్యే చదరంగం కూడా నేర్చుకున్నాను...మీరు లేక పోయినా, నాకిది బ్రతికివున్నంత కాలమూ తప్పదుగా! చేయటానికి...

సుబ్బులు : అనవసరంగా శ్రమపడుతున్నావు...... హాయిగా కృష్ణా రామా అనుకొంటూవుండక—

సదానందం : నేను అదే చెప్తున్నా నాన్నా! వినటంలేదు. పైగా 'మనిషి చేసిన రాతిబొమ్మ'నని ఒట్టేస్తున్నాడు తాతయ్య...

రా. శే : కాదుట్రా సుబ్బులూ!...

సుబ్బులు : కాదు నాన్నా! నువ్వు రాతిబొమ్మవి కానే కాదు...

రా. శే : నీ ముఖం. కాకపోవటమేమిటి? మీరంతా ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయాక నేను ఎవర్ని? ఒంటరివాణ్ణేగా! రాతిబొమ్మ వెంటుగ్గానూ అంటూ...

సుబ్బులు : కాదులే నాన్నా!...

రా. శే : అవున్లే! నీకు తెలియదు గానీ వూరుకో!

భార్య: (దగ్గరూ) వాడు కాదూ అంటుంటే...మీరు అవునూ అంటారేమిటే! తిక్క మేళంగా... బుచ్చెమ్మచేతి వంట, నేను వెళ్లిన దగ్గర్నుంచీ బాగా వంటబట్టినట్టుంది.

రా. శే : ముప్పయ్యేళ్లు కాపురంచేసినా, నువ్వూ, నా విషయంలో అలాగే, తీర్మానిస్తున్నావు...ఏం చేయను? రామచంద్రప్రభో! ఎలాంటి భార్యను కుదిర్చి పెట్టావురా!

సుబ్బులు : కాదు నాన్నా! నువ్వు ఒంటరి మనిషివే గాని, రాతిబొమ్మవిమాత్రం కాదు...

రా. శే : (విసుగ్గా) మీరంతా సన్నీ వేళ ఒక్కసారిగా ఏడ్పించాలని వచ్చారా ఏమిటి? ఒకే మాటమీద పల్కుతున్నారు...

సదానందం : లేదు తాతయ్యా!

రా. శే : నువ్వూరుకోరా బాబూ! నువ్వు నోరు తెరిస్తే, నాగుండె చీలుకుపోతుంది...

భార్య: ఉన్నమాటనే అంటుంటే,ఎందుకలా వులిక్కి పడతారు...

రా. శే : (కటువుగా) అసలు మీరంతా ఎందుకొచ్చారు? ఇవ్వాళ.

భార్య : ఎలావున్నారో చూసిపోదామని...

రా. శే : బ్రతికే వున్నారా...

కాంతం.: కాబట్టే.చూసిపోవాలని వచ్చింది...

రా. శే : పైకేమో చూట్టానికి వచ్చావనటం...నా ప్రాణాల్ని విసిగించటం...నన్ను కలవరపర్చటం...ఏడ్పించటం ... యివ్వి లోపల్లోపల చేస్తూవున్నారు...

సుబ్బులు : పోనీ, నీకంత కష్టమైతే పోతాం...ఒంటరిగానే వుండు...ఎవరు కాదన్నారు?

రా. శే : అప్పుడే అంత అలకలొస్తే ఎట్లాగర్రా.

సదా : మేముండటం యిష్టం లేదుగా...

సుబ్బులు : ఎందుకూ? అనవసరంగా బాధను కలగ చేయటం...

భార్య : ఒంటరితనానికి - వెనవలవాట్లు తోడైనప్పుడు మీకు మేమంతా అసహ్యంగానే కనిపిస్తాం...

కాంతం : సంవత్సరానికోసారి వచ్చినా ... మీలో మార్పేమీ కనిపించటంలేదు ... వెళ్ళొస్తాం మామగారూ!... (అడుగుల చప్పుళ్ళు)

రా. శే : అంతా నన్ను ఒంటరివాణ్ణిగా లెక్కకట్టి పోతున్నారుగదూ! పొండి...శ్రావణమాసం వస్తే మళ్ళా మీరే వస్తారు...

(ఇంతలో గడియారం గణగణమని ధ్వనిచేస్తూ వుంటుంది...ఉరుములూ మెరుపులూ - భయంకరంగా ఉధృతమై వినబడుతూ వుంటాయి...తలుపు చప్పుళ్ళు బీభత్సంగా వేసి. క్రమేపీ తగ్గుతాయి)

=కొంచెం విరామం=

రా. శే: (హఠాత్తుగా. బొంగురుగొంతుతో) అప్పన్నా

అప్పన్న : (నిద్రలో వుంటాడు)...

రా. శే : అప్పన్నా...ఓ అప్పన్నా...ఏమిట్రా మొద్దు నిద్ర...కొత్త మెలకువగా పడుకోమని చెప్పలేదూ!...

అప్పన్న : పిలిచారా బాబూ (ఒంగాను)...

రా. శే : (బాధగా) మనవాళ్ళొచ్చారు...

అప్పన్న : (ఆశ్చర్యంగా) ఎవరూ?

రా. శే : (విసుగ్గా) నీ బొంద ఎవరేమిటి? సుబ్బులూ-సదానందం-కాంతమ్మ, మా ముసలమ్మ..అంతా వచ్చారు...

అప్పన్న : ఎప్పుడూ...ఏరి ?

రా. శే : యింకా!.నీకు నిద్రమత్తు వదల్లేదూ...

అప్పన్న : (గట్టిగా...నూర్గి)హా... చెప్పండి...మన వాళ్ళు వచ్చారా!...

రా. శే : ఇప్పటిదాకా యిక్కడే వున్నార్రా!

అప్పన్న : మీరు చాలా భ్రమపడుతున్నారు బాబుగారూ!

రా. శే: లేదు అప్పన్నా! అంతా వచ్చారు...నన్నేమిట్లో అడిగారు...విసిగించారు...నానా గోల చేశారు. పోతామని బెదిరించారు...పో పొమ్మన్నాను ...కోపం వచ్చి...వెళ్ళిపోయారు... వుండమన్నా బాగుండేది...తెల్లారేదాక వుండే వాళ్ళు... (నిరాశగా) ...అందరికీ కష్టం కలిగించాను...

అప్పన్న: నాకు, యిలా శ్రావణమాసం-అమావాస్య, కలిసిన నేచాలు-మీరిలా ఆలాపిస్తారనీ.కంగారు పడతారనీ తెలుసు.

రా. శే: ఇదంతా నా ఆలాపనే అంటావా? వాళ్ళెవ్వరూ రాలేదా?

అప్పన్న: ఎలా వస్తారు బాబూ! వచ్చి,మట్టిలో కలిసిన వాళ్ళు మళ్ళా ఎలా వస్తారు చెప్పండి...

రా. శే: ఏమవుతారు మరి!

అప్పన్న: ఏ గాలిలోనో-ఏ ధూళిలోనో-దయ్యాలుగా మారి కలిసిపోతారు...

రా. శే: అదంతా వుత్తిదేగా అప్పన్నా! వాళ్ళంతా రాత్రి మామూలు మనుష్యుల్లాగా వచ్చి పలకరించారు...లకుకబుర్లతో నన్ను కలవరపర్చి, గోలచేశారు... అందర్నీ మసగమసగ్గా కూడా చూశాను! గుర్తుపట్టాను. కూడా!...

అప్పన్న: అంతా సంవత్సరాల నాడాతో. శ్రావణ మాసంలోనే కదా! పోయింది. అందుకని శ్రావణమేఘాలు వుమి మొగిసినప్పుడల్లా-మీ గుండెలు జలదరిస్తయి...వాళ్ళొచ్చి మాట్లాడి పోయినట్లు భ్రమపడతారు...

రా. శే: అంతేనంటావా అప్పన్నా!...

అప్పన్న: అంతేబాబూ! అంతే...

రా. శే: నేనిలా బ్రతకటం బాగుండలేదని ఆక్షేపించారు రా! నేను మనిషి చేసిన రాతిబొమ్మని కాదని వాదించారు రా! నాలో కోరికలూ-అభిరుచులూ - ఆడంబరాలూ - ఆశలూ చావలేదని కచ్చితంగా మొహాన అనేశార్రా ... నేను బుచ్చెమ్మ చేతికూడు తిన్నాక బాగా మారి పోయాన్రట...ఒంటరివాడివి నీకీ బాదరబందీ ఎందుకని అంతా అన్నార్రా...

అప్పన్న: మీ రక్తం నుండి పుట్టి, మీ కన్నా ముందు కాలం చేశారు కాబట్టి, మళ్ళా మీ వద్దకే వచ్చి, మనస్సుని కలవరపర్చారు. మీ వంశీయులు మిమ్మల్నే కోరతారుగాని, పరాయి వాళ్ళ నెందుకు పీడిస్తారు?...

రా. శే: సరేకానీ...ఏంచేస్తాను...టైమెంతయిందో చూడు...

అప్పన్న: మూడు దాటింది బాబుగారూ!...

రా. శే: అందుకే వెళ్ళిపోయారు. వానవచ్చినా-వరద వచ్చినా-బంధువులొచ్చినా-మృత్యువొచ్చినా యెవరికోసం కాలం ఆగదు. అంతలో వస్తయి...మరంతలోనే పోతయి...ఏమిటో విచిత్రలోకం! అన్నీ తెరపడే నాటకాలే!! ఒక్క జీవితమూ సరిగ్గావుండదు. అన్నీ భ్రమలే! అన్నీ అనుమానాలే!! భ్రాంతులే!! ప్చ్!!...

అప్పన్న: వర్షం వెలిసినట్టుంది బాబూ! యీదురుగాలి కూడా తగ్గింది...ఆకాశం కూడా వురమటం లేదు!!...

రా. శే: నా గుండెలు బ్రద్దలుచేసి కలవరపర్చటానికే యీ శ్రావణమాసం-యీ అమావాస్య-యేటేటా వచ్చిపోతూ వుంటయి...ఏంచేయను?

అప్పన్న: కాలాన్నీ - మానవుని వయస్సునీ - సముద్ర తరంగాల్నీ-ఆపగలమా బాబూ! అనుభవిస్తూ వుండాల్సిందే!...

రా. శే: అంతే అప్పన్నా! అంతే!! యీ లోకమే అనేక బాధలతో నిండినగాదె. అలాంటప్పుడు మనదో లెఖా-జమా!...

అప్పన్న: చక్కగా సెలవిచ్చారు బాబూ!...

రా. శే: (తాత్వికంగా) అసలు యీ బాధ అనుకున్నంత బాధ గాదు...బాధపడతా వేమోనని, అనాగరికంగా జాగ్రత్తపడటం ఒక పెద్దబాధ... అదే మానవుణ్ణి అనేక సమస్యల రూపంలో తారసిల్లి భ్రమింపజేస్తోంది...తనువు శాశ్వతం కాదని తెలిసివున్నా - యీ లోకంమీద యింకా ఆశ, భ్రమ పట్టుకుని వ్రేళ్ళాడుతూనే వున్నయి. నా తరువాత యీయిల్లూ-వాకిలీ-ఆస్తిపాస్తులూ-పొలమూ-పుట్రా ఏమవుతయో తెలియదు. వున్నంతకాలమూ అనుభవించటానికి మనస్సొప్పటంలేదు...కొంతా - కనకాల్ని విసర్జించలేని బలహీనత మానవునిలో ఎందుకు నిగ్రహించివుందో, ఎంత నీతిసారాంశం విన్నా, ఎన్ని పురాణాలు విన్నా తెలిసిరావటంలేదు ... యింకా యీ పాడులోకంలో యీ పాపిష్ఠి జీవితం యెన్నాళ్ళు యిలా సాగవలసివుందో—

అప్పన్న: ఎవరు చెప్పగలరు బాబూ:...యీ జీవితయాత్ర గూర్చి - పెద్దలన్నట్లు, యీ మానవుని బ్రతుకు-"దినదినగండం నూరేళ్ళు ఆయుష్షు"గా వుంది...

రా. శే: అంతే అప్పన్నా...అంతే....

(నేపథ్యంలో కోడికూత-వీణపై భూపాలరాగపు గీట్లు, ఉషస్సును సూచించే సంగీతం...)

# అన్యాపదేశము: భల్లటుడు

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

"సహోదరాః కుంకుమ కేసరాణామ్
భవంతి నూనం కవితావిలాసాః,
న శారదాదేశ మపాస్య దృష్టః
తేషాం యదన్యత్ర మయా ప్రరోహః."

కుంకుమ కేసరముతో పాటు కవితావిలాసమునకు కూడ శారదాదేశమే (కాశ్మీరము) జన్మభూమి అన్నాడు బిల్హణకవి—తన విక్రమాంకదేవ చరిత్రములో. బిల్హణ, మల్హణాది కవివతంసులే కాక, ఆనందవర్ధన, అభినవగుప్తాది ప్రముఖాలంకారికులను కూడ ప్రసవించి, శారదాదేశమని అన్వర్థనామము పొందిన పవిత్రభూమి కాశ్మీరము. అక్కడ జన్మించిన ఉత్తమ సంస్కృతకవుల పరంపరలోనివాడు భల్లటుడు.

కాశ్మీరరాజన్య చరిత్ర రాజతరంగిణిలో అవంతి వర్మ తరువాత క్రీ. శ. 883 నుంచి 902 వరకు ఆదేశము నేలిన శంకరవర్మ పరిపాలనను కల్హణ కవి ఇట్లు వర్ణించెను :

'త్యాగభీరుతయా తస్మిన్
గుణిసంగ పరాఙ్ముఖే,
అసేవం తావరావృత్తీః
కవయో భల్లటాదయః."

ధన వ్యయమవలసివచ్చునను భయముతో గుణవంతుల యెడ శంకరవర్మ పరాఙ్ముఖుడగుటవలన భల్లటాది సత్కవులనేకులు రాజపోషణలేక, ఉదరపోషణకు హీనవృత్తుల నవలంబింపవలసివచ్చెనట! భల్లటకవి శంకరవర్మ సమకాలికుడని, 9 వ శతాబ్ది చివరను, 10 వ శతాబ్ది మొదటను ఆయన జీవించెనని దీనినిబట్టి స్పష్టమగుచున్నది.

భల్లటుడు వ్రాసినది భల్లటశతక మొక్కటే కనిపించుచున్నది. ఇది అన్యాపదేశ శతకము. మనస్తత్త్వసంబంధములైన నిత్యసత్యములను, సర్వజనోపాదేయములైన ఉత్తమనీతులను అన్యాపదేశముగా, వ్యంగ్యముగా ఈ శతకము బోధించును. మానవుల ప్రవర్తనలోని వక్రతలను వ్యంగ్యముగా పరిహసించు ఈ కావ్యమే భారతీయ సాహిత్యములో మొట్టమొదటి 'వ్యంగ్యపరిహాసరచన (Satire)' అని చెప్పవచ్చును.

కృపణజనసేవ నిరర్థకమను సత్యమును, బాహ్యాకర్షణకు మోసపోయి కృపణులను సేవింపరాదను ఉపదేశమును చమత్కారముగా ఒక 'చిలుక—బూరుగు చెట్టు' వృత్తాంతవ్యపదేశముతో ఈ శతక మిట్లు బోధించును.

"విశాలం శాల్మల్యా
నయనసుభగం వీక్ష్య కుసుమమ్
శుకస్యాసీద్ బుద్ధిః
ఫలమపి భవే దస్య సదృశమ్,
ఇతి ధ్యాత్వోపాస్తం
ఫలమపి చ దైవాత్ పరిణతమ్
విపాకే తూలోఽన్తః
సపది మరుతా సోఽప్యపహృతః."
(బూరుగుచెట్టుపూలు మన
మున్ హరియించుచు, చిత్రవర్ణతన్
మీర, ఫలమ్ములున్ తనను
మేయములౌను, మనోహరమ్ములై
తీరు నటంచు దాని వస
తిం గొని చిల్కయొకండు; పండ్లలో
నారయ దూది యయ్యె తుది;
నద్దియు హా! హృతమయ్యె గాలిచే!)

పూలసొగసు చూచి బూరుగుచెట్టు నాశ్రయించి; తుదకు విఫలమనోరథ అయిన చిలుక వృత్తాంతమే ఇచట వాచ్యమైనను, ఈ అప్రస్తుతవస్తువర్ణనముద్వారా, సారూప్యవశమున — బింబప్రతిబింబభావముతో — ప్రస్తుతమైన 'కృపణజనాశ్రయణము నిరర్థకము' అను సత్యము గమ్యమానమగుచున్నది. అయినను—ఇక్కడ వ్యంగ్యార్థముకన్న వాచ్యార్థమే ఎక్కువ ఆకర్షకముగా తోచుచుండుటవలన ఇది అప్రస్తుతప్రశంసాలంకారమే యగునుగాని, వస్తుధ్వని కుదాహరణము కాజాలదు. వ్యంగ్యార్థము వాచ్యార్థమును మించి చమత్కారమైనప్పుడే ఒక కావ్యము ధ్వనికోటిచెందునని

ఆలంకారికమతము. వస్తుధ్వనికి లక్ష్యభూతములైన శ్లోకములుగూడ భల్లట శతకములో అనేక మున్నవి. ఉదాహరణమునకు :

"అంతః పూర్ణో ధ్వనతి మహతే
నోపకారాయ యస్మాత్
కాలే ప్రాప్తే క ఇవ న యయు
ర్యాంతి యాస్యంతి వాఽఽస్తమ్,
ఏతావత్తు వ్యథయతి తరామ్
లోకబాహ్యైస్తమోభిః
తస్మిన్నేవ ప్రకృతి మహతి
వ్యోమ్ని లబ్ధోఽవకాశః"
(భానుడు క్రుంక బిట్టు వగ
వన్ పనిలేదు; జగమ్ములోన కా
లానకు నోచు అస్తమయ
మందని వాడొకరుండు కల్గునే?
కాని, రవిప్రకాశ సువి
కస్వర మా వియదంగణమ్మిటుల్
హీన తమస్సమాక్రమణ
కీకుటయే వ్యథగూర్చు మాటికిన్ !)

ఇక్కడకూడ సారూప్యవశముననే అప్రస్తుతమైన సూర్యునకు, చీకట్లకు సంబంధించిన వాచ్యార్థమునుండి 'ధర్మపరుడైన ఒక మహాపురుషు డవతరించి, అతని స్థానే జనకంటకుడైనవ్యక్తి అధికారమునకు వచ్చుట శోచ్యము' అను ప్రస్తుతార్థము గమ్యమానమగుచున్నది. ఇక్కడ వాచ్యార్థముచే విభూషితమగుచు వ్యంగ్యార్థమే అధిక చమత్కారముగ స్ఫురించుచుండుటచే దీనిని ధ్వనిస్థలముగ గణింపవచ్చును.

ఉత్తమనీతులను, శాశ్వతసత్యములను ఒక వంక వ్యంగ్యముచేయుచు, మరొకవంక తనకాలమునాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులనుగూడ భల్లటకవి తన శ్లోకాలలో ధ్వనింపచేసెను. 'అంతః పూర్ణః' అను పై శ్లోకములో—ధర్మప్రభువు అవంతివర్మ పరమపదించి, అతని స్థానములో క్రూరుడు, కుటిలుడు అయిన శంకరవర్మ రాజయినకథయే కవి సమకాలికులకు స్ఫురించియుండును. 'సూర్యుడు—చీకటి', 'సూర్యుడు—మిణుగురుపురుగు' వంటి ఇట్టి అప్రస్తుతాంశముల వర్ణనద్వారా అవంతివర్మ, శంకరవర్మల తారతమ్యమును మరి 7, 8 శ్లోకాలలోకూడ ఈకవి వ్యంగ్యముచేసెను.

అవంతివర్మ జనరంజకుడైన మహారాజు. రాజతరంగిణి కర్త కల్హణు డాయనను మాంధాతతోను, ఆయన పరిపాలనకాలమును కృతయుగముతోను పోల్చినాడు. ఆనందవర్ధన, రత్నాకర, శివస్వామి, ముక్తాకణాది ఉద్దండకవిపండితుల నెందరినో పోషించిన విద్వత్ప్రభువాయన. క్రీ. శ. 883 లో ఆయన పరమపదించగానే సింహాసనముకొరకు రాజకుమారుల మధ్య కలహ మారంభమయినది. కుత్సితులలో కుత్సితుడు శంకరవర్మ అందరిని నిర్జించి. తాను గద్దె ఎక్కినాడు. అతడు చేయని దుష్కృత్యములేదు. దేవాలయాల ఆస్తులను కొల్లగొన్నాడు, తన విలాసముల కోసమై ప్రజలను పీడించి పన్నులు వసూలుచేసినాడు, అయోగ్యుల నందరను తన చుట్టును చేర్చుకొని, యోగ్యులకు, ధర్మపరులకు జీవితము దుర్భరముచేసినాడు. అతని పాలనను రాజతరంగిణిలో కల్హణు డిట్లు వర్ణించెను :

"నిర్వేతనా స్సుకవయః
భాటికో లవటస్త్వభూత్,
ప్రసాదాత్తస్య దీనార
సహస్రద్వయ వేతనః.
కల్పపాలకులే జన్మ
తత్రైవ ప్రమాణితామ్,
శిక్షోచితాపభ్రంశోక్తేః
దైవీ వాగస్య నాభవత్"

సుకవులకు వేతనాలు లేవు. లవటుడను అల్పుడొకడు రాజానుగ్రహము పొంది, నెలకు రెండువేల దీనారముల జీతముమీద కోశాధికారిగా నియుక్తుడయ్యెను. వాడు పుట్టినది కల్లుగీసికొని జీవించు గొల్లకులములో. అపభ్రంశ భాషకు అలవాటుపడిన ఆ లవటునికి సంస్కృతము అంటక పోవుటే వాని కులమును వ్యక్తముచేయుచున్నది.

అర్హతవలన కాక, కేవలము అదృష్టమువలన ఉన్నతపదవులు పొందిన లవటునివంటి అల్పులను పరిహసించుచు 10,15 శ్లోకములు భల్లటశతకములో ఉన్నవి. ఒకటి :

"యే జాత్యా లఘవః సదైవ గణనం
యాతా నయే కుత్రచిత్
పద్భ్యామేవ విమర్దితాః ప్రతిదినం
భూమా నిలీనా శ్చ యే,
ఉత్ క్షిప్తా శ్చపలాశయేన మరుతా
పశ్యాంతరిక్షేఽద్య తా
శృంగాణా ముపరిస్థితిం క్షితిభృతాం
కుర్వ న్త్యమీ పాంసవః."

# అన్యాపదేశము : భల్లటుడు

(ఘనములు జాతిచే, గణన
రాశికి రా వొకనాడు కొందు; పా
దఘన విమర్దితమ్ములయి
ధాత్రి నిలీనత నందు నిత్యః; మా
విఘటిత పాంసులే చపల
వృత్తి సదాగతి చేత మింటి కె
త్తిగబడి నేడు మాడుడదె.
తత్ క్షితిభృత్ శిఖరాలి (ప్రాకెసెన్!)

భూమిలో అణగి ఉండబోసిన ధూళికణములు, చపలాశయుడైన ఒక గాలి సాహాయ్యమున అంతరిక్షమున కెగిరి, గిరిశిఖరముల నధిరోహించిన ట్లున్నదట - లవటునివంటి అన్యాల ఉన్నతోద్యోగప్రాప్తి! మరొక శ్లోకములో—నిర్జనమైన ఒక ప్రాంతలో మాటలేకుండ పడిఉన్న పెరుగుకుండను చూచి, తల నిక్కించుట మొదలైన వికారచేష్టలు చేయు ఏకాక్షీ అను కాకిని వర్ణించి లవటునివంటి వారిని భల్లటుడు పరిహసించెను. ఆ లవటుడుకూడ బహుశః ఏకాక్షియే నేమో! ఇంకొక శ్లోకములో—'కుక్కకు జూలు అంటించగలముగాని, అది సింహమువలె గర్జించునట్లు చేయగలమా?' అనెను.

రాజతరంగణిలో ఉన్న కొద్ది అంశములు తప్ప ఆనాటి కాశ్మీరదేశపు పరిస్థితులు వివరముగా మనకు తెలియవు. తెలిసినచో భల్లటుని ప్రతిశ్లోకము వెనుకను నాటి కాశ్మీరదేశపు సాంఘిక, రాజకీయ జీవితములోని ప్రముఖాంశ మేదో ఇమిడి ఉన్నట్లు స్పష్టము కాగలదని నా నమ్మకము. కేవలము ఏవో నీతులను బోధించుటకై వ్రాసినట్లు కాక, భల్లటశతకములోని ప్రతిశ్లోకము ఆనాటి దుర్భరపరిస్థితులలో నిరాశోపహతుడై క్రుంగిపోయిన ఒక ప్రౌఢకవి గుండెదూసికొనివచ్చిన ఒక వేడి నిట్టూర్పువలె అనిపించును. అంతటి కటువైన జీవితానుభవములో ప్రేళ్ళుపాతుకొని ఉండకపోయినచో భల్లటుని భావనలలోగాని, భావప్రకటనములోగాని అంతశక్తి వ్యక్తమగుట అసంభవము!

అభినవగుప్తుడు, మహిమభట్టు, క్షేమేంద్రుడు, మమ్మటుడు మొదలైన ప్రసిద్ధాలంకారికు లెందరో భల్లటుని శ్లోకములను లక్ష్యములుగా ఇచ్చినారు. ధ్వన్యాలోకకర్త ఆనందవర్ధనుడుకూడ 'పరార్థే యః పీడా మనుభవతి' అను భల్లటశ్లోకమును రెండుచోట్ల ఉదాహరించెను. కాని, అది భల్లటుని శ్లోకమని ఆయన పేర్కొనలేదు. అంతేకాక "అమీ యే దృశ్యన్తే" అను మరొక శ్లోకమును స్వకీయముగ కూడ ఆయన ఉదాహరించెను. శార్ఙ్గధరపద్ధతి, సూక్తిముక్తావళి అను సూక్తిసంగ్రహములు 'పరార్థే యః పీడా మనుభవతి' అను శ్లోకము ఇందురాజరచిత మన్నవి. సుభాషితావళి, సాహూక్తిరత్నామృతము వేరువేరుకవుల కీ శ్లోకము నంటగట్టినవి. ఈ విధముగ భల్లటశతకములోని 16, 12 శ్లోకములు సంకలితగ్రంథాలలోను, అలంకారగ్రంథాలలోను అన్యకర్తృకములుగా పేర్కొనబడుట జరిగినది. సుమారు 50 శ్లోకాలు వివిధగ్రంథాలలో స్పష్టముగా భల్లటుని పేరుతోనే ఉదాహరింపబడినవి. కవిపేరు లేకుండ ఉదాహృతములయినవి 20 శ్లోకాల వరకు ఉన్నవి. భల్లటశతకములోని కొన్ని శ్లోకముల కర్తృత్వము విషయమై ఇట్టి సందిగ్ధస్థితి ఏర్పడుట చూడగా—చాటువులుగా ఈ కవి చెప్పిన శ్లోకములు అతని జీవితకాలములో గ్రంథస్థము కాక, అతని అనంతరము ఒకటి రెండు శతాబ్దములు గడచిన తరువాతనే గ్రంథస్థము లయినట్లు తోచుచున్నది.

భల్లటుని కవితాశైలి సరళమైనదికాదు. కనీసము 20 శ్లోకములలో అయినను అన్వయక్లిష్టత కనిపించుచున్నది. అయినను, సువ్యంజకములయిన పదములువాడి, తానుద్దేశించిన వ్యంగ్యమును స్ఫుటముగ స్ఫురింపజేయు నేర్పు భల్లటునికి గలదు. కృత్యాదిలో అట్టి నేర్పుపట్ల తనకుగల విశేషాదరమును ఆయన ప్రకటించెను.

"బద్ధానుసర్పణ రసేన విమర్దపూర్వ
మర్థాన్ కథం ఝటితి తాన్ ప్రకృతాన్ న దద్యుః,
చోరా ఇవాతిమృదవో మహతాం కవీనామ్
అర్థాంతరా ణ్యపి హఠా ద్వితరన్తి శబ్దాః."

(అతిమృదువున్ ప్రశస్తము మ
హాకవి వాఙ్నిచయమ్ము చోరసం
తతివలె వేర అర్థము
దాయము నైతము బల్మి వ్యక్తమా
గతి నొనరించునన్న, మును
గా ప్రయతించి యదర్థబోధనా
మతి కవివాడునో ప్రకృత
మైన తదర్థ మొసంగు టబ్రమే!

చోరులవలె మహాకవి ప్రయుక్తశబ్దములు కూడ బాగుగ మర్దితములైనచో ప్రకృతార్థములనే కాక అర్థాంతరములను గూడ సమర్పించునని శ్లేషించి, తన

కవిత అంతయు వ్యంగ్యార్థపరముగుటను ఈ శ్లోకములో భల్లటుడు సూచించెను. అతిశయోక్తి ఈ కవికి గిట్టదు. లేనిపోని కల్పనలతో వస్తు నిజస్థితి నెఱుగలేని అవివేకుల నితడు పరిహసించెను.

"కాచో మణి ర్మణిః కాచో
యేషాం తేఽన్యే హి దేహినః,
సన్తి తే సుధియో యేషాం
కాచః కాచో మణి ర్మణిః."

(రాలు రతనమ్ములుగ మేలి రతనములను
రాలుగా నెంచువానికి ప్రణతిశతము,
రాలు రాలుగ రతనముల్ రతనములుగ
గాంచు నతడె సుకృతి ఈ జగమ్ములోన!)

భల్లట శతకములోని శ్లోకములన్నియు అన్యాపదేశములు కావు. పై శ్లోకములో అన్యాపదేశము చెప్ప నక్కరలేదు. ఇట్టివి మరికొన్ని శ్లోకములు కూడ ఉన్నవి. శృంగారపరములయిన శ్లోకములు కూడ ఒకటి రెండు ఈ శతకమున చేరినవి. ఒక విరహిణి విరహవేదనను వర్ణించు ఈ శ్లోకము ఆస్వాదింపదగినది.

"వాతా వాన్తు కదంబరేణుశబలా
నృత్యన్తు సర్పద్విషః
సోత్సాహా నవవారిభారగురవో
ముఞ్చన్తు నాదం ఘనాః,
మగ్నాం కాన్తవియోగదుఃఖజలధౌ
మాం వీక్ష్య దీనాననాం
విద్యుత్! కిం స్ఫురసి త్వమప్యకరుణా
స్త్రీత్వేఽపి తుల్యే సతి."

(పొలయును గాక మేల్ కడిమి
పుప్పొడితో పవనుండు; నాట్యముల్
సలుపును గాక బర్హిపతి;
సాగును గాక పయోదరాజ గ
ర్జలు; తటిదంగనా! విరహ
సాగర మగ్నను నన్ను జూచి సా
టి లలనవయ్యు ఈ మెరయు
టేలని నీవును నిర్దయాత్మవై?)

'వాత', 'సర్పద్విట్', 'ఘన' శబ్దముల పుంలింగమును, 'విద్యుత్' శబ్ద స్త్రీలింగమును ఆధారముగ గొని విరహిణి మనస్స్థితిని భల్లటు డీశ్లోకములో సరసముగ చిత్రించెను.

వాక్ స్వాతంత్ర్యము కరువై, సూటిగా మణిని మణి అని, గాజు పెంకును గాజు పెంకు అని చెప్పి నిభాయించుకొనివచ్చుటకు వీలులేని రోజులలో పుట్టిన ఒక దురదృష్టవంతుడైన కవి భల్లటుడు. అన్యాపదేశముగ చాటువు లల్లుకొనుట తప్ప అతనికి గత్యంతరము లేకపోయినది. ఆ నాడును సందర్భానుసారముగ అధికారులకు, బలవంతులకు వంతపాటపాడిన కవిబ్రువు లనేకు లుండవచ్చును. కాని, వారి ఊరును, పేరును మనకు తెలియవు. అట్టివారితో గొంతుకలుపక, ఆత్మగౌరవముతో అజ్ఞాతవాసము చేసి, అత్యల్పసంఖ్యలో నే శ్లోకములు తన తరువాతితరములవారికి దిగవిడిచి పోయిన భల్లటకవిమాత్రము సంస్కృతసాహిత్య చరిత్రలో శాశ్వతమైన స్థానము పొందినాడు. అన్యాపదేశకావ్యరచనకు అంకురార్పణచేయుటయే కాక, ఆ రచనామార్గములో పరాకోటిని ప్రాపించిన వాడగుటచే భల్లటుని కీర్తి చిరస్థాయి అయినది.

చాతకములు, కొంగలు, హంసలు, సరస్సులు, మేఘములు, సముద్రము, ఒంటె, చెరుకుగడ, శంఖము, సింహము, కుక్క, పాము, ధూళి, గాలి-ఇట్టి సాధారణవిషయములతో మహోదాత్తసత్యముల నుద్బోధించిన మహాకవి భల్లటుడు. అందుచేతనే కాళిదాస, భవభూత్యాది ప్రథమశ్రేణి కవుల పరంపరలో ఇతడు స్మరింపబడినాడు.

"మాఘ, శ్చోరో, మయూరో, మురరిపు, రపరో
భారవి స్సారవిద్యః
శ్రీహర్షః, కాళిదాసః, కవి, రథ భవభూ
త్యాదయో, భోజరాజః,
శ్రీదండీ, డిండిమాఖ్యః, శ్రుతిముకుటగురు
ర్భల్లటో, భట్టబాణః,
ఖ్యాతా శ్చాన్యే సుబంధ్వాదయ ఇహ కృతిభి
ర్విశ్వ మాహ్లాదయన్తి."

# శ్రీ సత్యసాయి బాబా

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

శ్రీ సత్య సాయిబాబానుగురించి మీ అభిప్రాయం ఏమిటి? - అని పలువురు ప్రశ్నిస్తారు; నేను తెల్లపోతాను కాని అంతలోనే సంబాళించుకొని — "స్వయంగా దర్శనం చేసుకోండి, మీకు మీకే అర్థం చేసుకోండి" అని వారికి విన్నవిస్తాను.

"పరమహంసవంటివారా? లేక రమణమహర్షి వంటివారా?" అని మరి కొందరడుగుతారు. "సత్య సాయిబాబా సత్యసాయివంటివారు" అని వారికి ప్రత్యుత్తరం చెపాను.



పుట్టపర్తిలో - ఇది అనంతపురంజిల్లా పెనుకొండ తాలూకాలో ఉన్నది - శ్రీ సత్యనారాయణ అనే బాలుడు అపుడపుడు దాగలించినపుడు శ్రీకృష్ణుని వదన కుహరంలో యశోదాదులు బ్రహ్మాండాలు చూచి నట్టులు కొందరు రామకృష్ణావతారాలు చూచి — ఇతడు దేవబాలుడు అని అనుకొన్నారు! కొందరితడు పిశాచగ్రస్తుడు అని అనుకొన్నారు. అపుడితడు తోడి బాలురచేత సంకీర్తనం చేయించుట మారంభించాడు. అపుడు తోడివారికి పుష్ప ఫల ఖాద్యాదులను సృష్టించి ఇస్తూ వుండేవాడు. "ఇవన్నీ ఎట్లా వస్తున్నవి?" అని అడిగితే—"నాలో ఒక ముసలాయన వున్నాడు, ఆయన ఇస్తున్నాడు" అని చెప్పేవాడు. ఈ రీతిగా లీలలు చూపుతూ చూపుతూ బలవంతాన ఉరవకొండలో ఫోర్త్ ఫారం చదువుతూ చదువుతూ సుమారు పద్నాల్గు ఏండ్లప్పుడు (20 అక్టో—'40) చల్లకు వచ్చి ముంతి దాచడం ఎందుకని—"నేను సాయిని, నేను సాయిని; నే వచ్చిన పనికి నే పోతాను" అని బడితో పాటు ఇల్లుకూడా వదలి—

మానస భజరే గురుచరణమ్,
దుస్తర భవసాగర తరణమ్.

అనే సంకీర్తనతో ఈ సాయి తన మహిమలు సహస్రముఖాల చూపడం మొదలు పెట్టాడు. పూర్వ సాయిచరిత్ర (విని వ్రాసినది కాబట్టి పూర్ణప్రమాణం కాకపోయినా) చదివినవారు, మరి సాక్షాత్తు ఎరిగిన వారు, ఈ సాయి మహిమలు చూస్తే ఈ ఉభయులూ, సంసారుల తాపత్రయం పోగొట్టడానికి వచ్చిన ఏక తత్త్వమని గ్రహిస్తున్నారు.

అందరకూ అందుబాటులోని దివ్య శక్తిని బోధిస్తారు. అఖండ గోష్ఠులు భజన చేయిస్తారు. పుస్తకాలు చదివినట్లు అంతరార్థాలను చదివేస్తారు. ఆధివ్యాధిని పోగొట్టుతున్నారు. ఇష్టదేవతా విగ్రహాలను స్వర్ణమై దూర్వాంగులను అమృతాది రసాయనాలను స్వాస్థ్యమైన ఖాద్యాలను దివ్యమైన భోజనాలను,—ఒక్కటేమిటి—సంకల్పమాత్రాన తాను తలచిన వస్తువాన్ని సృజించి యివ్వడమే కాదు—మరి తిమ్మని బమ్మనిగాను బమ్మని తిమ్మనిగాను చేసివేయడం కలదు. నిర్యాణకాలంలో ఏకకాలాన అనేక దేశాలలో ఆపద్గ్రస్తులకు శిష్యుల సన్నిధిస్తున్నారు. దూరశ్రవణజ్ఞానాది యోగవిభూతులు వీరికి వెన్నతో పెట్టినవి. వీరిమహిమలను చెప్పదలచినస్తే వ్యాసుడు నారదుడు శుకుడుకూడా పనికిరారు. ఈ తత్త్వము మహిమలకు పుట్టినిధి.

ఇది అందరకూ అందుబాటులోనున్నా అందరాని తత్త్వం. వీరు మిగిలిన భక్తులయూ జ్ఞానులయూ పరిపాకం ఇందున్నా ఇది అందరకున్నా విజాతీయం. దీనికి సహస్రముఖాలు ఉన్నవి. నీలో ముఖం కనుక్కొంటే నాలో ముఖం కనబడుతుంది. దీనికి కవిసంత నాలు; సుర్ధి లేదు. ఇది ఎంతవరకూ అంత అతీంద్రియం. జగత్తులో తల్లులందర ప్రేమ కలిపినా ప్రేమమయమైన ఈ తత్త్వానికి సరిరాదు.

ఈ తత్త్వం పుట్టపర్తిలో పుట్టినా పుట్టినకోట. తెలుగు నాడులో అవతరించినా ప్రపంచానికి వెలుగు. మానవమో మరి అమానవమో! ఇది నమ్మనివారి కనువు. శుద్ధభక్తికి సులభం. పాండితికి పరీక్ష. అందుకూ శ్రీరామరక్ష.

కవీశ్వర హృదీశ్వరో విబుధ పంకజాహస్కరో
మునీశ్వర మనోహర స్సకల హృద్గుహాభాస్కరః,
పవీపత దళీకృతీ సురధునీ మహామోహినీ
ఫణీశ్వర వచోభరో జయతి సాయివాగీశ్వరః.

సాయి మహానుభావుడను సంగతి పల్లె రెటింగియున్న దా
సాయియె సత్యసాయి యన చల్లని మూర్తిగ పుట్టపర్తిలో
కాయము దాల్చె నన్నదియు ఖాయము, కాని, యెఱుంగువారు నా
రాయణుడో మహేశుడో హిరణ్మయపూరుషుడో వచింతురే!

కరుణామూర్తి యటంద్రు కొందఱు నినున్, గాలించి లోలో నహం
స్ఫురణామూర్తి యటంచు గొందఱు మదిం బూజింతు, రింకొంద ఱం
దురు యోగీశ్వరు డంచు నిందు నిజ మేదో యన్నియు న్నిక్కమో
యెఱుగ న్నేరము నీవ చెప్పవలె సాయీ! జ్ఞానసూపత్రయా!

ఏ యద్వైత సుఖానుభూతికయి నే నీక్షింతునో దానికిన్
మాయోపాయము లెన్నియో తెలిసియుండంబోలు నీకుగాక, యా
నీయం దారసి విశ్వరూపము నొగి న్నీభక్తు లొందంగలా
రా యద్వైతము ద్వైతమో మఱి విశిష్టాద్వైతమో తెల్పుదే?

కనులార నిన్ను గాంచం
గనినంతన శరణు జెంది కనుదోయికి నిం

## శ్రీ సత్యసాయి బాబా

గగనరాశి నీ వెలుంగా
వననిధి మునుంగుదురు నీదు భక్తశ్రేణుల్.

పిలిచినం బలికెడి దైవము
కలదా యని సందియంబు కలిగిన మొదలన్
బిలిచి పరీక్షింపుండు! మీ
పిలుపు హృదంతరమునుండి వెడలంగవలయున్.

ఉరిమి మబ్బులు వర్షింప నోలలాడు
చేలు లన్నియుం బ్రాయేలు చేరునటులు
కవుల మదినుండి పొంగు సత్కావ్యరసము
లెల్ల రసరూపుండగు సాయియందు కలియు.

చివరకు నాకవిత్వ మది చెల్లరె నాలుగె యక్షరాలుగా
మిగిలె, రసంబు లన్నిటను మేలి రసంబున కాలవాలమ
య్యవి యెవి? 'సత్యసాయి'యను నట్టివి, అయ్యవిగూడ రెండవై
మిగిలెడి 'సాయి, సాయి'యని; మిక్కిలి వర్ణము లెల్ల చూర్ణముల్.

'రసో వై స' ఇతి బ్రూతే తిత్తిరి శ్ఛందసాం గిరిః,
శివరామ స్త్వను బ్రూతే సాయినం తస్య విగ్రహమ్.*

---

* ఇవి ఇటీవల దసరాపండుగలో జరిగిన కవిసమ్మేళనంలో నేను బాబాగారికి సమర్పించినవి.

# విడిపోతున్న రెండు సంస్కృతులు

శ్రీ మైకేల్ పొలాన్యీ

సర్ ఛార్లెస్ స్నో శాస్త్రానికీ సంస్కృతికీ మధ్య ఉన్న విభేదం శోచనీయమని భావిస్తున్నారు. నేనూ ఒప్పుకుంటాను. కాని ఈ సమస్య విషయంలో నా దృక్పథమే వేరు. మన తక్కిన మనోవ్యాపారాలపైన శాస్త్రప్రభావం తక్కువకాదని నా అభిప్రాయం. నిజం చెప్పాలంటే, నేను మానవుల బుద్ధిపైన శాస్త్రానికంటే అధికారం సముగ్రమయినది. నేటి సంస్కృతిలో ఫ్రాయిడ్, మార్క్సుల ప్రభావంలేని భాగాలు చాలా తక్కువ. వారిద్దరి ప్రబోధనలూ శాస్త్రంపైన ఆధారపడినవే. కాని ఈ ప్రబోధనలూ "రొమాంటిక్" (కాల్పనిక), "యుటిలిటేరియన్" (ప్రయోజనవాదు)లు అనే పెద్ద ప్రవాహంలో జనియించిన రెండు చిన్న పాయలు. అసలు ఈ "రొమాంటిక్"లకూ, "యుటిలిటేరియన్"లకూ కూడా కారణమైనవారు న్యూటన్ ప్రతిపాదనలవల్ల ఉత్తేజితులైన విజ్ఞాన వికాసకాలపు చింతకులే.

శాస్త్రము ప్రాముఖ్యము వహింపక మునుపే గ్రీకుల సమాలోచన హేతు ప్రాధాన్యంగానే ఉండేది. ఈ సంప్రదాయం శతాబ్దాలుగా పరంపరగా వస్తూనే ఉన్నది. కాని 17 వ శతాబ్దపు శాస్త్రమే ఆధునిక హేతుప్రాధాన్యవాదానికి హేతుభూతము. "ఫ్రెంచి ప్రజలందరూ ఒకరోజు బోసుయే లాగ ఆలోచించేవారు. ఆ మర్నాడు వోల్టైర్ లాగ ఆలోచించారు." అని పాల్ హాజార్డ్ వ్రాశారు.

ఇది అతిశయోక్తి అయినప్పటికీ మొత్తానికి సత్యదూరం మాత్రం కాదు. క్రీస్తు ముఖ్యశిష్యుల తరువాత మూడు శతాబ్దాలలోనూ క్రైస్తవమతం ఏవిధంగా పెంపొందిందో అదేవిధంగా 'రాయల్ సొసైటీ' స్థాపించిన మూడువందల ఏళ్ళలో విజ్ఞాన శాస్త్రమే (మానసికంగా) అగ్రస్థానం ఆక్రమించింది. 17 వ శతాబ్దంలో, "ఇది మతానికి వ్యతిరేకం!" అంటే, 20 వ శతాబ్దంలో, "ఇది శాస్త్రీయంగా లేదు!" అంటారు.

మన సంస్కృతిమధ్య శాస్త్రంమధ్య పెద్ద ఎడం ఏర్పడినదని ఒప్పుకున్నప్పటికీ ఈ ఎడం కేవలం కొంతమంది సాహిత్యక్షేత్రలలో శాస్త్ర విషయాలకు సంబంధించిన అజ్ఞానంవల్ల ఏర్పడినదని నేను నమ్మటం లేదు. ఎంతమంది శాస్త్రజ్ఞులకు తాము ప్రత్యేకంగా కృషి చేస్తున్న శాస్త్రంలోతప్ప తక్కిన వాటిలోని విషయాలు తెలుసు? ఇటువంటి అజ్ఞానం మన శాస్త్రాభివృద్ధికి ముఖ్య కారణమయిన 'నీకీపని నాకీపని' అనే విభాగానికి స్వాభావికమయినది.

ఈ విభజన మన సంస్కృతి అభివృద్ధికి కూడ చాలా అవసరం. మన సంస్కృతి అతివిస్తారమయినది; ఒక్క మనుష్యుని మెదడులో ఇమడనిది. అందుచేతనే ఆయా శాస్త్రవిభాగాల్లో నిష్ణాతులైన అనేకులు (దానిని ప్రసరింపజేయ్యడానికి) కావాలి. ఈ నిష్ణాతవర్గం లేకపోతే పాతపుస్తకాలను వివరించే వారె పండితులవుతారు. మన సంస్కృతి నాశనమయిపోయి దానిబదులు లోకమంతా ప్రాథమిక పాండిత్యం ఏర్పడుతుంది.

మన కర్తవ్యము ఆయా శాస్త్రవిభాగాల్లో నిష్ణాతులయ్యే పద్ధతిని ఆపటం కాదు; జ్ఞానపరిణామాలకు మధ్య సమ్మేళనము సంపాదించటం. ఇక్కడే నాకొక అనుమానం కలుగుతోంది. ఇక్కడే శాస్త్ర సంస్కృతుల మధ్య కల్లోలము మొదలుపెడుతోందని అనిపిస్తోంది. ఈ కల్లోలానికి కారణమేమిటో పరిశీలించి చూడాలి.

మధ్యకాల సిద్ధాంతాలపైన (Medieval thought) ఆధునిక శాస్త్రప్రభావమే ఈ కారణమని నా అభిప్రాయం. శాస్త్రము అధికారాన్ని సహించదు. కార్యకారణసంబంధములేని సిద్ధాంతాలను త్రోసివేసి అనుభవైక ప్రామాణ్యాలనే స్వీకరించింది. చిట్టచివరకు ఈ విశ్వనిర్మాణానికొక యాంత్రికమైన సిద్ధాంతాన్ని సాధించాలని నిశ్చయించింది. కాని మానవుల సాంఘిక, నైతిక, ధర్మాల విషయంలో మాత్రం నైసర్గికమైన వివరణకే ప్రయత్నించింది.

ఈ ధ్యేయాలవల్ల శాస్త్రానికి ప్రకృతిపైన ఏర్పడిన అధికారము విపరీతంగా పెరిగిపోయింది. నైతికమైన ఉద్రేకాలను మత ప్రభావంనుంచి తప్పించి దాదాపు ప్రతి మానవసంబంధాన్నీ బాగుచేసింది. సర్వోదయధర్మాలు

అంతకుముందు తాము ఒంటరివారమని గాని, అనామకులమని గాని భావించిన ప్రజలలో పరస్పరాభివృద్ధిపైన ఆసక్తి కలిగించాయి. ఒక్క మాటలో చెప్పాలంటే శాస్త్రీయమైన హేతుప్రాధాన్యవాదం మన ప్రస్తుతపు మానసిక, నైతిక, సాంఘిక పురోగమనానికి కారణం.

కాని హేతుప్రాధాన్యవాదం అర్థంలేనిదని రుజువుచేయటం చాలా సులభం. సంప్రదాయం ఇవ్వగలిగిన అధికారం లేకపోతే మన బుద్ధి పనిచేయనేలేదు. అసలు భాష వాడుకకు సంప్రదాయమే ఆధారం. అనుభవసిద్ధమయిన అభ్యూహాలవల్ల మనం జ్ఞానం సంపాదించలేము. ఈవిశ్వనిర్మాణానికి కారణం ఏదో నిశ్చితమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించాలనుకోవటం అర్థములేనిది. అంటే అనిశ్చిత సిద్ధాంత సూత్రంతో దీనికేదో సంబంధం ఉందని కాదు. ఈ విశ్వంలోని పరమాణు స్థానాలన్నిటిని తెలుసుకోవాలని ఎవ్వరూ ఆశించరు. నీతిని నైసర్గికంగా వివరిస్తే మానవులకు అసలు బాధ్యతే ఉండదు. ఇదికూడా అర్థంలేనిది. మిథ్యాదర్శాలవైపు దూరంనుంచి చూస్తున్నంత కాలం శాస్త్రీయమైన హేతుప్రాధాన్యవాదం ఉపయోగపడింది. కాని ఇది ఎంతో కాలం ఉండలేదు. చివరకు తన ఆశయాలలోని సత్యం సన్నగిల్లిపోయేటప్పటికి స్వభావసిద్ధమైన అసంగతి, అనుపపత్తిపై చేయి చేసుకోక తప్పిందికాదు. 20 వ శతాబ్దంలో ఇదే జరిగింది. శాస్త్రీయమైన ప్రగతి విశ్వాసము మన సంస్కృతిని ఆక్రమించటమే కాక అసత్యమైన తన ఆశయాలను బలవంతంగా శాస్త్రానికి అంటగడుతోంది. ఇంద్రియాలను గురించిగాని, వాటి వ్యాపారాలను గురించిగాని మాట్లాడినప్పుడు హేతువిద్య (Teleology) బారి పడిపోతామో అన్నట్లు ప్రవర్తిస్తారు. ఇటువంటి భావాల ప్రభావంనుండి తప్పించుకొనేందుకు చివరకు అన్నీ భౌతిక, రసాయన, శాస్త్రాలకు లొంగుతాయని అంటారు. చైతన్యమనే భావనవల్ల ఏర్పడ్డ సమస్యలన్నిటిని ఈవిధంగా పరిష్కరిస్తారు.

“చైతన్యమనేది కేవలం అనుమానం, ప్రత్యక్షమైనది కాదు” (Helb) “చైతన్యమనే భావన లేకుండా గడపవచ్చు కాని నిజంగా అటువంటిది ఏమీ లేదు.” (Kubie) “ప్రమాత ఉన్నాడనుకోవటం కేవలం అనవసరమైన ప్రతిపాదన.” (Lashley)

శాస్త్రము వృత్తిగా భావించి యిటువంటి ప్రతిపాదన అంగీకరించడం వారి వృత్తికి అత్యవసరమైనదిగా ఒప్పుకుంటారు. సిరాశాస్త్రజ్ఞులకు (Neurologist) చైతన్యాచైతన్యాలమధ్య విభేదము తెలుసు — ఈ విభేదం లేదని వాదించడానికి కారణం ఉన్నది. వారి ప్రస్తుతజ్ఞానంతో దీనిని వివరించలేరు కనక లేనట్లు ప్రవర్తించటమే మంచిదనుకుంటారు. నిజం చెప్పాలంటే ఈ మూఢవిశ్వాసాన్ని కాదన్న శాస్త్రజ్ఞుల్ని అందరు హేయభావంతో చూస్తారు. ఈ మూఢవిశ్వాసాల ప్రభావం పరిణామ సిద్ధాంతంపైన చాలావరకు ఉన్నది. పరిణామ సిద్ధాంతవాది సాధారణంగా ఇలా వాదిస్తారు — చైతన్యం ఉపయోగకరమై యుండాలి. లేకపోతే ఇన్నాళ్ళు ఎందుకో నశించకుండా ఉంటుంది. కాని ప్రతి అనుభవవ్యాపారము భౌతిక, రసాయన శాస్త్రాలకు లొంగియుంటుంది కాబట్టి చైతన్యమనేది సజీవమైన దేహాన్ని కదలించలేదని తీర్మానిస్తారు. అంటే యిది నిరర్థకమైనదంటారన్నమాట. ఈ సమస్య పరిష్కారం కోసం చాలా గ్రంథాలు తిరగవేశాము. కాని లాభం లేకపోయింది. ఇటువంటి సమస్యలను ఎదుర్కొనడానికి ప్రయత్నిస్తే శాస్త్రజ్ఞులనే తమపరువు పోతుందని వారికి తెలుసు.

ఇటువంటి ఉదాహరణల నెన్నో వివరించవచ్చు. కాని యింతవరకు శాస్త్రప్రయోజనాలకోసం సత్యాన్ని నిరసించటంచేత శాస్త్రానికి హాని యింకా కలగలేదని నేను నమ్ముతున్నాను. ఏదెట్లా ఉన్నా ఈ వ్యాసంలో నా ఉద్దేశ్యం, సంస్కృతిపైన శాస్త్రప్రభావాన్ని వివరించటం, కొన్ని శాస్త్రీయమైన ఆశయాలకోసం నిజాన్ని నిర్లక్ష్యం చేయటంవలన కలిగిన హానిని వర్ణించటం.

ఈ పరిణామక్రమం చాలా దారులు త్రొక్కింది. మళ్ళీ ఫ్రాయిడ్, మార్క్సులను ఉదాహరణలుగా తీసుకొందాం. వారి సిద్ధాంతాలు 18 వ శతాబ్దపు సంప్రదాయాలను సమాంతరంగా మార్చివేశాయి. విజ్ఞానవికాసయుగం ప్రకారం మానవుని నైతికవిధి ప్రకృతిలోనే యిమిడివుంటుంది, ‘రూసో’ అనాగరిక మానవుడే ఉత్తముడని భావించారు. ఉత్కృష్టమైన భావాలు స్వతస్సిద్ధంగా గొప్పవని ప్రతిపాదించారు. సర్వశక్తి, అవశ్యప్రవృత్తి, విశేషమైన వ్యక్తిత్వం, గౌరవించదగినవన్నారు. ఇంతకంటే యాంత్రికమైన సిద్ధాంతాన్ని బెంథామ్ (Bentham) హెల్వెషి

స (Helvetius)లు బోధించారు. మనుష్యులను వలము వాంఛాపూరితులుగా చిత్రించారు.

రూసో అనాగరిక మానవుడివలనే ఫ్రాయిడ్ కామ ప్రవృత్తిని (Libido) సమాజం అదుపులో ఉంచు ంది. కాని దానికి ఉత్కృష్టమైన గుణాలేవీ లేవు. కపోగా నీతిబాహ్యంగా కామప్రవృత్తిని అణగ ద్రొక్కుతూ ఉంటుంది. ఈనిగ్రహం అనారోగ్యకర మవది కనుక గర్హనీయమైనదని వారి అభిప్రాయం. ఈ ప్రతిపాదనలలో ధర్మాధర్మాలకు తావులేదు. ఆరోగ్యానారోగ్యాలయి ఉంటాయి. బెంత్ హామ్ నుంచి మార్క్స్ వరకు ఉన్న సమాంతర గమనము ంకు భిన్నమైన సాంఘికవర్గాలవల్ల నిర్ణయింపబడింది. ధర్మము ఇష్టానిష్టాలపైన ఉపయోగము యొక్క విజయమువల్ల సాధింపబడదు. ఒకవర్గంపైన మరొకవర్గం జయించటమే ధర్మసాధన-అనే ఊహ ప్రబలమవుతోంది. కార్మికవర్గ విజయమే ధర్మం. అంటే అంతవరకు ఒక నైతిక నియమంగా ఉన్న నిసర్గవాదము నైతికమైన నాస్తికసిద్ధాంతంగా మారిపోయింది.

అయినా, ఈ అవిశ్వాసము ఆధునిక వైఖరియొక్క ముఖ్యగుణంమాత్రం కాదు. ఎందుచేతనంటే పూర్వయుగంనుంచి అవిశ్వాసము, దానివల్ల ఏర్పడే సుఖైక పురుషార్థవాదం(Hedonism). దురాచారము (Libertinism) మొదలైనవి ఇప్పుడెంత ప్రబలంగా వ్యాపించియున్నాయో అప్పుడూ ఉన్నాయి. ముఖ్యమైన మార్పు ఏమిటంటే ఈ నైతికావిశ్వాసము నైతికమైన క్రోధంతో కలవటం. అసంగతమైన ఈ రెండు వైఖరులు కలవటంవల్లనే ఆధునిక శూన్యవాదం ఏర్పడుతుంది. 19 వ శతాబ్దపు మధ్యలోని రష్యన్ విప్లవకారులు ఆధునిక శూన్యవాదం స్థాపించారు. వీరు ఒకవైపు నిశ్చలమైన పారమార్థిక తత్వనిరాకరణవాదులైనా వీరిలోనే మరొకవైపు ధర్మనిష్ఠ, కాల్పనికపక్షపాతంకల ఆవేశాలు ప్రజ్వలిస్తు ఉండేవి. వారిశూన్యవాదానికి, నైతికమైన అవిశ్వాసానికి సంబంధము లేదు. అన్యాయాన్ని ఖండించటానికి అవిశ్వాసాన్ని ఉపయోగించుకొన్నారు. హేతువాదంవల్ల ఏర్పడిన రెండు మానసిక శక్తులను ఏకం చేశారు. ఈ శక్తు లేమిటంటే శాస్త్రీయమైన వాస్తవికత, సాంఘిక పునర్నిర్మాణాసక్తిని. మన ఆధునిక తీవ్ర-అవిశ్వాసవాదం (Sceptico-fanaticism) ఈ విధంగా ఏర్పడింది. ఇది విరాళి చెందిన ఆదర్శవాదంవల్ల; మతిభ్రష్టత పొందిన శాస్త్ర మమకార యాంత్రికవ్యవస్థలవల్ల నిర్జీవమైన ఆదర్శవాదం.

ఈ శతాబ్దములో జరిగిన అమానుషచర్యలు అప్రేరితమైనవి కావు. వీటికారణం అవిశ్వాసంవల్ల బలహీనమైన నీతి కాదు ఈబీభత్సకృత్యాలకు కారణమైనశక్తి వేరు. అవిశ్వాసమువల్ల నిర్దాక్షిణ్యమైన బలమొక్కటే సరియైన రాజకీయనీతి అని నమ్మిన నైతికఆవేశాలే ఈ శక్తులు.

నాట్సిజమ్ విషయంలో కూడ ఈవాదం ప్రవర్తిస్తుంది. ఎందుచేతనంటే నాట్సిజమ్, జర్మన్ కాల్పనిక శూన్యవాదంలోనుంచి జన్మించింది. ఈ శూన్యవాదం జర్మన్ యువోద్యమము (Jugend bewegung)లో ప్రతిబింబించింది. మంచితనం కపటమైనదని, నిర్దాక్షిణ్యమే నిష్కపటమైనదని ఈవాదం స్వీకరించినవారు నమ్మేవారు. మార్క్స్ సామ్యవాదపు ఊహా ప్రపంచాన్ని (Socialist Utopia) ఏవిధంగా శాస్త్రీయం చేశాడో అదేవిధంగా జాతీయాభిమానాన్ని నాట్సిజమ్ నిర్దాక్షిణ్యంగా చేసివేసింది.

మానజాతిపేర పాపకృత్యాల నెంతవరకు చేయగలుగుతామో, ఎంతవరకు ఖండించకుండా వుంటామో అంత ధర్మాభిమానం కలవారమని ఆధునిక విప్లవకారులు నమ్ముతున్నారు. అంతర్వర్తియైన (Immanent) ధర్మానికి ప్రత్యక్షమైన అధర్మప్రవర్తన ప్రమాణంగా స్వీకరించారు. కాని ఈ నైతిక విపర్యయం ఎంతో కాలం ఆగదు. ఎప్పుడో ఒకసారి దానిధాటికి తట్టుకోలేక సత్యదూరము కాని మానవాశయాల పునర్వ్యవస్థీకరణానికి ప్రయత్నిస్తారు. అప్పుడే వరమాయని వెల్లువనుగురించి వింటాము.

కాని విప్లవయుతమైన ధర్మాన్ని వదిలి సాధారణ ధర్మాన్ని ఆశ్రయించేవారు ఇంకా తనువిపర్యయంలోనే అధికమైన ధర్మాభిమానం ఉన్నదనుకొంటారు. ఒకవిధంగా ఇది సరియైననమ్మకం. కార్యసాధనము కోరటంత ఉత్సాహములేనివారే ఈ విపర్యయానికి గురికాకుండా ఉండిపోతారు.

అందువల్ల మనము మనుష్యులను ఉదారస్వభావము కలవారనికాని, నీచస్వభావము కలవారనికాని స్పష్టంగాచెప్పలేము. పాన్న రేపటికోసం పనిచేయుదాం (Jamtomarrow)మనుష్యులలోని ఉదారస్వభావాన్ని కదలిస్తుందని వ్రాసినపుడు అతనే ధర్మాన్ని ఉద్దేశించాడో తెలుసుకోవాలి-అంటే "అంతర్వర్తియైనదా"

# విడిపోతున్న రెండు సంస్కృతులు

లేక "ప్రత్యక్షమైనదా" అని. ఒకదాని ప్రమాణాల దృష్టిలో అత్యుత్కృష్టమైనది రెండవదాని ప్రమాణాలదృష్ట్యా అసహ్యాకరంగా ఉంటుంది.

మానవ సమాజాన్ని భేదించటంలో, కుటుంబాలను విడకొట్టడంలో, స్నేహాలను చెడకొట్టటంలో ఈ ప్రమాణాలకు సంబంధించిన అసమ్మతిని మించినవి ఏవీ లేవు. "అసలు చరిత్రలో ఎప్పుడైనా మతద్వేషాలవల్ల హాని కల్గినదంటే అది 20వ శతాబ్దములోనే" అని పెల్లిక్ వ్రాశాడు. కాని యింకా మనం ప్రమాదాన్నుంచి తప్పుకోలేదు. పరిస్థితులు ఎంత బాగుపడినా సాంప్రదాయిక విప్లవ శక్తుల మధ్య ఒడంబడిక కుదరలేదు. ఏటంబాంబులున్నంత కాలం ప్రమాదం ఉన్నదనే చెప్పాలి.

ఈ శతాబ్దములో శాస్త్రీయమైన హేతువాదం ఒకవైపు ప్రజాజీవితాన్ని చెడగొట్టినా లలితకళల విషయంలో మాత్రం క్రొత్త దారులను చూపించింది. డోస్తాయేవ్‌స్కీనుంచి ప్రారంభమైన ఆధునిక రచయితల పరంపర ధర్మభూయిష్ఠమైన సత్యాన్వేషణలో శూన్యవాదపు అంచులవరకు వెళ్ళింది. కొన్ని సమయాలలో ఈ అన్వేషణ నిరాశకు కారణమైనప్పటికి మొత్తానికి మన శతాబ్దపు ధర్మవైఖరిని యింకా ఉత్కృష్టంగా చేసి క్రొత్త ధర్మానికి పునాదులు వేసింది.

దీనికి సమాంతరమైన అన్వేషణ ఇంకొకటున్నది. ఇది కళలలోని శిల్పప్రమాణాల మధ్య ఏర్పడిన కల్లోలాన్ని పరీక్షించింది. ఇది కొన్ని సమయాలలో పిచ్చి పిచ్చి వైఖరులకు తెన్నులకు దారితీసినా, మొత్తానికి ఎదుగుమూడనివాటినే కనిపెట్టింది. మనలోనే అణగియున్న స్పందనాలను బైటకు తీసింది. కథానివేదనాన్ని అసంగతంగా చేయటంచేత సర్‌రియలిజమ్ ఏమిటో తెలిసింది.

అసలింతకముందే అంత తీవ్రం గాని ఉద్యమము ఒకటి ప్రారంభమైంది. ప్రస్తుతము మనం చూస్తున్నది దాని పరంపరలలోనిదే. ఇంప్రెషనిజమ్ అనే ఉద్యమము 1860 ప్రాంతాలలో ప్రారంభమైంది. ఈ ఉద్యమముయొక్క ఉద్దేశ్యము అప్పుడు ప్రబలంగా ఉన్న రియలిజమ్, సెంటిమెంటలిజమ్‌ల బారినుండి కళను రక్షించి సజీవంగా చేయడం. ఇంతకుముందు ఇటువంటి ఉద్యమా లెప్పుడూ ఒక చీకటియుగం లేకుండా జన్మించలేదని నా అభిప్రాయం.

ఇటీవల యూరోప్, అమెరికాలలో పెద్ద మార్పు గమనించవచ్చు. 1950 నుంచి సాంఘికమైన ఉత్సాహము (Social zeel) నశించిపోతోంది. పాశ్చాత్య దేశాలలో ఈ మార్పువలన ఆశయాలు దల్లబడి సాధ్యమైన ఉపాయాల మీదకు దృష్టి పోయింది. రష్యాలోను, కొన్ని కమ్యూనిస్టు దేశాలలోను నైతిక విపర్యయంపైన అసహ్యం కలిగింది. పోలాండ్‌లో కమ్యూనిష్టు మేధావులలో ఈ తిరుగుబాటు చాలావరకు వెళ్ళింది. వీలుంటే 'హంగేరి'లో నివరవరకు వెళ్ళేదే. ఈ రెండు దేశాలలోను నైతికంగా తలక్రిందులైనవారు తిరిగి సరిగ్గా నుంచున్నారు. చరిత్రలో ఇటువంటిదెప్పుడూ జరగలేదు.

దీనికి సంబంధించిన ఉద్యమము మేధావులలో ఒకటి జన్మించింది. దీనినే సోవియట్ ప్రభుత్వం "రివిజనిజమ్" అని ఖండించింది. దీనివల్ల అంతవరకు శూన్యవాద పరిశోధనకు దారిచూపిన విజ్ఞానము ఇంకొకరకంగా వ్యాఖ్యానించటం సరిపాటయింది. అందుకనే తన "The sane society" అనే గ్రంథంలో ఎరిక్ ఫ్రామ్ ఫ్రాయిడ్, మార్క్సులను గురించి ప్రస్తావిస్తూ ఇలా వ్రాశాడు: "మానసికంగా ఆరోగ్యవంతులైన మనుష్యుని లక్షణాలు ప్రేమ, భక్తి, వివేకం; అటువంటివాడు తన ప్రాణాన్నే కాక తనతోటి మానవుల ప్రాణాలనూ గౌరవభావంతో చూస్తాడు." ఇటువంటి పరిస్థితి ఒకవిధమైన మానవతావాదంపై ఆధారపడిన గ్రామసోషలిజం (Humanistick Communitarien Socialism) ఏర్పరుస్తుందని ఈయన నమ్మకం.

స్పష్టమైన వాదవేది లేకపోయిన పాశ్చాత్య దేశాలలో జరుగుతున్న పునర్విమర్శవాదం(రివిజనిజమ్) సోవియట్ దేశాలలో జరుగుతున్న దానివంటిదే. ఎదురుతిరిగిన కమ్యూనిస్టులు జాతీయవాదులైనట్లు గ్రహించి ప్రజలు డీగాల్ వైపు మొగ్గారు.

శాస్త్రానికి, సంస్కృతికి మధ్యనున్న సంబంధాన్ని ఈ సందర్భంలో పరిశీలించాలని నా దృఢ విశ్వాసము. ఇంకా శాస్త్రానికి బుద్ధిపైన అధికారము ఉన్నది. కాని దేశభక్తి, మతము, నీతి మొదలైన వాటిని ఏవిధముగాను మునుపటికంటె బలపరచలేదు. రసాయనశాస్త్రపరీక్షద్వారా గాని మైక్రోస్కోప్ ద్వారా పరీక్షించిగాని అబద్ధం చెప్పిన మనిషిని దుష్టునిగా నిరూపించలేము. అందుకనే శాస్త్రీయమైన హేతువాదప్రభావాన్ని రద్దుచేయలేము. క్రొత్త దృక్పథం ఏర్పరుచుకోవాలంటే అధికారం ఎంతవరకు ఉన్నదో పరీక్షించి చూడాలి. మన మొదటి కర్తవ్యం జీవశాస్త్రాలను, నీతిశాస్త్రాన్ని, భౌతికశాస్త్రాధికారినుంచి తొలగించాలి. ప్రస్తుతం ఈ శాస్త్రంపైన అంటగట్టిన అవకతవకలను ఖండించాలి.

('ఎన్‌కౌంటర్' నుంచి)

# భారతంలోని స్త్రీ పాత్రలు: అంబ

శ్రీమతి పి. సత్యవతీ దేవి

పంచమ వేదంగా ప్రఖ్యాతి చెందినది మహాభారతం. అట్టి భారత బృహత్కథను నడిపి, ఆ రచనకు పటిమ చేకూర్చిన పురుష పాత్రలతో తులతూగగలవారు అందలి స్త్రీ పాత్రలు. వారిలో విలక్షణం, విశిష్టం అయిన పాత్రను నిర్వహించిన మహిళ అంబ. ఆమె జీవితం భారతకథా కాలంనాటి సాంఘిక జీవనంలో స్త్రీలకుగల స్థానాన్ని సుస్పష్టం చేస్తున్న మణిదర్పణం.

అంబ కాశీరాజు జ్యేష్ఠతనయ. కాశీరాజు తన కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలకు యుక్త వయస్సు రాగానే దేశకాలానుసారంగా, క్షత్రియకులోచితంగా 'స్వయంవరం' ప్రకటిస్తాడు. ఆ వార్త విని నేల నాలుగు చెరగులనుండి రాజాధిరాజులంతా చతురంగబలసమేతంగా తరలివస్తారు. సంప్రాప్త యౌవనుడైన విచిత్రవీర్యునికి వివాహం చేయగోరి, తాను ఆజన్మ బ్రహ్మచర్య వ్రతధారి అయినప్పటికీ తల్లి అనుమతితో స్వయంవర మహోత్సవానికి సన్నద్ధుడై, ఏకరథుడై వస్తాడు భీష్ముడు. భారతదేశంలోని రాజన్యులలో మూర్ధన్యుడుగా కీర్తినొందిన భీష్ముని రాక వీర్యశుల్కలైన కన్యల వరింపవచ్చిన వీరులందరికీ ఆశాభంగం కల్గిస్తుంది. ఆజన్మ బ్రహ్మచర్య వ్రతధారి అని చేసిన ప్రతిజ్ఞను పాలించక పెండ్లి చేసుకొనబోతున్నాడని కొందరు రాజులు పరిహాసిస్తే, వయస్సాంతర్యమైనా పరిగణించలేదని మరికొందరు హేళన చేస్తారు. ఆ పరిహాసానికి క్రుద్ధుడైన భీష్ముడు పట్టుదలగా తానే స్వయంగా ఆ కన్యలను వరిస్తాడు. పరాక్రమ విజితలైన ఆ కన్యలను తన రథాసీనలగావించి, సౌహార్ద్రభావంతో, పుత్రికా వాత్సల్యంతో తోడ్కొని వచ్చి తల్లికి అప్పగిస్తాడు.

హస్తినాపురిలో ఆ కన్యలను విచిత్రవీర్యునికిచ్చి అతివైభవంగా వివాహం జరుపనున్న సమయంలో అంబ దానికి తన అభ్యంతరం తెలియచేస్తుంది. తాను ఇదివరకే సౌంభపురవల్లభుడైన సాల్వపతిని వరించాననీ, అతడు కూడా తన్ను వరించినవాడనుట తన రాకకై నిరీక్షిస్తూ ఉంటాడనీ, ధర్మజ్ఞుడవైన నీవు సాల్వరాజు సన్నిధికి నన్ను పంపవలసిందనీ వేడుకుంటుంది. ఆమె అభీష్టాన్ని భీష్ముని తల్లి సత్యవతితోను, తనమంత్రి పురోహిత ఋత్విజాదులతోను చెప్పి, విచిత్రవీర్యునకు కూడ ఆమె అన్యాసక్త అనే విషయం స్పష్టపరుస్తాడు. ధర్మజ్ఞుల నిర్ణయాన్ననుసరించి, తనవారి అనుమతిపొంది అంబను గౌరవపురస్సరంగా సాల్వుని కడకు పంపుతాడు ధర్మపరతంత్రుడైన భీష్ముడు.

అంబ రక్షకజన పరిపాలితయై సాల్వరాజు సన్నిధికి చేరి 'అభినందస్వ మాం రాజన్ సదా ప్రియహితే రతామ్' అంటుంది; త్రికరణశుద్ధిగా నిన్నే వరించి వచ్చానంటుంది. స్వయంవరానికి పూర్వమే నిన్ను వరించినదాననగుటవల్ల భీష్ముని కడనుండి నీ సన్నిధికి చేరుకున్నానంటుంది. ఆమె విన్నపాలను సాల్వుడు పెడచెవిని పెట్టి, ఆమెను స్వీకరించలేనంటాడు. పృథివీపతులందరి సమక్షాన భీష్మ పరిగృహీతవైన నిన్ను స్వీకరించడంకంటె నాకు అవమానం ఉండబోదంటాడు. దైవకృపవల్ల నీదగ్గరకు వచ్చిన నన్ను ధర్మదృష్టితో అనుగ్రహించమని అంబ అతనిపట్ల తనకుగల గాఢానురాగం వ్యక్తంచేస్తుంది. కాని, వీరుడైన భీష్మునికి భయపడుతున్నానని, నీవు అతనినే ఆశ్రయించడం నీకు, నాకు శ్రేయోదాయకమనీ సాల్వుడు అంటాడు.

'భజస్వ మాం విశాలాక్ష
స్వయం కన్యా ముపస్థితాం,
అనన్యపూర్వాం రాజేంద్ర
త్వత్ప్రసాదాభికాంక్షిణీం.'

అంటూ అంబ తన నిష్కళంకమైన ప్రేమను గౌరవించి, సాహసోపేతమైన తన అనురాగాన్ని అన్యథా భావించక నీ భక్తురాలినైన నన్ను పరిత్యజించడం ధర్మంకాదని ప్రార్థిస్తుంది. కాని ప్రజాపాలకుడనైన నేను నిన్ను స్వీకరించడమే ధర్మవిరుద్ధమని సాల్వుడు అంబను తిరస్కరిస్తాడు. సాల్వుని ప్రేమకోసం అంబ ఏ సంఘాన్ని అలక్ష్యంచేసిందో ఆ సంఘంకోసమే సాల్వుడు అంబ ప్రేమను తిరస్కరిస్తాడు. ఒకనాడు అంబను ప్రేమించి ఆమెను వివాహమాడగోరి స్వయంవరానికి వచ్చిన సాల్వుడు ఆమె తనుగా వచ్చి అతని ప్రేమను అర్థించినపుడు అంగీకరించలేకపోతాడు. ఆనాడు స్వయంవర యుద్ధంలో భాగీరథి కొడుకుచేత విమానితుడైన సాల్వుడు ఆమెను స్వీకరించి సంఘంలో నవ్వులపాలు కావడంకంటె ఆమెను వదిలించుకోవడమే

# భారతంలోని స్త్రీ పాత్రలు : అంబ

మంచిదని భావించి, ఆమెను చులకనచేసి పొమ్మంటాడు. అవమాన భారయై, భగ్నహృదయురాలై అంబ తిరిగి భీష్ముని సన్నిధికి వస్తుంది. సాహసంతో నన్ను వరించావు కనుక నీవే నాకు భర్తవు కమ్మంటుంది. తాను వివాహానికి విముఖుణ్ణని, అన్యాసక్త అయిన కన్యను తన తమ్మునకు భార్యను చేయడంకూడ అసంభవమని భీష్ముడంటాడు. తాను వలచిన సాల్వుడు, తన్ను గెల్చిన భీష్ముడు ఇద్దరూ దూరమైన అంబను 'నిశ్చక్రామ పురాద్దీనా రుదతీ కురరీయథా' అని వర్ణిస్తాడు వ్యాసర్షి.

పృథ్వీలో మరి యే యువతి కనీ వినీ యెరుగని దుస్థితిని అంబ నాటి సంఘ జీవితంలో అనుభవిస్తుంది. తన దుస్థితికి తనతండ్రి, భీష్ముడు, సాల్వుడు, 'పతిలేని స్త్రీకి గతిలేదు' అనే నాటి సంఘం కారణమని అంబ భావిస్తుంది. తన అభిమానానికి విలువ నివ్వక వీర్యశుల్కగా ప్రకటించిన తండ్రి, తన తమ్మునికై తనను స్వయంవరంలో జయించిన బ్రహ్మచారి భీష్ముడు, ప్రేమవిలువ గుర్తించలేని సాల్వుడు, నాటి సంఘ జీవితంలో తన స్త్రీ గౌరవాన్ని కాపాడలేని ఆప్తులు బంధువులు అంతా దోషులుగా ఆమె మనో నేత్రం ముందు గోచరిస్తారు. స్వయంవర సమయంలోనే భీష్ముని ఒప్పించి, తాను సాల్వుని చేరకపోవడం తన తప్పిదంగా ఆత్మదూషణ చేసుకుంటుంది. ఉత్తమురాలైన నాకిట్టి విపరీతపరిస్థితికి విధి వైపరీత్యమే కారణమని ధాతను నిందిస్తుంది.

'సర్వథా భాగధేయాని స్వాని ప్రాప్నోతి మానవః' అనేది పెద్దలమాట. కాని తానుమాత్రం ఇతరులు తన జీవితంలో ప్రవేశించి చేస్తున్న దుష్కార్యాలకు దుష్ఫలితాన్ననుభవిస్తున్నట్లు వ్యథచెంది విలపిస్తుంది. తన అశాంత చిత్తానికి, అవమాన పరితప్త హృదయానికి కొంత ప్రశాంతిని చేకూర్చుకొనగోరి హిమాలయ పర్వతప్రాంతంచేరి, బాహుదానదీతీరాన తాపసజీవనం కొనసాగిస్తుంది. తన తపోమహిమవల్ల కొంతకాలానికి అమరసేనాపతి కుమారస్వామి అనుగ్రహాన్ని సంపాదించగల్గుతుంది. కుమారస్వామి ప్రత్యక్షమై ఒకమాలను అనుగ్రహించి, దీనిని ధరించిన నీవు భీష్ముని జయించగలవని వరమిస్తాడు. అంతటితో కొంత ఊరటచెంది తన ఆశయసిద్ధికి తగిన రాజాశ్రయానికై అన్వేషణ సాగిస్తుంది. తుదకు సత్యవ్రతపరాయణుడు, పాంచాలరాజవరేణ్యుడు అయిన సోమకుని శరణువేడుతుంది. ఆ రాజేంద్రునికి తనగాథ వినిపించి, తన స్థితికి భీష్ముడే కారకుడని, నీ ఆశ్రయం లభించిన నాకు శత్రుభీతి గాని, పరాజయం కాని ఉండదు కనుక ప్రసన్నుడవై నాకు రక్షకుడవు కమ్మని ప్రార్థిస్తుంది. సహృదయుడు సోమకుడు యథాశక్తిని ధర్మపాలనం చేస్తానంటాడు. క్షత్రియులకు ప్రభుత, బలము ధర్మాచరణవల్లనే లభిస్తాయి కనుక ధర్మవాదిని అయిన నీవు భీష్మునికి భయపడవలదని అభయమిస్తాడు. తర్వాత సోమకుడు అంబను భీష్మునిపట్ల ప్రసన్నను చేయడానికి ప్రయత్నిస్తాడు. భీష్ముడు సాధుపుంగవుడు. సజ్జనుడు. అతనితో నీకు వైరంతగదని హితవు చెబుతాడు. అంబ తన వర ప్రసాదమైన మాలను ధరించి భీష్ముని సమరంలో జయిస్తానంటుంది. భీష్మ పరాజయమే కర్తవ్యంగా అరణ్యాలు గడిచి తాపసుల ఆశ్రమ ప్రాంతాలకు చేరి వారి ఆశ్రయం అర్థిస్తుంది. దుఃఖభారంతో ఆర్తురాలై వచ్చిన అంబకు శరణ్యాక గురువు శైఖావత్యుడు ఆశ్రయమిస్తాడు. అంబ అక్కడ జన్మాంతర సంపాదిత పాపఫలితాలను పరిహరించుకోడానికి; మరొక జన్మలో ఇట్టి దుస్థితికి తావులేకుండా చేసుకోడానికి తప మాచరిస్తానంటుంది. అదే సమయంలో అక్కడకు విచ్చేసిన అంబ మాతామహుడు హోత్రవాహన మహర్షి ఆమె చరిత్ర విని పరితపించి, తల్లిదండ్రుల బాధ్యత తానే స్వీకరించి, ఆమెకు రక్షగా ఉంటానంటూ ఆమెకు ధైర్యం చెబుతాడు. ఆమె విషయంగా పరశురాముని అనుచరుడైన అకృతవ్రణ మహర్షితో సంప్రదిస్తాడు. అంతా భీష్ముడే శిక్షార్హుడని నిర్ణయించి, తేజోమూర్తి అయిన పరశురామునితో కూడా అంబ విషయం చెప్తారు. అంబ అంజలి ఘటించి పరశురామునికి పాదాభివందనం చేసి తన దుఃఖగాథ వినిపిస్తుంది. బాష్పవ్యాకుల లోచనయై శరణు పొందిన అంబ దుఃఖానికి కరుణాతరంగిత హృదయుడై అభయమిస్తాడు పరశురాముడు. కాని భీష్మునితో వైరం తగదని ఆమెకు నచ్చచెప్ప ప్రయత్నిస్తాడు. అంబ తన లక్ష్యం విడదు. పరశురాముని ప్రార్థించి, ప్రాధేయపడి, ప్రోత్సహించి యుద్ధానికి ప్రేరేపిస్తుంది. అకృతవ్రణ, హోత్రవాహనాదులు ఆమె మనోరథం నెరవేర్చమని పరశురామునికి విజ్ఞప్తి చేస్తారు. అంతట పరశురాముడు అంబతోను, తదితర శిష్యబృందంతోను కురుక్షేత్రం చేరుకొని, భీష్మునికి తన ఆగమనవార్త తెలియచేస్తాడు. భీష్ముడు గురుదేవుని కెదురేగి అర్ఘ్యపాద్యాదికం నెరవేరుస్తాడు. ఆ తరుణంలో భార్గవుడు అంబను స్వీకరించమని భీష్మునికి ఆదేశిస్తాడు. భీష్ముడు సవినయంగా అంబా పరిత్యాగానికి గల కారణాలను గురువుకు నివేదిస్తాడు. క్రమంగా గురు శిష్యులిద్దరూ అంబ కారణంగా వివాదం పెంచుకొని, యుద్ధానికి సిద్ధపడతారు. వీరి మధ్య యుద్ధం నివారించడానికి గంగచేసిన యత్నం విఫలమై భీకర యుద్ధం చెలరేగుతుంది. ఇరువది

నాలుగురోజుల పాటు జరిగిన యుద్ధాన్ని తిలకించి, అక్కడ చేరిన తాపసులంతా ఇరువురూ సమబలులు, అజేయులు అని గ్రహించి వారిని యుద్ధవిరమణకు ఒప్పిస్తారు. "అవధ్యో హి త్వయా భీష్మ స్త్వంచ భీష్మస్య భార్గవ!" అని ఇద్దరికీ సామరస్యం కూర్చి యుద్ధవిముఖులను చేస్తారు. యుద్ధానంతరం భక్తివినమ్రుడైన భీష్మునితో "యుద్ధేనస్మిన్ తోషితోహం భృశం త్వయా" అని ప్రీతుడైన శిష్యుని అభినందిస్తాడు పరశురాముడు. అంబతో "భీష్మమేవ ప్రపద్యస్వ న తే న్యా విద్యతే గతిః" అంటూ భీష్ముని శరణాగతి పొందమంటాడు.

రాజసం, క్షాత్రం రాశిగా కూర్చిన స్త్రీ అంబ పరశురాముని అశక్తతకు నొచ్చుకుంటూనే, అంతవరకు తనపట్ల చూపిన శ్రద్ధాసక్తులకు కృతజ్ఞత వ్యక్తం చేసుకుంటుంది. కాని భీష్ముని ఆశ్రయించడం అనేది ఎప్పుడూ జరగబోదనీ, అతనిని యుద్ధంలో తానే పరాజితుణ్ణి చేస్తానని ప్రతిజ్ఞ చేస్తుంది. కోప బాష్పవ్యాకులలోచనయై ఆ చోటు వీడిపోతుంది.

తన సంకల్పసిద్ధికై అంబ ఆచరించిన తపస్సు అతిమానుషమైనది. పన్నెండు సంవత్సరాల దీర్ఘకాలం తపమాచరించి, అనేక మున్యాశ్రమాలు సందర్శించి, అనేక పుణ్యతీర్థాలు సేవించి తనువు పునీతం చేసుకుంటుంది. ఆ సమయంలో గంగ అంబను ఆమె తపోదీక్షకు కారణం ఏమిటని ప్రశ్నిస్తుంది. 'భీష్మవినాశం కోరి తపమాచరిస్తున్నాను. వరమనుగ్రహించ'మంటుంది అంబ తన ధోరణే తనదిగా. ఆమె మూర్ఖతకు విచారించి, కుటిల, దుస్తీర్థ అయిన నదివి కమ్మని అంబను శపిస్తుంది గంగ. ఆ మాతృమూర్తి శాపఫలితంగా వత్సభూములలో అంబ తన పేరనే నదియై ప్రసిద్ధి చెందుతుంది. తన తపఃప్రభావంవల్ల అర్ధదేహంతో నదియై, మిగిలిన దేహార్ధంతో కన్యగా తపోదీక్ష కొనసాగించగలుగుతుంది. అనేకమంది తాపసులు ఆమెను తపశ్చర్యనుండి మరల్చడానికి వ్యర్థప్రయత్నాలు చేస్తారు. వారికి జవాబుగా 'భీష్మతిరస్కృతినంది, పతిసర్మానికిదూరమై శాశ్వత దుఃఖాన్ననుభవిస్తున్న నాకు భీష్మపరాజయమే జీవితలక్ష్యం. అదే నా దీక్ష. అదే నా తపస్సులోగల స్వార్థం' అంటుంది. "పతిలోకాద్విహీనా చ నైవ స్త్రీ న పుమానిహ" అంటూ తన వ్యర్థజీవితాన్ని తలుచుకొని పొందే మానసిక క్షోభను వ్యక్తం చేస్తుంది. సంఘనియమాలచే బంధనాలలో చిక్కిన స్త్రీజీవితమంటేనే అసహ్యించుకుంటుంది; స్వేచ్ఛాయుతమైన పురుష జీవితాన్ని కోరుకుంటుంది.

అంబ తపస్సుతో పరమశివుని మెప్పించి, ప్రత్యక్షం చేసుకుంటుంది. అతనినుండి భీష్మపరాజయం వరంగా కోరుకుంటుంది. ద్రుపదునింట శిఖండి నామంతో విఖ్యాతిచెంది విజయం పొందగలవని వరమిస్తాడు శివుడు. తక్షణమే రోషదీప్త చేతస్సుతో అంబ అగ్నిప్రవేశం చేస్తుంది.

అంబకై పూనివచ్చి, బలాధికుడైన పరశురాముడు సాధించలేని భీష్ముని, "ఆ శౌర్యం బా సత్వం బా శీలం బా పరాక్రమాభిత్వం బా శుద్ధవ్రతము అనాశముల"ని కౌరవబలం నమ్మిన భీష్ముని శిఖండిగా జన్మించి, చండశక్తితో ఎదిర్చి సాధించిన శక్తిస్వరూపిణి అంబ; తన జీవిత చరిత్రతో మహాభారతేతిహాసానికి తావిని కూర్చిన భారతీయకన్య అంబ.

సాంఘిక చైతన్యానికి, మానవ సంస్కృతికి శాస్త్రంలా కథోపన్యాసాలు చెయ్యడం కంటె కావ్యసృష్టి శక్తివంతమైనదని నమ్మినవాడు వ్యాసుడు. సంఘంలో అధర్మం, అక్రమం పెచ్చుపెరిగినప్పుడు దానిని నిర్మొహమాటంగా, నిష్పక్షపాతంగా బట్టబయలుచేసి, ఆ సంఘంచేతనే 'ఓహో!' అనిపించి, మానవసంఘాన్ని ధర్మపథంలో నడపగల మహత్తర శక్తి కవితకు ఉంది. కనుకనే సాంఘిక దౌర్జన్యానికి గురియైన అంబ ప్రేమను అమర ప్రేమగా చిత్రించి, ఆమె వ్యక్తిగతమైన ద్వేషానికి, ప్రతీకారానికి సాంఘిక ధర్మసంస్థాపనమే పర్యవసానంగా నిరూపించి, ఆమె కన్నీటి గాథకు విశ్వజనీనత సంపాదించాడు వ్యాసర్షి.

తన సాఫల్యంతో దుర్విధిని గెల్చి, దైవాన్ని వశం చేసుకొని, ధర్మపక్షాన నిల్చి, అధర్మాన్ని ఎదిరించిన అంబను వ్యాసుడు తానాశించిన విశ్వశాంతికి ఒక సాధనంగా ఉపయోగించుకుంటాడు. స్త్రీ పట్ల తనకు గల గౌరవ ప్రపత్తులను వెల్లడిస్తాడు.

అంబవంటి ప్రేమ తపస్వినికి నాటి సంఘమిచ్చిన ప్రతిఫలం 'భగ్నహృదయం.' ఇది కవి హృదయాన్ని కరిగిస్తుంది. నిజానికి అంబ 'నాకు జన్మజన్మాలకు సాల్వుడే పతి కావాల'ని తపస్సుచేసి, వరాన్ని పొందినట్లు, వ్యాసుడు ఆమె స్వార్థనిరతిని ప్రదర్శించవచ్చు. కాని వ్యాసుడు ఆశించింది ఆమె ప్రేమ సాఫల్యం కాదు. హృదయవిదారకమైనది ఆమె భగ్నజీవితం. దానికి హేతువయిన అక్రమాన్ని, అన్యాయాన్ని, ఎదుర్కొనగల మహోజ్జ్వల మూర్తినిగా అంబను చిత్రించడం.

అంబ విషాద జీవితం భగ్నహృదయులు ఆత్మహత్యలకు పాల్పడ నక్కరలేదనీ, తమ అమూల్యమయిన మానవజీవితాన్ని సత్కార్యాచరణలో వినియోగించి, సంఘానికి, దేశానికి వన్నె తెచ్చి, ధన్యజీవులు కావచ్చునని ప్రబోధం చేస్తుంది. అదే అంబ విషాద గాథలోని విశిష్టత!

# సుమిత్ర సౌజన్యము

శ్రీమతి విక్రాల శ్రీదేవమ్మ

ధరణీ రాజ్యము నేలగా భరతు నుద్దండాటవిన్ రామునిం
దిరుగాడన్ ఘటియింపు మంచు పతితో ధీయుక్తి గైకేయి తా
వరముల్ గోరుట సాజమేగద? ధర న్వాత్సల్య మేపార ని
వ్వారు ప్రీతిన్ దమకన్నవారికొఱకై వాంఛింపరే నంపదల్?

రాముడు పెద్దవాడగుట రాజ్యము నేలఁగ నర్హుడౌను, నే
నేమని యిచ్చువాడ వర మీ విధినంచు వచించు రాజుతో
నామె వనంబు కంపుమని నా ప్రియ రాము; సుమిత్ర పుత్రు డా
నేమిటి కంపగావలయు? నేమి యగత్యము వచ్చె నామెకున్?

భువి నఱయంగ నేలు తమ పుత్రుని "కానల కేగి యన్నతో
నవహితబుద్ధితో మెలగుమయ్య!" యటంచని పంపువార, లా
కువలయనేత్రి కోసలునికూతురు సైతము రాము నంపువే
ళ వనటజెంది దుఃఖవిధులన్ దపియింపగ లేదె దీనతన్?

అకటా? రాముని బాసి యే విధిని నీ యంతఃపురి న్నిల్తు, వా
నికి దిక్కెవ్వరు? ఘోర కాననములో నిల్వంగ నెట్లోపు? నం
చు కలంగంబడు నా నపత్నికి మహాశోకమ్ము జల్లార్చ దా
న కలంకస్థితి నంపె నాత్మసుతు దోడై కొల్వగా రామునిన్.

నెరవొందదన్ సుతు లిర్వు రుండిరిగదా? నేర్పొప్పగా నంపు నొ
క్కరునిం బంపుద మండగా ననుచు వీకన్ బంపినోయేమొ, నా
తరుణీరత్నము రాఘవేంద్రునితో, యే తన్వంగియైనన్ ధరన్
వరపుత్రుల్ శతమున్న బంపునొకా? నెప్పాటన్ విచారించినన్.

ఒక రోజా? మఱి రెండురోజుల? కటా ఒప్పార వాహ్యాళి కు
త్సుకతన్ బోవుటయా? యదేమి, సుతు నంతోషంబుతో నంపగా
వికట క్రూర పిశాచరాక్షసచమూ బేతాళ యాత్రా భయా
నకమౌ కాననకుం బంపనోర్చునటు పద్నాల్గేండ్లు నొక్కొమ్మడిన్.

"అమ్మా! యన్న వధూనిక న్గలసి ప్రాజ్ఞి న్వనీవీధిన్
నమ్మోదంబున నేగుచుండడిదె, నన్ నంతో మచిత్తంబులో
నమ్మా! పంపు"మటంచు లక్ష్మణుఁ డనన్ "నాయన్న! పుత్తెంచు" మం
చెమ్మాత్కి న్వచియించెనో! తెలియ మ ద్యోగాతి సౌజన్యమున్.

"దశరథు మాడ్కి రాఘవుని, ధారుణిజాతను మాకు దీటుగన్,
దశరథు రాజధానివలె దండకసీమనుఁ గాంచుచుండి న
ద్యశము ప్రవర్ధిఁన్ బుధు లహో యన రమ్ము కుమార! నీ వయిన్
వశమగుఁగాత శ్రీశుకృప వారక నం"చ నెనంట ధీరతన్.

అలరగ భర్త యజ్ఞపురుషార్పితపాయన మల్లనాతు కో
నల సుతకున్ సగం బొసగి చయ్యన గైకకు శేష మివ్వ వా
రలు చెరి కొంత నిచ్చిన నరానరి గైకొనెనంట చిత్త ముం
దలరి, మరెవ్వరైన నిల నల్గరె? నాయకు డట్లొసర్చినన్?

మొదలనుండియు గనగ నీముదిత భేద
మనుట నెఱుగక సర్వజనాళి కెపుడు
హితములే కూర్చు దయతో నమ్మృగము జూడ
నెపుడు సర్వత్ర హితమాచు నెగడు కరణి.

స్వార్థదృష్టిలేక సాధు స్వభావ సౌ
జన్యములును గలిగి చెలగుచుంట
పెద్దవారలిడిన పేరు సార్థక మయ్యె
మిత్రవంశమణి సుమిత్ర కహహా!

# తంత్రశాస్త్ర రహస్యాలు

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

సుధాసింధోర్మధ్యే సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే, నీపోపవనవతి, చింతామణిగృహే,
శివాకారే, మంచే, పరమశివపర్యంకనిలయాం
భజంతి త్వాం, ధన్యాః కతిచన చిదానందలహరీం!

కొన్ని విషయాలలో భారతదేశం తంత్ర శాస్త్రమునకు ఎంతో ఋణపడివున్నదని సర్ జాన్ వుడ్‌రాఫ్ వ్రాశారు. వీరు హేతువాదం ప్రధానంగా గల ఆంగ్లదేశంలో పుట్టి పెరిగారు. వంగదేశం హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవిచేసిన గొప్ప న్యాయశాస్త్రజ్ఞులు. పాశ్చాత్యులలో, వేదములకు మాక్సుముల్లరు ఎట్టిసేవ చేశారో, అట్టిసేవను వీరు తంత్ర శాస్త్రములకు చేశారు. ఘనవైద్యులకు కూడా నయం కాని వ్యాధి మంత్రమునకు నయమౌట వీరు చూశారు. అప్పటినుంచి సంస్కృతభాషను చదివి, తంత్రశాస్త్ర సుధాసింధువును తరిచారు. తంత్రశాస్త్రగ్రంథములు రహస్యములనియెంచి కొందరు కొన్నిగ్రంథాలను వీరికి చూపనుకూడా లేదు. "మహానిర్వాణతంత్రగ్రంథము"ను నేపాలు స్నేహితునివద్ద సంపాదించారు. కాని ఈగ్రంథంలోని మంత్రములను అచ్చువేయుటకు ఒప్పుకోలేదా మిత్రుడు. మంత్రార్థము ను మాత్రం అచ్చువేయునట్లు చెప్పి ఆ గ్రంథమును సంపాదించారు అనేక కష్టముల కోర్చి వారికాలమును, ధనమును, శ్రమను తంత్రశాస్త్రపరిశోధనకు ఉపయోగంచేశారు. కొన్నిగ్రంథములను వారిపేరులేకనే 'ఎవలాన్' అనగా 'ఒకరు', అనే నామంతో ప్రచురించారు. వీరు తంత్రశాస్త్రమును పునరుద్ధరింపచేశారని హిందూ మొదలైన పత్రికలు వ్రాసినవి. తంత్రశాస్త్రము శరీర, ప్రాణ, మనో, బుద్ధి, నాడీ, జ్యోతిష, వైద్య, రసాయన శాస్త్రముల కెంతో దోహదంచేసి, మహత్తరసేవచేసినదని వీరి అభిప్రాయం.

తంత్రోపాసనలో కొన్ని భయంకరాచారములు ప్రబలినవి. ఇందువలన వాటికి కొంత కళంకంఏర్పడ్డది. కాని ఇందువల్ల తంత్రశాస్త్రోపయోగమును మనం కాదనలేము. ఏ విషయమునైనా దాని ఫలితముల ననుసరించి మంచి చెడులను నిర్ణయిస్తాము. మహాకవి కాళిదాసు, జగద్గురువు శంకరాచార్యులు, మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపకుడు శివాజీ మహారాజు, యోగప్రవక్త రామకృష్ణ పరమహంస, అరవిందఋషి తంత్రసాధకులే. మనం ఎరిగినవారిలో 18 పర్వముల భారతమును, భాగవత రామాయణాది అనేకగ్రంథాలను వ్రాసిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, వాశిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారి ఆస్థానకవిశ్రేష్ఠుడు, మంత్రవేత్త, దేవీభాగవతాద్యనేక గ్రంథకర్త, అభినవకాళిదాస బిరుదాంకితుడు, "ముక్తిద్వారము తెరువదీయుగదె చాముండీ," అని చెప్పి ఆలయప్రాకారము తలుపును తీయించిన ములుగు పాపయారాధ్యులు శక్త్యుపాసకులే.

తంత్రశాస్త్రముయొక్క గమ్యం జీవబ్రహ్మైక్యం. ఉపనిషత్తుల సిద్ధాంతమే ఇది. కాని ఉపనిషత్తులు ఎక్కువగా జ్ఞానమును ఆధారం చేసుకున్నవి. శక్తిని ఆధారం చేసుకున్నవి తంత్రశాస్త్రములు. ఆత్మజ్ఞాన గ్రంథాలు రహస్యగ్రంథము లన్నారు పెద్దలు. దీనినే గీతాకారుడు 'జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం' అన్నాడు. కనుక తంత్రశాస్త్రమును రహస్యభాషలో వ్రాశారు. ఈభాషను సంధ్యాభాష అంటారు. సంధ్యవేళయందు చీకటి, వెలుగులు రెండువున్నట్లు, సంధ్యాభాషకు రెండర్థాలున్నవి. తెలిసినవారు చదివితే ఒక అర్థం, తెలియనివారు చదివితే ఇంకొకఅర్థం వస్తుంది. ఇటువంటిభాషవల్ల ఎవరికి అవసరమైన అర్థంను వారు తీసికున్నారు. తంత్రశాస్త్రంలో అనేకశక్తులు, వీటిని పొందుటకు శీఘ్రప్రదములైన ఉపాయము లెన్నో వున్నవి. వాటినిగురించి క్లుప్తంగా మనవిచేస్తాను.

భారతీయులకు ముఖ్యమైనవి వేదములు. వేదములుండగా తంత్రశాస్త్రము లెందుకు వ్రాయబడ్డవి? ఈ ప్రశ్నకు జవాబువల్ల తంత్రశాస్త్రమును కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. 'అవలాన్' వ్రాసిన తంత్ర గ్రంథములు మహానిర్వాణతంత్రగ్రంథం, కులార్ణవతంత్ర గ్రంథములమీద ఆధారపడివున్నవి. ఇవి వామాచారమునకు సన్నిహితములు. మహానిర్వాణతంత్రశాస్త్ర

ముసు కైలాసపర్వతంమీద పరమేశ్వరుడు దేవికి చెప్పాడు. తంత్రశాస్త్రములు పుట్టింది హిమవత్పర్వతములలోనని కొందరు అభిప్రాయపడ్డారు. ఇక్కడే టిబెట్టువుంది. దీనిని మనవారు మహాచీన మన్నారు. మనలో చీనాచారంవుంది. ఇది మన ఋషులు తపస్సుచేసుకున్న పవిత్రభూమి. మహానిర్వాణతంత్రం ఆరంభంలోనే ఈ క్రిందివిధంగా పార్వతీదేవికి పరమేశ్వరుడు చెప్పాడు. "కలికాలంలో మానవులకు ఆహారవ్యవహారములు మారుతవి. వారు బలహీనులు, దురాచారులై వుంటారు. వేదకర్మలను ఆచరించే శక్తి వంతులు కారు వారు. ఎప్పుడైతే వేదకర్మలు ఆగునో, అప్పుడు కలిప్రవేశించినట్లు గుర్తు. కలిమానవులకు ఆచరణయోగ్యములైన సాధనలు ఏర్పాటుచేయవలసివచ్చింది. ఇవే తంత్రసాధనలు. ఇవి కలియుగంలో వేదకర్మలకన్న శక్తిప్రదములు, శీఘ్రగాములు." మనఋషులు త్రికాలవేదులు. ఏ యుగంలో ఎట్టిపరిస్థితులు ప్రబలుతవో ముందుగా ఊహించగల దూరదర్శులు. వేదములు స్త్రీ శూద్రులు వేదకర్మలను ఆచరించకూడదని బహిష్కరించినవి. దీనివల్ల కలియుగంలో హిందూ మతమునకు అపాయం ఏర్పడింది. స్త్రీ శూద్రులు ఆత్మజ్ఞానమునకు,విమతముల నాశ్రయించవలసివచ్చింది. ఇట్టి స్థితిలో తంత్రశాస్త్రం వెలిసింది. కులార్ణవతంత్రం యుగమున కొకశాస్త్రం విధించబడిందని చెపుతుంది. కృతయుగమునకు వేదములు, త్రేతాయుగమునకు స్మృతులు, ద్వాపరయుగమునకు పురాణములు, కలియుగమునకు తంత్రశాస్త్రము ఆచరించతగినవని చెబుతుంది.

ఉపనిషత్తులు తత్త్వసిద్ధాంత నిర్వాచకములు. తంత్రశాస్త్రము సాధనగ్రంథము. తంత్రమునకు ఉపాయం అని కూడా అర్థం వుంది. ముఖ్యవిషయములను వేదములనుండే తంత్రశాస్త్రము తీసుకున్నది, ఆ తీసుకున్నదానిని విశదపరిచి వ్రాసింది. తను అనగా విస్తరించుట. తనువిస్తారే. త్ర అనగా తరింపచేయు జ్ఞానము. తరింపచేయుజ్ఞానమును విస్తరించి చెప్పినది తంత్రశాస్త్రం. తంత్రశాస్త్రములో శక్తి (స్త్రీ) ఆరాధనముఖ్యం. స్త్రీపూజ వేదములలో శ్రీ సూక్తం మొదలైన వాటిల్లోవుంది. గాయత్రికూడా స్త్రీయే. యజ్ఞములందు పశుబలులు, సోమపానములు ఉన్నవి. తంత్రశాస్త్రములు దేశాచారముల ననుసరించి అనేక రూపాలుగా వున్నవి. ఈ సంప్రదాయములుగల రాష్ట్రములను క్రాంతము లంటారు. వింధ్యకు వుత్తరానవున్న భూమిని రాధాక్రాంతమంటారు. ఇక్కడ కాశ్మీర సంప్రదాయం వుంది. తూర్పునవున్న దేశమును విష్ణుక్రాంత మంటారు. ఇక్కడ గౌడ (వంగ) సంప్రదాయంవుంది. దక్షిణదేశమును అశ్వక్రాంతం అంటారు, ఇక్కడ కేరళసంప్రదాయంవుంది. ఎవరి ఆచార వ్యవహారముల ననుసరించి ఆ సాధనలు ప్రబలినవి. వంగీయులు మత్స్య మాంసప్రియులు—వీరు వీటిని విశేషంగా ఉపయోగించారు.

తంత్రపూజలు ఐదు విధాలు: (1) సూర్య, (2) గణపతి, (3) విష్ణు, (4) శివ, (5) శక్తి. ఇవి ఒక్క శక్తికి ఐదురూపాలు. సాధనలు : సాధకుని భావము, సమర్థతననుసరించి సాధనలు నాల్గువిధాలుగా విభజించారు. (1) పూజ, (2) జపం, (3) ధ్యానము, (4) బ్రహ్మత్వం. సాధకునిభావములు మూడు: (1) పశుభావం, (2) వీరభావం, (3) దివ్యభావం. (1) "జ్ఞానమోహకామక్రోధాదులనే పాశములతో కట్టుబడివున్న వానిని పశ్వాచారు లంటారు. (2) పశుబంధములను తెంచుకుని, జితేంద్రియుడైనవానిని వీరాచారుడంటారు. (3) బ్రహ్మజ్ఞానసంపన్నుడైనవానిని దివ్యాచారుడంటారు. కులార్ణవతంత్రము ఏడురకాల ఆచారములను చెప్పింది. (1) వేదాచారము, (2) వైష్ణవాచారము, (3) శైవాచారము, (4) దక్షిణాచారము, (5) వామాచారము, (6) సిద్ధాంతాచారము, (7) కౌలాచారము. ఆచారమనగా సాధనావిధానము, గమ్యం చేరుమెట్లు. (1) వేదాచారం : ఇది ఆచారములకు స్థూలదేహంవంటిది. బహిఃపూజలు చేయువిధాన మిది. ఇది క్రియామార్గం. (2) వైష్ణవాచారము. ఇది భక్తియోగము. హృదయసాధన. (3) శైవాచారము. జపయోగం, ధర్మస్థాపనచేయునటిది. క్షత్రియధర్మం వంటిది. (4) దక్షిణాచారము. దక్షిణకాళికనుపూజించుటవల్ల దక్షిణాచారం అంటారు. వీరిని సమయులంటారు. కొందరు దక్షిణ, వామ ఆచారములు రెండే చెప్పుతారు. వీరికి దేవి గాయత్రిమంత్రోపదేశం చేయబడుతుంది. గాయత్రి త్రిశక్తులకు ఆద్యశక్తి, బ్రహ్మశక్తి. ఇది బ్రాహ్మణత్వానికిసాధన. శక్తిపూజార్హుడౌతాడు. ధ్యానయోగం ఇక్కడనుండి ఆరంభమౌతుంది. ప్రవృత్తి నుండి, నివృత్తిమార్గంలోనికి ప్రవేశించగలుగును. (5) వామాచారము : జన్మతః మానవుడు దక్షిణాచారంలో పుట్టును. గురువువల్ల తంత్రదీక్ష పొందినతర్వాత వామాచారసంపన్నుడౌను. వామదేవిని పూజించుటవల్ల ఈ

వేగుకలిగింది. స్త్రీ వామపార్శ్వంలోవుండు స్త్రీపూజ దీనితో ప్రారంభిమౌను కనుక వామాచారి అనవచ్చు. వామ అనగా వ్యతిరేకపక్షం, అనగా విప్లవమార్గం. ప్రవృత్తిమార్గమును వదిలి, నివృత్తిలో ప్రవేశించుటే ఇది. ఇతడు పశుభావంలోవుండే దయ, లజ్జ, మోహ, కులశీలాల కట్టుబాటులకు అతీతుడౌతాడు. కృష్ణుడు గోపికల వస్త్రములను అపహరించి, గోపికల లజ్జను పోగొట్టాడు. ఇప్పుడు సంసారబంధవిముక్తుడౌను. వామాచారిని వీరాచారి అని, హఠయోగి అని అంటారు. వామాచారములలో కూడా భేదాలున్నవి. (6) సిద్ధాంతాచారము : లజ్జా భయ మోహములు వీరికి ఉండవు. వీరు శ్మశానంలో వుందురు. శ్మశానవాసియైన శివునిస్థితిలోవుంటారు. వీరిలో అఘోరయోగాచారులుందురు. యోగరహస్యములు తెలిసికుంటూ వుందురు. దేహంలోని వాయుసంచారములను, మనోవృత్తుల నిగ్రహములను తెలిసికొందురు. పిండాండ బ్రహ్మాండములను ఏ దివ్యశక్తి పరిపాలన చేస్తుందో గ్రహిస్తారు. వేదాచారములో వున్న రహస్యములను గురువు ఇతనికి తెలియచెప్పుతారు. గురువు వీరికి దీక్ష ఇస్తారు. అష్టాంగయోగమును సాధించి, తురీయాచారమైన కౌలాచారమునకు అర్హత పొందుతారు. ఇలాంటివారిని దివ్యాచారులంటారు. (7) కౌలాచారము. ఇది భగవద్గీతలో చెప్పబడ్డ బ్రాహ్మీభావం. ఇతనికి శత్రుమిత్రులు, లాభనష్టాలు, శీతోష్ణములు మట్టిబంగారము అనే భేదం లేదు. అన్నీ ఒకటే. గీతలోని సమతాయోగము. ఇతడు కొన్నిసార్లు భ్రష్టునివలె, కొన్నిసార్లు పిచ్చివానివలె, కొన్నిసార్లు శిశువువలె, కొన్నిసార్లు భూతప్రేత పిశాచములవలె వుండును. ఏకాంతంగా శ్మశానభూములందు వుంటూ నిర్వికల్పసమాధిస్థితిలో వుండును. ఇతనిహృదయం ఇప్పుడు శ్మశానవాటిక అక్కడ కామక్రోధాదులన్నీ తగులపెట్టబడ్డవి. ఇతను జీవన్ముక్తుడు, పూర్ణమానవుడు, పరమహంస, అనికూడ అంటారు.

సామాన్యులు మొదటి వేదాచారంనుండి సాధనలు చేస్తూ గమ్యం చేరాలి. పూర్వజన్మంలో సాధించినవారు, కురదలా ఆచారం నుండి సాధన చేయుదురు. రామకృష్ణపరమహంస తురీయాచారములను సాధన చేశారు. వీరికి పిలిస్తే జగజ్జనని కనుపించేది. మహాభావం వారికి కలిగినందున వామాచారం వారు ఆదరించ వవసరం లేకపోయింది.

## యంత్ర, మంత్ర రహస్యాలు

తంత్రసిద్ధికి సాధనలు మంత్రయంత్ర పూజలూ, హఠ, రాజయోగములు. మంత్రయంత్రపూజలు బహిస్సాధనలు, హఠరాజయోగములు అంతస్సాధనలు. బహిస్సాధనలవల్ల అంతస్సాధన సులభమౌతవి. సూతసంహితలో దేవిపూజలు చేసినవారే, అంతస్సాధనకు అర్హులని చెప్పబడ్డది. మంత్రయంత్రములు శక్తిసమన్వితములైనవి. మంత్రము శబ్దబ్రహ్మమునుండి పుట్టింది. కనుక మంత్రము బ్రహ్మశక్తి. దీనివల్ల అంతస్సాధనయైన కుండలినీసిద్ధి కలుగుతుంది.

మంత్రము శబ్దశక్తి, యంత్రము చిత్రశక్తి. యంత్రము శరీరము. మంత్రం ప్రాణము. శరీరమందు ప్రాణం వున్నప్పుడే చైతన్యవంతమౌనట్లు, యంత్రమందు మంత్రం చేర్చినప్పుడు జీవం కలదౌను. కామక్రోధాదులను నియంత్రణ చేయునది యంత్రము. ఒక స్థితిని పొందినవాడే యంత్రపూజార్హుడు; అందరూ కాదు. మననం చేత తరింపచేయునది మంత్రం. మంత్ర యంత్రములు రెండూ రహస్యంగా వుంచదగినవే.

యంత్రము సాంకేతికశక్తి. శివునికిగాని, శక్తికిగాని త్రికోణము యాంత్రిక సంకేతము, మూడు గీతలు ఒక్క ఆకారంగా చేసిన త్రికోణము. ఒక్క రూపంలో మూడువస్తువులున్నవి. ఒకటే మూడు ఆకారాలుగా వున్నది. క్రింది అడ్డగీతమీద నిలిచిన త్రికోణమిది. ఒక్క శక్తియే త్రిశక్తులుగాను, త్రిగుణాలుగాను, త్రి అవస్థలుగాను, భాసించుచున్నది. ఒక్క మూర్తియందు త్రిమూర్తులు భాసిస్తున్నారు. కనుక త్రికోణము ఆదిశక్తికిగాని, ఆదిశంభునికగాని సంకేతమైన యంత్రము. త్రికోణము శక్తికి సంకేతమన్నాము. శక్తిసమస్తప్రపంచమును ఉత్పత్తి చేయుయోని. కనుక ఈ త్రికోణాకారమును యోని అని కూడా అంటారు. శివశక్తులు జీవుడు బ్రహ్మమూ ఒకటే. విడదీసి నప్పుడు రెండు రూపాలుగా కనుపించును, ఇదే సోహం. సోహం ఒక్కటే మాట. దీని అర్థం అదే నేను, సోహంను విడదీసినప్పుడు స+హం, అతడొకడు, నేను ఒకరు అని అర్థం. అదీ, నేనూ ఒకటేరూపం కనుక, శివునియొక్క శక్తి సంకేతాలూ ఒకటే. అది త్రికోణాకారము. శివునిశక్తిని ఒకటే రూపంగా చూపించుటకు, రెండు త్రికోణా

కాలములను ఒక దానిపైన ఇంకొకదానిని మార్చకుండా ఈ క్రిందివిధంగా వుంచెదరు.



సృష్టియనగా శివశక్తులసంయోగము. శివుడు శక్తితో కలిసినప్పుడు బిందూత్పత్తియై, అది సృష్టిగా పరిణమించును. ఈ బిందువునుండి పంచభూతాలుపుట్టి, అది ప్రపంచరూపంగా మారును. ప్రపంచశబ్దంలో, ప్ర అనగా వికసించుట పంచ అనగా అయిదు భూతములు. దీని అర్థం పంచభూతముల వికాసమే ప్రపంచము. బీజమైన బిందువుకు, శివశక్తుల సంయోగము ప్రధానకారణము. దీనిని యంత్రములలో ఈ క్రింది విధంగా చూపించెదరు. అది శివునిసంకేతమైన త్రికోణాకారంమీద శక్తిసంకేతమైన త్రికోణాకారమును, తలక్రిందులుగామార్చి వుంచెదరు. ఇప్పుడు శక్తిసంకేతమైన ఈ మార్చి చూపించబడిన దానిని యోని అంటారు. ఈ శివశక్తుల సంయోగము ఈ విధంగా వుంటుంది.



ఈ త్రికోణాలు కల్పిన ఈ యంత్రమే శివశక్తుల సంయోగము. ఇదే సృష్టిక్రీడ. తంత్రశాస్త్రం దీనిని సదాశివ మంటుంది. మంత్రశాస్త్రం సృష్ట్యారంభం అంటుంది.

బ్రహ్మకు, రెండుకళలు. (1) సాకళ, (2) నిష్కళ. బ్రహ్మ మూలప్రకృతిలో కలిసినప్పుడు సాకళ, కలవక ఉన్నప్పుడు నిష్కళ. మూలప్రకృతితో బ్రహ్మ కలిసినప్పుడు, ప్రకృతి గర్భమందు బీజోత్పత్తియౌను. అప్పుడు ఒక స్పందనం ఏర్పడును. ఈ స్పందనమే నాదం. నాదంనుండి బిందువు ఏర్పడును. నాదమునకు సంకేతము



వంటి బాలచంద్రాకారము. యంత్రంలో నాదోత్పత్తిని ఈ విధంగా చూపించుతారు. నాదము బిందువుగా పరిణమించును. బిందువుకు ○ పూర్ణచంద్రుని వంటి బింబం సంకేతము. సృష్టిలో బీజోత్పత్తిని యంత్రంలో ఈ విధంగా చిత్రిస్తారు.



ఈ యంత్రంలోని బిందువునుండే పంచభూతాలు పుట్టి ప్రపంచరూపం దాల్చును. శ్రీచక్రము ఈ విధంగా వుంటుంది.



ఈ బిందువులో శివశక్తులు రెండూ కలిసి ఒక్కరూపంగా కనుపిస్తున్నవి. ఈ బిందు మధ్యలో ఒక నిలువుగీతను ఈ విధంగా గీసినప్పుడు, ఇది రెండు భాగములుగా కనుపిస్తుంది. శనగగింజ మామూలుగా మధ్య గీత లేని బిందువువలె కనుపించును. కాని దానిపై పొట్టును తీసివేసినయెడల మధ్య నిలువు గీత గీయబడిన బిందువువలె కనుపించును.



ఇప్పుడు ఈ శనగగింజలో రెండు భాగాలు కలిసినగింజ వుంది. దీనిని విడదీస్తే, రెండుచెక్కలు వచ్చును. ఇవే శివశక్తులు. ఈ చెక్కలు కలిసి, పైన మామూలుగా ఉండు పొట్టు కప్పబడివున్నప్పుడు, అది విత్తుగా బీజోత్పత్తికి పనికివచ్చును. ఈ విత్తులో చెట్టు ఇమిడివున్నట్లు, బిందువులో ప్రపంచం ఇమిడివుంది. వికాసమునకు నవచక్రములున్న శ్రీచక్రమును రచించిరి. పై బింబము నుండి ప్రణవం, దీనినుండి అ, ఉ, మ లు పుట్టి ప్రపంచమునకు కారణములైనవి. ప్రణవంలో వున్న ఈ మూడే త్రిమూర్తులు, త్రిశక్తులు, త్రిపురములు, త్రిలోకములు, త్రిగుణాలు, త్రి అవస్థలు. ఈవిధంగా వస్తూత్పత్తికి శివశక్తులు కావాలి. ఇదే మంత్ర, యంత్ర, యోగరహస్యముల రహస్యం. పార్వతీ పరమేశ్వరుల రతో వీర్యములే రసపాకములు. పై యంత్రంలో శివశక్తి సంయోగం చేసినట్లుగా, యోగములో కూడా కుండలినీ శక్తిని, సహస్రారంలోని పరమేశ్వరునితో సంయోగము చేతురు. ఇదే యోగసిద్ధి. (సశేషము)

# సాహితీ సుగతుని స్వగతం

అబ్బ! ఇటీవల బియ్యానికి కాటకం ఎక్కువ అయింది. అయింది మరి! ఎందుకీ విపరీతం! భారతదేశానికంతా ధాన్యాగారమైన మన నాడులోనా ఈ వైపరీత్యం? రెండువేలయేళ్ల నాటినుంచి బియ్యప్పంటలో మనకేకదా పైచేయి మనకవులు బియ్యాన్ని, బియ్యప్పిండిని ఎంతోగానో వర్ణించారు!

మన గ్రామజీవితానికి తొలిరికార్డనదగిన గాథాసప్తశతిలో వరిచేలు, వరిముల్లు, శాలిధాన్యం. బియ్యం పిండికొట్టడం మున్నగువాటినిగురించిన ముక్తకాలు కొల్లలు. పాపం ఒకావిడకు శాలిక్షేత్రం ప్రియసమాగమ సంకేతస్థానం. శాలిక్షేత్రం పండి తెల్లబడుతూంది. త్వరలో కోతలు జరుగుతాయి. మరి ఎక్కడ కలుసుకోడం ప్రియుణ్ని? హరితాళం—అగదళం—పూడుకున్నటిగలె జనపచేను ఎదుగుతూన్నదిలే—అని ఆవిడ చెలికత్తె ఊరడిస్తున్నది:

కిం రుఅసి ఓణఅముహీ
ధవలాఅంతేసు సాలిఛేత్తేసు,
హరిఆల మండిఅముహీ
ణడివ్వ సణవాడిఆ జాఆ. 1—9.
(కిం రోదిష్యవనతముఖీ
ధవలాయమానేషు శాలిక్షేత్రేషు,
హరితాళమండితముఖీ
నటీవ శణవాటికా జాతా.)

మరొకచోట పండిన వరిచేను చలికాలంతో తనకు ముదిమిలో ఖలసంగం (కళ్ళంతో సహవాసం) అవుతుందనే చింతతో తల(కంకి) వేలవేసుకొని, ఏడుస్తున్నదట—మంచుబొట్లు కిందికి జారిపోతుంటేగా మాస్తే.

కహం మే పరిణఇఆలే
ఖలసంగో హోహిఇ త్తి చింతంతో,
ఓణఅముహో సమూఓ
రుఅఇవ సాలీ తుసారేణ. 6—68
(కథం మే పరిణతికాలే
ఖలసంగో భవిష్యతీతి చింతయన్,
అవనతముఖః సశూకో
రోదితీవ శాలి స్తుషారేణ.)

ఇలా చెప్పుకొంటూపోతే ఎంతో గ్రంథం అవుతుంది. శాసనాలలోను, తెలుగుసాహిత్యంలోను బియ్యం ప్రశస్తికి కొదువలేదు. "పెరుగు వడ్లు కలిసినట్లు" అనే సామెతనే సృష్టించాడు నన్నెచోడుడు.

బియ్యంమాట తడిమితే భూగోళం తూర్పుకొస నుంచి పడమటికొసదాకా యాత్రచేయక తప్పదు మరి మనం. తీగ కదిపితే డొంకంతా కదులుతుందంటారు కదూ మరి!

వరి దక్షిణభూభాగంలోని పంటేనని వృక్షశాస్త్రజ్ఞుల నిర్ణయం. ఇది దక్షిణాపథంనుంచి కొచ్చిన్ చీనాకు, చీనాకు వెళ్ళిందట. అక్కడినుంచి ఉత్తరాపథానికి తిరిగివచ్చి అరేబియా, ఈజిప్టులమీదుగా గ్రీసుకువెళ్ళి, పాశ్చాత్యదేశాలకు వ్యాపించిందట.

చీనాలోనే మొదట వరిపంట ఉండేదని, క్రీస్తుకు మూడువేలసంవత్సరాలకు ముందునుంచే చీనావారికి వరిపంట సంగతి తెలుసునని స్టేనిస్‌లెస్ జూలియస్ అనే శాస్త్రజ్ఞుడు తెలిపాడు. క్రీస్తుకు పూర్వం 2,800 సంవత్సరాలనాడున్న చీనా చక్రవర్తి చిన్ నుంగ్ పంచధాన్యాలు ప్రదర్శించే ఉత్సవమొకటి ఏర్పాటు చేసేవాడట. వరిని చక్రవర్తి స్వయంగా దర్బారులో ప్రజలకు చూపేవాడట. కనుక యిది చీనానుంచే ప్రపంచానికి వ్యాపించింది – అని ఈయన వాదం.

ఏమైనా వరివ్యాప్తినిగురించి మూడు వాదాలున్నాయి. (1) ఇది చీనానుంచి వ్యాపించింది. (2) భారతదేశంలోనే అనాదిగా ఉండి, ఇతర పాశ్చాత్య దేశాలకు వ్యాపించింది. (3) దక్షిణాపథంనుంచి— ముఖ్యంగా తమిళదేశంనుంచి పర్షియా, అరేబియా, గ్రీసులమీదుగ పాశ్చాత్యదేశాలకు ప్రాకింది.

చీనాదేశందనే వాదంగురించి మొదటే చదివారుగదా? రెండవవాదం వినండి: సంస్కృతంలో వరికి ముఖ్యంగా వాడేమాట వ్రీహిః. వ్రీణాతి దేహమితి=వ్రీహిః (దేహాన్ని భరిస్తుంది) అని, వ్రీ భరణే అనే ధాతువునుంచి వ్రీహిశబ్దం పుట్టిందని సంస్కృతవిద్వాంసులు చెప్పేవ్యుత్పత్తి. వృణోతి దేహం వ్రీహిః=(దేహాన్ని అభివృద్ధికోసం వరిస్తుంది.) అని కూడా సాధించవచ్చునంటారు. అనాదిగా ఇది భారతదేశంలో పండుతున్నది. వివాహాది వైదిక కార్యాలలో దీని ప్రాధాన్యం ఉండడమే దీని ప్రాచీనతకు నిదర్శనం. వివాహంలో పెండ్లికూతురుసోదరుడు పెండ్లికొడుకుకు శాలిధాన్యం పేలాలు అందివ్వడంవల్లనే శ్యాలః (బావ) అనేమాట పుట్టింది. పాతఫారసీ భాషలో దీనికిసమానపదం కనిపించకపోయినా, నేటిఫారిసీమాట బిరింజ్. పుష్తోలో వ్రిజ్జా. బహువచనం వ్రిజ్జే. బలోచిస్తాన్‌లోని బరకాయి తెగలో

విజ్లా. ఆర్మేనియన్‌లో బింజ్. హిందూకుష్ భాషలలోని గిల్గిత్ భాషలో బ్రాన్, బ్రియున్. నేటి పాకిస్తాన్‌లోని చిత్రాలీభాషలో గ్రింజ్. సంస్కృతంలోని హకారం పారసీక భాషలో జకారమౌతుంది. సహస్ర—హజార, హిమ—జిమ, హృదయ—జిగర. కనుక ఇండో—పర్షియన్ శాఖకు చెందిన ఈమాట బాబిలోనియానుంచి గ్రీసులో ప్రాకి ఓరుజా అయింది. ఇది ఇటాలియన్‌లో రిసో అయి, ఫ్రెంచిలో రిజ్ అయి, ఇంగ్లీషులో రైస్ అయింది. కనుక రైస్ అనేది వ్రీహినుంచి వచ్చిందనీ, భారతదేశంనుంచే పాశ్చాత్యదేశాలకు వ్యాపించిందని శ్రీ సి. జే. లిగూల్ పండితుడన్నాడు.

మూడోవాదమిది: వరిని తెలిపే ఏ పదమూ ఋగ్వేదంలో లేదు. అథర్వవేదంలో మాత్రం యవ మాషతిలాలతో కలిపి చెప్పబడి ఉంది. ఒరిస్సాలో బియ్యం విశ్వామిత్రసృష్టి అనే వ్యవహారం ఉంది. ప్రాచీనకాలపు ఈజిప్టు ధాన్యం చిత్రాలలో వరి బియ్యం చిత్రాలులేవు. మధ్య ఆసియాలో ఇదిపూర్వం కనిపించలేదు. దక్షిణ ఆసియాలో ఇది పాతపంట కాదనడానికి అవకాశంలేదు. ఋగ్వేదంలో దీని ప్రసక్తి లేకపోవడమే ఈ అనుమానానికి కారణం—అని ఆధునిక వృక్షశాస్త్రజ్ఞులంటున్నారు.

తమిళులకు, ఇతర దక్షిణాత్యులకు వరిసంగతి చాలకాలంక్రిందటే తెలుసుననడానికి అరి. అరిసి, ఉరి అనేమాటలు ప్రమాణమని మొయినిన్ షెరీఫ్ అనే శాస్త్రజ్ఞుడన్నాడు. కనుక దక్షిణాపథంనుంచే ఇది ప్రపంచానికి వ్యాపించి ఉంటుందని ఈయనవాదం.

తమిళులో బియ్యానికి సమానపదాలైన అరి, అరిసి; కన్నడంలోని అక్కి, అరె, తుళుమలయాళాలలోని అరి అనే పదాలలోను, తెలుగులో ధాన్యవాచకమైన వరి, వర్లు, వడ్లు, ఉర్లు (కొన్ని ప్రాంతాల మాండలికం) అనే పదాలలోను; అనాది జాతులలో ఒక్కటైన సంతాల్ తెగలోని ఉరీ, ఉరీ హూరి అనేపదాలలోను తరచు కనిపిస్తున్న మూలశబ్దం అరి, అరిసి. అరి వేరుచేయు (పొట్టునుంచి వేరుచేయబడింది) అనే అర్థంలో అరి, అరిసి (బియ్యం) అనేమాటలు ఏర్పడ్డాయి. అరి అనే పదానికి కన్నడంలో బహుశా బహువచన ప్రత్యయం కాలక్రమాన చేరడంవల్ల అరికళ్, అక్కళ్ అయి, బహువచన ప్రత్యయం మరికొంతకాలానికి జారిపోయి, అర్కి—అక్కి అనే నేటిరూపం ఏర్పడి ఉంటుంది. తెనుగులో ఆ అర్కళ్ అనేపదం మరొక బహువచన ప్రత్యయంతో అర్కల్లు అనేరూపంలో నిలిచి ఒక రకం ధాన్యం తెలిపేమాటయింది. అరిసి అనేపదం అరిసె అనేపదంలో తొంగిమాస్తూ భక్ష్యవిశేష వాచకంగా నిలబడింది. అరిసెలు బియ్యప్పిండితో వండేవే గనుక అనుమానానికి ఆస్కారంలేదు.

తండులం అనే సంస్కృతం మాటలోను ద్రావిడభాషాచ్ఛాయలు ఉన్నాయని మొయినిన్ షరీఫ్ అన్నాడు. అజంగడ్ (ఉత్తరప్రదేశ్) ప్రాంతంలో నికృష్టధాన్యాన్ని తెన్నీ అని వాడుతారని, తెన్ అనడమే దక్షిణాది సంబంధం తెలుపుతున్నదనీ ఆయన అన్నాడు.

ఈవాదంలో కొంత సత్యంఉంది. తండుల శబ్దాన్ని బియ్యం అన్నఅర్థంలో అమరకారుడు గ్రహించలేదు. తడితాడనే (కొట్టుట) అనే ధాతువునుంచి (వడ్లను దంచడంవల్ల కలిగింది) అని తర్వాతి సంస్కృత పండితులు సాధించారు. అమరంలో వాయువిడంగాల పర్యాయాలలో కనిపించే చిత్ర తండుల శబ్దాన్నిబట్టి తండుల పదానికి గింజ అనే అర్థం వస్తుంది. ఇంతకూ వ్రీహిశబ్దమే ప్రాచీనం కానప్పుడు తండులపద ప్రాచీనత్వ విచారం ఎందుకూ?

ఈ అరిసి చీనా భారత పారసీకాల మీదుగా అరేబియాచేరి, అరబ్బీభాషలో అల్‌రుజ్, అర్రుజ్ అని, ఈజిప్టుభాషలో అరూస్, రూజ్, రూస్ అని, గ్రీక్‌లో ఒరుజాఅని మార్పుచెందింది. ఇది ప్రాచీనకాలంలో మధ్యప్రాచ్య దేశాలలో కనిపించడంలేదనే వృక్షశాస్త్రజ్ఞుల మాటనే మనం ప్రామాణికంగా తీసుకొందాం. వ్రీహి శబ్దానికి వ్యుత్పత్తి తర్వాత కల్పించబడి ఉంటుంది.

ప్రపంచమంతటా వ్యాపించిన ఈ అరిసి మన తెలుగువారి నిత్య వ్యవహారంనుంచి జారిపోవడం ఆశ్చర్యకరం. దానికిమారు బియ్యమనే పదం వాడుకలోకి వచ్చింది. ఇది ఇతర ద్రావిడభాషలలో లేనిమాట; సంస్కృతప్రభావంవల్ల వసమంత్రంగా వచ్చినమాట. దీని వ్యుత్పత్తి వ్రీహిభవం=వ్రీహ్యం అని. ఈ వ్రీహ్యం బ్రియ్యం, బియ్యం, బీయం అని మూడురూపాలయింది. బ్రియ్యం అని కొన్ని అనాదిజాతులలో నేటికీ వాడుకలో ఉంది.

సంస్కృతంలోని యకారం జకారం కావాలి తద్భవాదులలో – వైద్యః – వెజ్జు, కార్యం – కజ్జం అనేవిధంగా – అని మనకు అనుభవం కలగడం సహజమే. కాని, కొన్ని తత్సమపదాలలో యకారం ప్రాకృతంలో అట్టే నిలిచిపోవడంకూడా కద్దు; ఆర్యపుత్ర-అయ్యఉత్త. స్నేహం-ణెయ్యం ఉండనేఉంది.

బీజం అనేమాట బియ్యంఅని అయిందని కొందరు అంటారు. వారు బ్రియ్యం, బ్రియ్యాలుఅని కొన్ని అనాదిజాతులలో ఉన్న వ్యవహారానికి ఉపపత్తి చెప్పవలసి ఉంటుంది.

మరి ఏమిటీ ఘోరం! నేడు బియ్యానికి – మన దేశంనుంచి విశ్వమంతా వ్యాపించిందన్న దానికి— అంగలార్పు!

—రామచంద్ర.

# కష్టాలలో కాలగమనం

శ్రీ పోరంకి ఆనందం

హావృడిగ నడుస్తూంటె బాటన వ్రేలిగోరికి ఎదురుదెబ్బ
తగుల్చుకున్న నిర్భాగ్యుడి నడకలా
బలవంతుడు ఏదో బలవత్తర కారణంతో 'చైన్' లాగితే
ఆగబోతూన్న 'ట్రెయిన్' నడకలా
మంచిలోంచి చెడుకైనా, చెడులోంచి మంచికైనా పరివర్తన
చెందుతూన్న మనిషి నడతలా
కారణం లేకుండా మెల్లిగా.... కుంటుతూ...తూలుతూ...ఇలా
పోతోందేమి కాలగమనం???

కాలచక్రం ఏకధాటిగా త్రిప్పగా త్రిప్పగా
నీచేతులు నొప్పి పుట్టాయా ?
నిను నీ 'డ్యూటీ' నుంచి 'రిలీవ్' చేసేవాడే లేక
విసిగి వేసారి అలిసిపోయావా ?
నే నిన్న కష్టాలలో ఉంచగా కొంపతీసి నువ్వు
చెయ్యటం లేదుకదా రాజీనామా ?
ఏమైనా గొడవ లుంటే పడవలసిన వారితో
పడరాదూ చక్కగా రాజీ?

కలికాలం ప్రథమపాదం దాటి రెండవ అడుగు వేయలేదె!
ఈ కలికాలం కాస్తా అయిపోతే తీసుకోవచ్చేమో నీవు కలకాలం 'రెస్టు!'
వేగంగా కాలచక్రం త్రిప్పేయడమే నీకూ నాకూ అందరికీ 'బెస్టు'!
ఇది నీ విధి—నువ్వు సక్రమంగా నిర్వర్తిస్తే నీవే అందరిలోకీ 'ఫస్టు'!

# కలగూరగంప

## ఉల్లి చేసిన మేలు

### శ్రీ నిడదవోలు వేంకటరావు

అశోక చక్రవర్తి కొకమారు చాలా జబ్బు చేసినది. ఎంతమందియో వైద్యశాస్త్రవేత్తలు పరీక్షించినారు. కాని రోగము పోల్చుకొనలేకపోయినారు. కొంతమంది వైద్యులు ప్రతిక్రియలు చేసిరి. కాని లాభము గలుగలేదు. తుదకు ధన్వంతరిని బోలిన వైద్యులు ధైర్యము చాలదని పెదవి విఱిచినారు. అంతటను నశోకుడు జీవింపడనను [illegible] గంటినది. అశోకుని భార్య 'తిష్యరక్షిత'. ఆమె మాత్రము వ్యాధియములో నెల్లన్నను పైకి మాత్రము నిరుత్సాహము కనబఱుపక నిబ్బరముతో ప్రవర్తించుచుండెను. ఆమె మిక్కిలి చాకచక్యము గలది. ఒక యుపాయము నాలోచించినది. తన రాజ్యములో నెక్కడనైనను అశోకుని జబ్బువంటి జబ్బుచేత బాధపడు వారెవ్వరైన నున్నవారిని కోటలోనికి దీసికొని రమ్మని యాజ్ఞాపించినది. రాజభటులు మిగుల గవేషణచేసి తుదకు [illegible] యొక రోగిని తీసుకొని వచ్చిరి. అతనికి నశోకుని జబ్బువంటి జబ్బే కలదు. అప్పుడు తిష్యరక్షిత శస్త్రవైద్యుని బిలిపించి అతని పొట్టచీల్చి జబ్బేదో చూడుమని యాజ్ఞాపించినది. వారట్లు చేయగా నందొక పురుగు కనిపించినది. అది బ్రదికియే యుండెను. కావున దానిని చంపుటకు ఘాటుగల వస్తువులు కొన్ని తినిపించిరి. కాని యది చావలేదు. తుదకు "ఉల్లిపాయ" నొకదానిని తెచ్చి ఆ నారిపురుగు ముందఱ పెట్టి తినిపించగానే ఆ పురుగు చనిపోయినది. ఇదియంతయు రాణి తిష్యరక్షిత గమనించినది. అశోకచక్రవర్తి కడుపులో నారికుఱుపున్నదని గ్రహించినది. అతనిని ఉల్లిపాయ తినమని కోరినది. అశోకుడంత, క్షత్రియుండైన తనకు "ఉల్లిపాయ" నిషిద్ధమని, తినని పట్టు పట్టినాడు. ప్రాణాపాయకర సమయమున నిషిద్ధము కాదని, అది యౌషధమని యొప్పించి తిష్యరక్షిత ఉల్లిపాయ తినిపించినది. అశోకుడంగీకరించి, ఉల్లిని తినగానే, కడుపులో నారిపురుగు నశించినది. అతడారోగ్యవంతుడైనాడు.

"ఉల్లి చేసిన మేలు తల్లియైనా చేయదు" అనే సామెత అశోకుని నాటినుండి యున్నట్లు పై కథ వలన గ్రహింపవచ్చును.

## అశోకుని జననము

అశోకుని తల్లి సుభద్ర లేక 'సుభద్రాంగి' వృత్తాంతము 'శాంతిపాత్రసూత్ర' ద్వితయ తృతీయ కాండములగలదు. నేపాళీ బౌద్ధవాఙ్మయ చరిత్రమున నశోకుని తల్లి వృత్తాంత మీ క్రిందిరీతి నున్నది:-

పాటలీపుత్రమును బిందుసారుడు పరిపాలన చేయుచున్నకాలమున నొక పేద బ్రాహ్మణుడు యాయావారవృత్తిచే జీవనము చేయుచుండెడివాడు. అతనికి ఒక్కర్తె కూతురు. ఆమె చక్కని చుక్క. ఒకనాడా బాలిక యాడుకొనుచుండగా సోదెకత్తె యొకతె వచ్చి, ఆపిల్లను చూచి "నీవు రాజును పెండ్లాడి రాణిగానుందువు." అని చెప్పినది. ఏదో వేళాకోళముగా చెప్పినది అని యాబాలిక యూరకొన్నది. కాని అప్పుడే, వీథిలోనికి వెళ్ళి తిరిగివచ్చిన తండ్రి చెవిని యామాటలు పడినవి. "సోదెకత్తె చెప్పినమాటలు బోద్యాలు కావు. నిజమయ్యేయుండును" అను భావ మాతని మనసులో మెఱసినది. ఆమెకు యౌవనము రాగానే, తండ్రి రాజుగారి అంతఃపురాని కామెను తోడ్కొని వెళ్ళినాడు. ఆ సమయములో రాణిగారికి కొంతమంది యనుచరులు కావలసి వచ్చినారు. కాబట్టి తక్షణమే యామెను తమ సహోదరవర్గములో నొకర్తెగా తీసికొన్నారు. తండ్రి యింటికి వచ్చినాడు.

అంతఃపురములో స్త్రీలమధ్యనే యున్నప్పటికి ఆమె అందము, చందము అందఱకు నసూయ కల్పించినది. ఆమెను ఏరీతిగానైనను రాజుగారి దృష్టిపథములోనుండి తప్పించుటకు ప్రయత్నించినారు. ఆమెకు హీనమైన పనులను నియోగించేవారు

వానిని యోగ్యతతో నామె నిర్వహించేది. మృగచర్మములపై రోమములను నిర్మూలించు పని నిచ్చినారు. అదియు నామె చేసినది. ఆపై నీకు మంగలిపని వచ్చునా యని యడిగినారు. ఆ పనియూ చేతనగును. అని ఆమె చెప్పినది. అప్పుడామెను అంతఃపురములోనున్న కొజ్జాలకు క్షవరము చేయుపనిలో పెట్టినారు. ఆ పని ఆమె చేయుచుండెడిది. ఇంతలో ఒకనాడు, రాజుగారి ఖాసా మంగలి రాలేదు. రాజుగారత్యవసర కార్యము మీద అవశ్యకముగా వెళ్ళవలసి యుండెను. "ఇంకా మంగలి రాలేదేమి?" అని రాజు చికాకు పడుచున్నప్పుడు ఒక పరిచారిక వచ్చి "మంగలి పని నేర్చిన యొక దాసి యంతఃపురమున నున్నది" అని విన్నవించినారు. రాజుగారు తక్షణమే తీసికొనిరమ్మనినారు. ఆమె భయపడుచు వచ్చి నమస్కరించినది. కాని రాజుగారి ప్రసన్న గంభీరమైన మొగము చూడగానే భయము పారిపోయినది.

"క్షౌరము చేయుమని సెలవా?" అని ఆ దాసి అడిగినది. రాజుగారామె ముఖమువైపు చూచి, 'మగవారు చేయుపని, నీవు చేయగలవా?' అని ప్రశ్నించినారు. "అవసరాన్ని బట్టి ఆ విద్య నేర్వవలసివచ్చినది ప్రభూ! తామనుగ్రహిస్తేనా నేర్పు చూపుతాను" అని ఆమె ప్రత్యుత్తరమిచ్చినది.

"సరే" అన్నారు రాజుగారు. క్షౌరము చేయుడము ప్రారంభించుసరికి రాజుగారికి కొంచెము నిద్ర వచ్చినది. ఆ నిద్రకు నేమాత్రము భంగము కలుగకుండ పని పూర్తిచేసినది. రాజుగారికి తెలివి వచ్చినది. అద్దములో ముఖము చూచుకొన్నారు. చంద్రబింబమువలె ముఖము ప్రకాశించినది. చంద్రముఖి క్షవరము చేసిన ముఖము చంద్రబింబమువలె కాక మరియొక రీతి యెట్లుండును? రాజుగారు చాల సంతోషించి కావలసినది కోరుకొమ్మన్నారు. తప్పక యిత్తునన్నారు. ఆమె, రాజుగారినే భర్తగా కోరినది. "నీవు హీనజాతి స్త్రీవి. నేనెట్లు పెండ్లాడుదును" అని రాజుగారు చెప్పినారు. "నేను బ్రాహ్మణజాతి స్త్రీని మీ అంతఃపురములో........."అని జరిగిన కథ యంతయు యేకరువు పెట్టినది. రాజుగారామెను దేవేరిగా పరిగ్రహించినారు. ఆమెకు పుట్టినవాడే జగద్విఖ్యాతి యశస్కుడగు అశోక చక్రవర్తి.

ఈ రెండు కథలు "The Nepalese Buddistic Literature" అను గ్రంథము నుండి గైకొనబడినవి. ఆ గ్రంథము క్రీ. శ. 1882 లో నచ్చయినను నిప్పుడు లభ్యముకాదు.

# కాదంబరీ కథకు మూలం?

బాణకవి కాదంబరీ కథావస్తువును ఎక్కడినుంచి గ్రహించాడు? ఎవరికి ఋణపడిఉన్నాడు? అనేది వివేచించడం యుక్తం.

సోమదేవుడు రచించిన కథాసరిత్సాగరం దశమ లంబకం 19 వ తరంగంలో సుమనసుడనే రాజు - ముక్తాలత అనే నిషాదకన్యల కథ కనిపిస్తుంది. ఈ కథకూ, కాదంబరీ కథకు గణనార్హమైన వ్యత్యాసాలున్నా, ఉన్న పోలికలు గమనించదగినవి. కథావస్తువులోను, రచనలోను ఈ రెండింటికీ వ్యత్యాసం కనిపించదు. కథాసరిత్సాగరం రచించిన సోమదేవుని సంపూర్ణ నామధేయం భట్టశ్రీ సోమదేవుడు. అతడు 11 వ శతాబ్దిలో కాశ్మీరదేశాన్ని పరిపాలించిన అనంతరాజు కాలంవాడు. అనంతరాజు పత్ని అయిన సూర్యావతి ప్రోత్సాహంతో అతడు బృహత్కథను అనుసరించి సంస్కృతంలో కథాసరిత్సాగరం వ్రాశాడు. ఇది మూలంలోని అన్ని కథలనూ గ్రహించింది.

సోమదేవుడు 11 వ శతాబ్దివాడు గనుక అంతకు ముందున్న బాణభట్టు అతని కథాసరిత్సాగరం చూడడం అసంభవంకదా! కనుక సోమదేవుని కథాసరిత్సాగరానికి మూలమైన బృహత్కథనుంచే బాణుడు ఈ కథావస్తువును స్వీకరించి ఉంటాడనడం సహేతుకం. గుణాఢ్యుడు పైశాచీభాషలో వ్రాసిన ఈ బృహత్కథ నేడు ఉపలబ్ధంకాదు.

బృహత్కథను క్షేమేంద్రుడనే మరొకడుకూడా అనువదించాడు సంస్కృతంలో. ఇతడుకూడా కాశ్మీర్ వాడే. ఇతడు అనంతరాజు కాలంలో (1028-1080) ఉన్నవాడు. ఇతనికి నామాంతరం వ్యాసదాసుడని. గుణాఢ్యుని బృహత్కథ పైశాచీభాషలో ఉండడంవల్ల సర్వజనాదృతంకానందున, అదొక బృహద్గ్రంథంగా ఉన్నందున ఇతడు దానిని 'బృహత్కథామంజరి' అనే పేరుతో సంస్కృతంలో వ్రాశాడు. ఇతడు పద్యకాదంబరి అనే గ్రంథంకూడా వ్రాశాడని ప్రతీతి.

బృహత్కథా రచయితఅయిన గుణాఢ్యకవి క్రీస్తుశకం ప్రథమ శతాబ్దంలో ఉన్నవాడు. ఇతడు ప్రతిష్ఠానపురాధీశ్వరుడైన సాతవాహనుని ఆస్థానంలో ఉన్న

వాడు. కనుక ఇతనికాలం ప్రథమ శతాబ్ది అని అందరికీ తెలిసిన విషయమే. ఈ బృహత్కథ కాదంబరికే కాక ఇంకా పెక్కు మహాకావ్యాలకు, నాటకాలకు మాతృక అయింది. శ్రీహర్షుడు తన నాగానంద ప్రియదర్శికా రత్నావళీ రూపకాలకు, విశాఖదత్తుడు తన ముద్రారాక్షసానికి, భవభూతి తన మాలతీమాధవానికి బృహత్కథనుంచే వస్తువు గ్రహించారు. పంచతంత్ర, హితోపదేశ, బేతాళపంచవింశత్యాదులకుకూడా బృహత్కథే ఆకరం.

బాణుడు కాదంబరిలో ఈ బృహత్కథను గురించి ఉజ్జయినీపట్టణవర్ణన సందర్భంలో "బృహత్కథా కుశలేన" అని ప్రస్తావించాడు. బాణుడు గుణాఢ్యునినుంచే తన కథావస్తువును గ్రహించాడనే ఊహను ఇదికూడా దృఢపరుస్తున్నది. ఈవిధంగా బృహత్కథనుంచి గ్రహించిన వస్తువును బాణుడు పెక్కు రీతులుగా మార్చుకొన్నాడు.

బాణుని కాదంబరిని సంగ్రహించి 'కాదంబరీ కథాసారః' అనే పద్యకావ్యాన్ని కాశ్మీరవాసిఅయిన అభినందుడనే మహాకవి 9 వ శతాబ్దిలో నేరచించాడు. ఇది అనుష్టుప్ ఛందస్సులో ఉంది.

(అన్నల్స్ ఆఫ్ ఓరియంటల్ రీసెర్చ్—మదరాసు విశ్వవిద్యాలయం — లోని శ్రీ వి. శంకరకేదలాయగారి వ్యాసంనుంచి-1958.)

# ప్రాచీనవాస్తువులో గచ్చు, గార

ప్రాచీనభారతీయ వాస్తుశాస్త్రగ్రంథాలలోని కొన్ని సంకేతపదాల అర్థాలు తెలిస్తేనే కాని, సిమెంట్ మొదలయిన నిర్మాణసామగ్రిలేకనే ప్రాచీనులు ఎంతటి బ్రహ్మాండమైన భవనాలు కట్టేవారో మనకు అర్థం కాదు. కల్కమనే పదాన్నే తీసుకుందాం. ఇది కాశ్యపశిల్పం 84 వ అధ్యాయంలో వివరించబడింది. కల్కమంటె శాస్త్రీయంగా చూస్తే గృహనిర్మాణంలో ఉపయోగించే మృదువైన గారవంటి పదార్థం. ప్రాచీనులు దీనిని ఇలా నిర్వచించారు :

"ద్రవ్యమాత్రం శిలాపిష్టం
    శుష్కం వా జలమిశ్రితం,
తదేవ సూరిభిః పూర్వైః
    కల్క ఇత్యభిధీయతే."

ఈ కల్కానికి ప్రధానంగ వాడే పదార్థం శర్కర. అంటే నదులలోనో, చెరువులలోనో, బావులలోనో, నీరు తరచుపారేభూములలోనో దొరికే ఇసుక. ఈ శర్కర పెద్ద పెద్ద పలుకులుగా ఉండాలి; దళసరిగా బరువుగా ఉండాలి; త్వరగా నీటిలో కలిసిపోయేదిగా ఉండరాదు. (దీనిని ఇప్పటి ఇంజనీర్లుచెప్పే "హార్డ్ గ్రావల్" అనవచ్చు) కల్కానికి ఈశర్కరను గ్రహించాలి. దీనిని నీటితో కడిగి ఆరబెట్టాలి. తర్వాత సూరి గుండ్రటి ఉండలు చేయాలి. ఈ ఉండలను క్రమంగా ఆరబెట్టి వీటిపైన బంకనీరు చిలకరించాలి. ఈ చిలకరింపు మూడువిధాలు: (1) స్వస్రుతం, (2) స్యాచలం, (3) సైకతం, అని. స్వస్రుతమంటే నీరు హెచ్చుగా కలిపి ధారగా పోయడం. స్యాచలమంటే అంతగా నీరు ఓడికగా పారించకపోయడం. సైకతమంటే కొద్దిగా నీరు కలిపి చిలకరించడం. ఈ మూడింటిలోను శర్కరను, బంకనుబట్టిని, మనం అభిలషించిన కల్కాన్నిబట్టి వాడాలి. గోడలు కట్టడానికి వినియోగించే కల్కాన్ని సిద్ధపరచడానికి సైకతం, పైగారగా వాడడానికి స్యాచలం, గండ్లు మొదలయినవి పూడ్చడానికి స్వస్రుతం అనుసరించాలి. ఈ శర్కర ఉండలను బంకనీటిలో బాగ పొర్లించాలి. పిదప దారాలు ముక్కలుచేసి కలపాలి; అంటే నారైనా సరే. అప్పుడిది అడుసులాగ అవుతుంది. వెంటనే ఉపయోగించవచ్చు.

ఈ మూడురకాల కల్కాలలోను సెల్లపు నీరు పోసి అది కలవడానికి బాగా మర్దించాలి. దీనితో పూత పూస్తే గోడ మొదలయినవి బీటవారవు. ఈ పూతను మూడునెల్లు- కనీసం నెల-ఆరనివ్వాలి. దీనిపైన ఉడికే అన్నపు గంజికలిపిన మన్ను కలిపి, మంచినీరు చేర్చాలి.

శిల్పరత్నాకరంలో వజ్రలేప కల్కవిధానం ఇలావుంది.

అమంతింధుక చూమం
    కపిత్థకం పుష్పముపద శాల్మలాశ్చ,
బీజాని సల్లకీనాం
    ధన్వనవల్కం వచాచేతి.
ఏతైః సలిలద్రోణః
    క్వాథయితవ్యోష్టభాగశేషశ్చ,
అవతార్యోస్యదకల్కః
    ద్రవ్యైరేతైస్సమనుయోజ్యః.
శ్రీవాసక గుగ్గులభ
ల్లాతక కుందురుక సర్జరసైః,
అతసీబిల్వైశ్చ యుతః
కల్కోయం వజ్రలేపాఖ్యః.

(510 వ పుట.)

(బరోడా యూనివర్సిటీ ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ జర్నల్ లోని శ్రీ డి. సుబ్బారావుగారి వ్యాసంనుంచి.)

# గ్రంథ విమర్శనము



## విశ్వనాథ నాయుడు

[కర్త. శ్రీ. సి. నారాయణరెడ్డి. సరోజా ప్రచురణలు, హైద్రాబాదు. ప్రతులకు: ఆంధ్రబుక్ హౌస్, సుల్తాన్‌బజార్, హైదరాబాదు. 87 పుటలు. వెల: 2 రూ.]

ఇది మాత్రాఛ్ఛందస్సులలో ఆరు ఖండములుగా వ్రాసిన కావ్యము. ఇతివృత్తము చారిత్రకము—చోళరాజు చంద్రశేఖర పాండ్యుని ఓడించి రాజ్యము లాగుకొనగా పాండ్యుడు శ్రీకృష్ణదేవరాయలను శరణుజొచ్చెను. రాయలు నాగమనాయడను దళవాయిని పాండ్యునికోరిక దీర్చుమని పంచెను. నాగమనాయడు చోళరాజును తరిమికొట్టి గురాశతో తానై పాండ్యుని రాజ్యము తానేయేలగోడగెను. పాండ్యుడు మరల రాయలతో మొర పెట్టుకొనెను. నాగమనాయనిబట్టి తేగలవాడెవడని సభలో రాయలడుగగా నెవ్వరును ముందుకు రాలేదు. నాగమనాయని కుమారుడైన విశ్వనాథనాయడు తాను ముందుకువచ్చి స్వామిభక్తి ప్రకటించెను. రాయల ఆజ్ఞతో విశ్వనాథనాయడు వెళ్లి తండ్రిని జయించి బంధించి తెచ్చి రాయలముందు నిలిపెను. రాయలాతని ప్రభుభక్తికి సంతసించి పాండ్యుని సమ్మతిపై పాండ్య రాజ్యమును విశ్వనాథనాయని కిచ్చి యేలుమనెను. నాగమనాయని క్షమించెను. ఇందలి కథయిది. ఈకథ 'తంజాపురాంధ్రరాజుల చరిత్ర'లో నున్నది.

తండ్రికొడుకులు పోరాడిన కథలు చాలతక్కువే. బభ్రువాహను డర్జునుతో పోరాడినాడు. అదియు క్షత్రియధర్మముకొరకు. ఇంగ్లీషులో తండ్రికొడుకుల పోరాటమును వర్ణించు 'సోహరాబ్ అండ్ రుస్తుమ్' అనే కథను ఆర్నల్డ్ వ్రాసినాడు.

తెలుగుపాఠకులకు పరిచితులైన శ్రీ సి. నారాయణరెడ్డిగారీపై చారిత్రక కథను ప్రసన్నమధురముగా తీర్చినారు. నాగమనాయనికి సంతానము లేక లేక విశ్వనాథుని తల్లి పూజించుటవలన విశ్వనాథనాయడు పుట్టెనన్నది మల్లికాంబయన్నది కవి క్రొత్తగా కల్పించిన విషయములు. చివర చంద్రశేఖరపాండ్యుడు తానే రాజ్యమును విశ్వనాథుని కీయదలచెనని రాయలతో జెప్పుట కూడ నిట్టిదేకావచ్చును. ఈ కావ్యమున విశేషమేమనగా కవి ధర్మవీరమును పోషించుట. అంత్యనియమాల కంతగా ప్రయత్నింపకపోవుట వల్ల నేమి, ఛందస్సులో ఖండగతి, త్రిశ్రగతి, మిశ్రగతులను, క్వాచిత్కంగా చతురశ్రగతిని—మనసులో నుంచుకొని వ్రాయుటవల్ల నేమి ధార చక్కగా నడిచినది. రచనలో వర్ణనలకు సాఫల్యము, శిష్టత, అచ్చటచ్చట వక్రత ఉన్నవి. ఉదయవేళ విశ్వనాథుని పూజించి భార్యతో గూడ బయటికివచ్చిన నాగమనాయడు—

"వెలుతురు పొత్తిళ్ళలోన
కిలకిలమని నవ్వుచున్న
బాలసూర్య బింబమ్మును
ఆలోకించెను—"

మల్లికాంబ—

"గూటినుండి వెల్వడి చిరు
కొమ్మమీద గూర్చొని తన
నిసుగు చుంచు దువ్వెడు పెం
టిని జూచెను—"

ఈమాటల యౌచిత్యము రమణీయమని చెప్ప నక్కరలేదు. అంతర్వత్ని యైన మల్లికాంబను కవి యిట్లు వర్ణించుచున్నాడు:

"చినుకు వడియెను; అవులింతల
ఫణితిగా ఆవిరులు లేచెను.
మల్లికాంబిక సస్యగర్భ
మైన ధారణి వోలె తోచెను."

ఈకథ వ్రాయుటలో కవి యొక్క తాదాత్మ్యము సాధించినాడు. అది కావ్యము చదివిననే తెలిసివచ్చు విషయము. ఇది నారాయణరెడ్డిగారి కవితాసాధనలో చెప్పదలసినమాట. కావ్యము ఉదాత్తముగా మధురముగా ప్రసన్నముగా నున్నదని వేరె చెప్పబనిలేదు. ఇది సాత్త్వికసాహిత్యమున చేరగల కావ్యమని చెప్పినచో చాలును.

ఎస్. ఆ.

# ప్రమాణ పద్ధతిపై ప్రసంగము

## (రెనె డెకార్ట్ (Rene Descartes)

[అనువాదం; శ్రీ కే. సచ్చిదానందమూర్తి, పి. హెచ్. డి; శ్రీ కె. వి. ఆర్. నరసింహం, పి. హెచ్. డి; ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణము; పీఠికగాక 118 పేజీలు; పీఠిక 36 పేజీలు; వెల 8 రూపాయలు.]

రెనె డెకార్ట్ 17వ శతాబ్దంలో ఐరోపాలో తలఎత్తిన తాత్వికులలో అగ్రగణ్యుడు. ఆయన పుట్టుకతో ఐరోపీయ తత్వశాస్త్ర వ్యవసాయం పెద్ద విప్లవానికి గురి అయింది. అంతకుముందు అక్కడ తాత్విక మీమాంసలన్నీ పరస్పరజ్ఞంగానూ, స్థితిస్థాపక హితంగానూ, దానికెన్ని లేనివిగానూ వుంటూవుండేవి. ఇందుకు క్రైస్తవ మతప్రాబల్యాన్ని ప్రబలకారణంగా చెప్పేవాళ్ళు వున్నారు. క్రైస్తవ మతం వట్టి నీతివాదం అవలంబించేది. అందులో తత్వాన్వేషణకి చోటు లేకపోయి, గ్రీకు మేధావులు దిద్దిన దార్శనిక మార్గాలు అడుగున పడిపోయినాయి. ఒండే, ఓడ్రకిగిపోయినాయి. క్రీస్తును నిందించిన ప్రవక్త, బైబిలును నిందించిన శాస్త్రము, లేవన్నభావం ఏర్పడిపోయింది. ఒకవేళ గ్రీకు మేధావులను అనుసరించేవాళ్లు ఎవరన్నా వున్నా, వాళ్ళు ఈ మతానికి విరోధం లేని పద్ధతి అవలంబించి, తమ్ము తాము కుంతితం చేసుకోవలసి వచ్చింది. లేదా ప్రాణాలు కోల్పోవలసి వచ్చింది. ఇందుకు గెలీలియో ఉదంతం ప్రథమ ఉదాహరణం.

ఇటువంటి కాలంలో డెకార్ట్ జన్మించి, పాశ్చాత్య తాత్విక మాగాణాలను తన మనస్సు అనే నాగలితో దున్ని, ముందు తరాలవారికి పసనైన క్షేత్రాన్ని, సుష్టు అయిన చాలులను దిద్దిపోయినాడు. అందుచేతనే ఆయన్ను, అధునాతన పాశ్చాత్య తాత్విక పితామహుడు అన్నారు. ఆ బిరుదం ఆయనయందు అన్వర్థం

డెకార్ట్ ఒక్క తత్వశాస్త్రంలోనే గాక ఇంకా అనేక శాస్త్రాలలో అరితేరిన మేధావి. ముఖ్యంగా గణితశాస్త్రం ఆయనకు ప్రాణం. ఆయన పద్ధతికి పట్టుగొమ్మ. ఈ గణితశాస్త్ర సత్యాలనే చాలా వరకు ఆయన తన తత్వశాస్త్ర మీమాంసకు ప్రమాణాలుగా దిద్దకముచేసి, ఆయన చెప్పిన దానికి ఒక క్రొత్త గౌరవము, ఒక క్రొత్త ప్రతిష్ఠ ఏర్పడ్డాయి. తరువాతివారు ఆ పద్ధతులను అనుసరించారు.

డెకార్టు చాలా గ్రంథాలు వ్రాశాడు (1) అ... గ్రా (2) జగత్తు (3) మనోవైతృత్య నిబంధనం (4) సంగీత కోశం (5) తాత్విక సూత్రాలు (6) ప్ర... పద్ధతి మీమాంస (7) ప్రమాణ మీమాంస లేక ప్రమా... పద్ధతి పై ప్రసంగము. ఇవిగాక ఇంకా చిన్నా, పె... గ్రంథాలు ఆయన వ్రాసినవి చాలా వున్నాయి. ఇప్పు... ఈ గ్రంథాలలో ప్రమాణ పద్ధతి మీమాంస లే... ప్రమాణ పద్ధతి పై ప్రసంగమును డా॥ సచ్చిదానం... మూర్తి, డా॥ నరసింహంగార్లు తెలుగులోకి అనువదించి చేసి, ఆంధ్ర ప్రజకు మహోపకారం చేసి పెట్టారు.

ఈ గ్రంథంలో కొంతభాగాన్ని డెకార్ట్ చిన్న తనంలోనే ప్రారంభం చేశాడు. ఆత్మకథ పద్ధతిలో ప్రారంభం చేశాడు. తర్వాత ఆగి, కొంతెం పెద్ద వాడైన తర్వాతగాని దాన్ని పూర్తిచేసి ప్రకటించలేదు. 1636 లో అది ప్రకటితమైంది. అప్పుడు దానిమీద చాలా గాలి దుమారం రేగింది. అసలు డెకార్ట్ తత్వం మీదనే కొంత ఛాందసులు పెద్ద దుమారం లేపారు. ముఖ్యంగా జి. వొటియస్. ఫెర్రా పండితులు ఈ పూర్వపక్షకులలో చెప్పుకో తగినవాళ్లు. వీరితో వ్యవహారం కోర్టుదాకా పోయింది. పెద్దలు కల్పించుకొని అభాసు కాకుండా రక్షించారు.

ఇప్పుడు రెనె డెకార్ట్ తత్వం యొక్క పూర్తి స్వరూపాన్ని వివరించడానికి ఇది సందర్భం కాదు. కాని ఒక్కటి మాత్రం చెప్పవలసి వుంటుంది. ఈయన బుద్ధి ఒక్క విధంగా రెండు శక్తులు పద్ధతిని పనిచేసింది. (1) పాశ్చాత్య తాత్విక ప్రపంచంలో దార్శనికమైన పద్ధతిని, శాస్త్రీయమైన ప్రమాణ విధానాన్ని ప్రవేశ పెట్టడం (2) తాను కేథలిక్కు మతానుయాయి గనుక, ఆ ధర్మం మీద విశ్వాసాన్ని వదులుకోలేక, తన ఆలోచనను కుంఠితం చేసుకోవడం.

ఇది చూస్తే మన తెలుగుదేశంలో శైవ మత ప్రవర్తకులలో ఒకరైన మల్లికార్జున పండితారాధ్యుల వారి ఒక పద్యం జ్ఞాపకం వస్తుంది. బండారు బసవడు బయలుదేరి వీరశైవ ధర్మాన్ని ప్రపంచిస్తూ వుండగా ఆరాధ్యులు వారికి, బసవడు చెప్పిన భక్తిసారం మీద వలపు పాలు పెక్కింది. కాని బ్రాహ్మణ్యంతో పొత్తు ఆరాధ్యుల వారిని వెనక్కు లాగింది. ఈ స్థితిని ఆయన ఒక పద్యంలో చక్కగా చెప్పారు.

"భక్తిమీద వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు
బాయలేను నేను బసవలింగ"

# గ్రంథ విమర్శనము

అట్లాగే డెకార్ట్‌కు కూడా శాస్త్రీయ దార్శనిక పద్ధతి (Dialecties) అంటువాపు; అట్లా అని కేవలం లెక్క మతంతో పొత్తును వదులుకోలేకపోవడం.— ఇట్లా చివరికి రెంటికి చెడిన రేవడయ్యాడు, అటు వారి చేతను, ఇటు వీరిచేతనుగూడా మందలింపులకు లోనై బాధ పడ్డాడు. ఆయన జీవితంలో అనండి, తాత్త్విక వ్యవసాయంలో అనండి, ఇదే విషాదవృత్తం అయి పోయింది.

ఇప్పుడు ఈ పరిశీలింపబడుతున్న "ప్రమాణ పద్ధతి" (డిస్కూర్ దొ లా మేథొడ్; Discours De La Methode) లో, తత్త్వ విజిజ్ఞాసను చేయడంలో తాను అనుసరించిన పద్ధతి, పెట్టుకున్న ప్రమాణాలు, ఏమిటో డెకార్ట్ వివరించాడు. తనకు ముందున్న పండితులు, సమకాలీనులైన పండితులు అనుసరించిన, అనుసరిస్తున్న "బట్టీ" మార్గం ఆయనకు నచ్చలేదు. యథార్థమైన జ్ఞాన సంపాదనకు హేతువ్యక్తిని సంపాదనం చేసి పెడితేనేగాని కుదరదు. పూర్వపు బట్టీ పద్ధతిలో ఈ హేతువు గాని, స్వతంత్రమైన ఆలోచన కాని లేదు. వాటికి అందులో స్థానంలేదు. అందు చేత డెకార్ట్ ఆ మార్గం తనమార్గం కాదనుకున్నాడు. క్రొత్తమార్గాన్ని దిద్దడంలో గణితశాస్త్రాన్ని గట్టిగా వినియోగించుకున్నాడు. ఇందుకు కారణం వుంది. డెకార్ట్ లెక్కల్లో "జనమ్యాటిక్" శాఖకు చెందినవాడు. వాడు గాని. మరి యే యితర మతవర్గం వాడుదాని, గణితశాస్త్రంయొక్క అధికారాన్ని, ప్రామాణ్యాన్ని తిరస్కరించలేదు. అందువల్ల ఈ గణితం సహాయంతో ఆయన ఐరోపాలో నూతన దార్శనిక పద్ధతిని ఏర్పాటు చేశాడు! Analytical Geometry ఆధారంగా సర్వశాస్త్ర సమన్వయానికి పూనుకున్నాడు. అప్పటికి అది గొప్ప.

ఇక ఆయన విజిజ్ఞాసకు ఆధారంగా నిర్ణయించుకున్న ప్రమాణ పద్ధతులు ఇవి. (1) తాను సత్యం అని దేనిని గూర్చి తెలుసుకున్నాడో దాన్ని గ్రహించడం. (2) ప్రతిష్ఠాపిత సత్యాన్ని అనుమానించి, మీమాంసకుగూడా, నిత్య శంకితుడు కాకుండా వుండడం. (8) చిక్కు సమస్యలు వచ్చినప్పుడు ఆ సమస్యను పరిష్కరించడానికి వీలుగా, ఆ విషయాన్ని విభజించి పరిశీలించడం (4) ముందు మిక్కిలి సులభములూ సరళములు, అయిన ప్రతిపాదనలతో ప్రారంభించి, వాటిని గూర్చిన ఆలోచనలను ఒక్క క్రమంలో పెట్టి, ఆతిశ్యాత క్రమంగా, కనిపిస్తున్న జటిల విషయాలవైపుకుపోయి, అక్కడకూడా ఆలోచనలకు ఒక్క క్రమరూపాన్ని సంతరించడం (5) ఈ విజిజ్ఞాసలో ఏ ఒక్క అభిప్రాయాన్ని తాను విడిచినట్లు అనిపించకూడదు. ప్రతి ఒక్క విషయాన్ని గూర్చి అట్లా కూలంకషంగా సమీక్ష చేయడం. (6) సత్యాన్వేషణంలో ప్రతిజ్ఞా విషయాన్ని, గణితశాస్త్రజ్ఞులు మాత్రమే సరిగ్గా నిర్ణయించినట్లు, పూర్వపు అనుభవాన్ని బట్టి తేలుతున్నది గనుక, దానిని ప్రధానప్రమాణంగా నిర్ణయించుకోవడం. (7) ప్రపంచంలో జ్ఞానంచేత తెలుసుకో తగిన విషయాలన్నీ పరస్పర సంబంధం కల్గివున్నట్లు అనుమానంచేత నిర్ణయం అవుతున్నది గనుక, ఆ పద్ధతిని అనుసరించి, అసత్యాన్నుంచి సత్యాన్ని వేరుచేసి, దానిని శాస్త్రీయంగా నిరూపించడం—ఇట్లా డెకార్ట్ కొన్ని ముఖ్యమైన ప్రమాణాలు దిద్దుకున్నాడు.

అందుకే ఫ్రెడెరిక్ ఎంజిల్స్ (Frederic Engels) వంటి సమగ్రతాత్త్వికవేత్తకూడా డెకార్ట్‌ను నూతన దార్శనికమార్గ స్థాపనాచార్యులలో ప్రముఖుణ్ణిగా పేర్కొన్నాడు. ఐరోపాలో మధ్య యుగంలో లోపించి పోయిన తాత్త్విక దార్శనికపద్ధతికి, ఈయన, ఈయన సమకాలీనుడే అయిన స్పినోజా, తిరిగి ప్రాణం పోశారు అన్నాడు. అందుకు కారణం వుంది. గ్రీసులో అరిస్టాటిలు పక్కా దార్శనికుడు. ఆయనకు ముందు హెరాక్లిటస్ కూడా ఈ దార్శనికమైనపద్ధతిలోనే తత్త్వచికిత్స కొనసాగించి వున్నాడు. అలెగ్జాండ్రియన్ శకం నాటి తాత్త్వికులుకూడా దార్శనికమైన పద్ధతిలోనే ఆలోచనలు చేశారు. ఐతే క్రైస్తవ మత ప్రాబల్యంతో ఈ పద్ధతి మంటకలిసి గంటు వాయించింది. తిరిగి —డెకార్ట్ దానికి ప్రాణప్రతిష్ఠ చేశాడు. దానికి మళ్ళీ ఒక గౌరవాన్ని, ఒక ప్రతిష్ఠను తెచ్చి పెట్టాడు. అప్పుడు ఐరోపీయ తాత్త్విక ప్రపంచంలో ఒక వ్యవస్థ అంటూ ఏర్పడింది.

డెకార్ట్ చెప్పిన విషయాలు ప్రాచ్య తాత్త్వికులకు, ముఖ్యంగా భారతీయ తాత్త్వికులకు తెలియనివి అంటే, అనడానికి లేదు. ముఖ్యంగా మనస్సును గురించి, దేహాన్ని గురించి, ఆత్మను గురించి, భగవంతుణ్ణి గురించి ఈయన చేసిన మీమాంస అంతా, మన వారు ప్రవహింపచేసిన అఖండ తత్త్వ భాగీరథి ముందు పిల్ల కాల్వలాగా కనిపిస్తుంది. ముఖ్యంగా మనస్సును గురించి డెకార్ట్ యేమి, ఇతర ఐరోపీయ తత్త్వవేత్త

లేమి, జరిపిన, జరుపుతున్న మీమాంసలేమి, మన శాస్త్రీయులు జరిపిన మీమాంసలకు చాలా తక్కువ అవు తాయి. ఈ విషయాన్నే ఈ మధ్య ప్రొఫెసర్ హాల్డేన్ స్పష్టంగా చెప్పివున్నారు.

గణితశాస్త్రాన్ని కూడా మనవాళ్ళు తత్వ మీమాంసలో బాగా వాడుకున్నారు. అందుకు ఉపని షత్తులే సాక్ష్యం. ఈ మంత్రం చూడండి:

"ఓం,
పూర్ణమిదః పూర్ణమదః
పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావశిష్యతే
ఓంశాంతిః, శాంతిః, శాంతిః"

ఈ ప్రమాణపద్ధతి తర్జుమానుగురించి చెప్పగల సింది ఏమీలేదు. డా॥ మూర్తి ఆంధ్రవిశ్వవిద్యాల యంలో తత్వశాస్త్ర పీఠాధిపతులు. డా॥ నరసింహం అక్కడే తెలుగు ఉపన్యాసకులు, అయినా కొన్ని చోట్ల వాక్యాలు పటిస్తున్నట్లు వున్నాయి. అవి సర ళంగావుంటే బాగుండుననిపించింది. ఉదాహరణకు:—

"మనుష్యయోగ్యములైన జ్ఞానవిషయము లన్నియు పరస్పరము సంబంధము కల్గియున్నవనియు సత్యమునకు బదులు, మనము, అసత్యమును పరిగ్రహిం చుట మానివేసి, ఒక సత్యమును మరొక సత్యమునుండి అనుమానించుట కవసరమగు పద్ధతిలో మన ఆలోచనల నెల్లప్పుడు పదిలపరచుకొనినచో, మన అందుబాటు నకు దూరముగను, మన మన్వేషణము చేయలేనంత ప్రచ్ఛన్నముగను ఏదియు లేదనియు నేను భావించు నట్లుగా చేసినవి. (29 పేజీ)

"కావున భావిపట్ల నాశాపూర్ణుడనై యుండుట నాకు తప్పనిసరి యగుచున్నది." (5 పేజీ)

"మన తెలివి, మంచిదనియో చెడ్డదనియో, విచ రింపవలసినంతవరకు, మనమేవస్తువును కోరుటగాని, వర్జిం చుటగాని చేయము గాన, ఉచితాచరణకు ఆవశ్యక మైనదంతయు ఉచితమగు నిశ్చయకబుద్ధి మాత్రమే."
(పేజీ 48)

"ఏలన శక్తిమంతమగు మనస్సు కలిగియుండుట చాలదు." (పేజీ 1)

ఈ పద్ధతి వాక్య నిర్మాణంలో విజాతీయ వాసనలు కొడుతున్నాయి. ఈ గ్రంథం ఇంకోసారి అచ్చు పడే సందర్భంలో ఈ లోపాన్ని దిద్దుకుంటే సంతో షము. పుస్తకముద్రణ అధికంగా వుంది. ఈ గ్రంథాన్ని అనువాదకులు సింహాచలం వరాహ నరసింహస్వాముల వారికి సమర్పించారు. ఉచితంగా వుంది.

హా. శ్రీ.

## రాలిన పూలు

[కథాసంపుటి. సంపాదకుడు: శ్రీ గుళ్లపల్లి నాగేశ్వరరావు. ప్రకాశకులు: జ్ఞానమందిర్ కృష్ణ లంక, విజయవాడ. పుటలు: 142. మూల్యం: రెండు రూపాయలు.]

ఎన్నో పువ్వులు, పుట్టుతూ గిట్టుతూ ఉంటవి. మొగ్గలుగానే ఉండిపోయేవి కొన్ని. కొమ్మను ఉండేవి కొన్ని. ఇతరులకు ఆనందం కలుగజేసేవి ఒక కొన్ని. వికసించే శక్తి అన్ని పువ్వులకూ లేదు. కొన్ని టికే ఉంటేమో! శక్తి ఉన్నా వాతావరణం అనుకూలిం చనిదే వికసించడం సంభవం కాదు వికసింపజేసే సాధ నమూ అవసరమే.

మానవ హృదయం కూడా అలాంటిదే. హృద యానికి వికాసం కలుగజేసే సాధనం మరీ అవసరం. అన్నీ అనుకూలించినా హృదయం వికసించడం చాలా గొప్ప విషయం. వేరొక హృదయాన్ని వికసింప జేయడం నిజంగా అపూర్వమే. ఉత్తమమైన కావ్య రచనను ప్రేరేపేదికదా ఇది!

తెరచుకొన్న హృదయ కవాటాలకు తిరిగి మూత పడే శక్తిలేదు. వికసించిన పువ్వుం వాడిపోవలిసినదే కాని తిరిగి ముకుళించుకొనలేదు. ప్రకృతి ధర్మమే అంత.

మధువు ఆస్వాదించే తుమ్మెద యోగ్యతా యోగ్యతలతో వికసించిన కుసుమానికి నిమిత్తంలేదు. పుష్పానికి వలెనే హృదయానికీ విలువలు కట్టే శక్తి కూడా లేదు.

కోరి హృదయం అర్పించుకొన్న స్త్రీ ఎన్ని ఇడుములు అయినా సహించగలదు. కాని తనివితీర ప్రేమామృతం జుర్రి ఆ హృదయాన్నే నిరాకరించడా నికి పురుషుడు పూనుకొంటే మాత్రం స్త్రీ సహించ లేదు. మృత్యువునే కోరుకొంటుంది. హృదయం కరవు అయిన తరువాత అయినా సత్యాన్ని గుర్తించక తప్పని ఆ అభాగ్యుని జీవితం నాశనం అవుతుంది. 'వరవిక్రయ' లో దీనినే ఉదాత్తమైన విధంగా చిత్రించారు శ్రీ బలివాడ కాంతారావు. సమకాలిక సాహిత్యంలో ఈ

# గ్రంథ విమర్శనము

కథకు విశిష్టమైన స్థానం ఉన్నదంటే అతిశయోక్తి లేదు. 'రాలిన పూలు' ను ఈ కథకోరకు అయినా చదువవచ్చు.

శ్రీ మిక్కిలి సుందరరావు రచించిన 'అమ్మ తప్పుచేసింది' ఈ సంపుటంలోని మొదటి కథ. పంచకు చేరిన అనాథబాలుని చేరదీసి కడుపులో పెట్టుకొని కన్నబిడ్డలా సాకినది ఒక వేశ్య. ఆర్జించిన డబ్బుతో చదువు చెప్పించి జీవనాధారమూ కల్పించినది. అప్పటికి కాని (!) ఆమె వేశ్యఅని తెలుసుకొనలేదు అతడు. ఆమెను విడిచిపెట్టాడు. చివరికి ఆమె మృతిచెందే సమయంలో ఆమెతప్పును మన్నించాడు ఆమనిషి. అలౌకికమైన త్యాగాన్ని మాతృత్వాన్ని అపహాస్యం చేస్తున్నది ఈ కథ. అసంబద్ధంగానూ ఉన్నది.

'విశాలహృదయుం' శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు రచించారు. ఒకానొక రాక్షస హృదయుడైన వైద్యుడు వేరొక సహృదయుని ప్రాక్టీసు పాడుచేయడానికి తాను లేవదీసికొని వచ్చిన స్త్రీని ఉపయోగించి చివరికి ఆమెను భంగపరిచాడు. ఆమె నిజం చెప్పకొని క్షమాభిక్ష పొంది తాను మోసగించిన వైద్యుని ప్రేమకు పాత్రురాలు అయినది. 'విష్‌ఫుల్ థింకింగ్' ఈ కథకు మూలం. ఇదొక గిలిగింతవంటిది.

ఎవతెనో లేవదీసుకొనివచ్చి కాపురం పెట్టిన మిత్రుని విమర్శించిన పెద్దమనిషిలో వాంఛ రగుల్కొల్పి గుణపాఠం నేర్పిన ఆ సహృదయురాలి కథ 'కావ్యశ్రీ' రచించిన 'అంతరాలు' వాస్తవానికి విరుద్ధమైన ప్రవృత్తులు, అనుభవాలతో కూడి ఉన్నది.

భర్త గతించాడు. పిల్లలకు తిండిపెట్టి బ్రతికించుకొనే ఉపాయం లేకపోయింది. మానం అమ్ముకొని కన్నబిడ్డలను దక్కించుకొన్న ఆ స్త్రీని అవమానం చేస్తున్నది శ్రీ పాలకుడు దుర్గాప్రసాదరావు రచించిన 'అపశ్రుతి'.

భర్త చావుకు కారణమైన స్త్రీ ప్రేమికునితో జీవితశేషం ఆనందంగా గడపాలనుకొన్నది. కాని ఆ భర్తచావే ఆలాంటికోరికకే గొడ్డలిపెట్టు అయింది. శ్రీ దివ్యప్రభాకర రచించిన 'పచ్చిమొక్కలు' కథాసాహితీవనంలో ప్రభవించిన పిచ్చిమొక్కలలో ఒకటి.

శ్రీ 'రాఘవ' రచించిన 'సర్వదష్టులు' మూఢనమ్మకాలు, అయోమయమైన భావన ఆధారం చేసుకొన్న గాథ.

'లత' రచించిన 'గోపీహృదయం' కథకాదు గద్యాత్మకమైన గేయం. ఆత్మార్పణాన్ని హృదయంగమమైన ఫక్కిలో నివేదించడం ప్రశంసార్హం.

'వరదవెల్లువ', 'గోపీహృదయం' మినహాయించితే తతిమ్మాకథలు అన్నీ నేటికథా సాహిత్యం స్థితిని ప్రతిబింబింప జేసేవి. ఆలోచనాశక్తి, కల్పనాశక్తి ఉన్నవి. కాని పరిచితమైన జీవితాన్ని అయినా సమగ్రంగా అవగతం చేసుకొనే ప్రయత్నం లేదు. రచనకు పూనుకొనేముందు భాషలో తగినంత అధికారం సంపాదించుకొనే పూనిక మృగ్యం. ఈ స్థితి ఒక్కొక్కప్పుడు నిరుత్సాహజనకంగా ఉంటుంది.

ఒకకోవకు చెందినకథలు ఎన్నుకొని సంపుటంగా ప్రచురించడం ప్రత్యేకంగా పేర్కొనదగినది. శీర్షిక తగిఉన్నది. —కామరాజు.

## అంగార వల్లరి

[రచయిత. శ్రీ కె వి. రమణారెడ్డి. ప్రకాశకులు: ఆంధ్ర అభ్యుదయరచయితల సంఘం, విజయవాడ. ప్రతులకు: విశాలాంధ్రప్రచురణాలయం, విజయవాడ–2. 40 పేజీలు. వెల అర్ధరూపాయి.]

తెలుగుకవిత్వంలో అభ్యుదయ కవితాశాఖ స్థిరపడిపోయిందనే చెప్పవచ్చు. శ్రీ శ్రీ, ఆరుద్ర, నారాయణబాబు, అనిసెట్టి, పఠాభి, దాశరథి, రమణారెడ్డి, మాదిరాజు మొదలైనవారంతా ఈ మార్గానికి చెందిన కవులు. వీరిలోనూ ఎవరికివారు విలక్షణమైన రచనామార్గాన్ని విగ్రహించుకొన్నవారు. రాజకీయ సాంఘిక సిద్ధాంతాలమీద నమ్మకాలెలావున్నా. వీరతాన్వోరకమైన వీరి రచనల్లో ప్రాథమికః సమత, శాంతి, సౌభ్రాత్రం, దౌష్ట్యంమీద తిరుగుబాటు మొదలైన విశ్వజనీన — మానవతావాదసోపానశీలాలైన — భావాలు వస్తువులు. ఎటొచ్చీ ఆ భావాలను సాంఘిక రాజకీయ విపర్యాలకు అన్వయించుకొనేటప్పుడే అర్థాలు చెప్పకోవడంలో ఇతరులకూ వారికీ తేడా కనబడుతుంది. కాని ఆ భావాలను కాదనడానికి సాధ్యంకాదు. అభ్యుదయ కవుల రచనలవలె ఉద్వేగశీలమైన రచనలు ప్రాచీన వైదిక సాహిత్యంలోనూ కనబడతాయి. కాని కొంత తేడా ఉంటుంది. ఈ బుక్కు చూడండి:

'అశ్మన్వతీ రీయతే సంరభధ్వం
ఉత్తిష్ఠత ప్రతరతా సఖాయః।

'అత్రా జహామ యే అసన్నశేవాః,
శివాన్ వయం ఉత్తరేమాభివాజాన్॥'
[ఋ 10-53-8.]

'పాషాణమయమైన నదము ప్రవహించుచున్నది. కలిసినడువుడు. మీ శిరస్సులు పైకినిలుపుడు. సఖులారా దాటుడు. సత్యమును వ్యతిరేకించు వారి నిట వదిలుదము. శ్రేయస్కరమైన సంస్థితులకొఱకై మనము తరించెదము రండు' అని దీని భావము. ఇంతకంటె అభ్యుదయ కవిత్వముండునా అనిపించే రచన యిది!

స్నేహాన్ని గూర్చి యజుర్వేదం ఏమంటున్నదో చూడండి:

'మిత్రస్య మా చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షంతాం।
మిత్రస్యాహం చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షే।
మిత్రస్య చక్షుషా సమీక్షామహే'(36-18)

'సర్వభూతములు నన్ను స్నేహదృష్టుల జూచును గాక! సర్వప్రాణుల నేను మిత్రత్వమున జూచెదను గాక! మేము పరస్పరము మైత్ర్యమున జూతుము గాక!' యని దీని భావము.

జాగృతిని గోరి వైదిక ఋషి 'త్రాతారో దేవా అధివోచతా నో మా నో నిద్రా ఈశత మోత జల్పిః' అని ప్రార్థిస్తున్నాడు. 'నిద్రావాచాలత్వములు మమ్ము లీనము గావింపకుండునట్లు తరింపజేయు దేవతలారా మమ్మాశీర్వదించుడు' అని దీని భావము. 'సత్యం బృహద్ ఋతం ఉగ్రం దీక్షా తపో బ్రహ్మ యజ్ఞః పృథివీం ధారయంతి'- సత్యం, శ్రేష్ఠత్వం, ఖండితమైన వ్యాయామం, ఏకాగ్రత, తపస్సు, ప్రార్థన, యజ్ఞాలు పృథివిని ఉద్ధరిస్తున్నవని వారినమ్మిక... ఈ వాటె మన అభ్యుదయ కవులు ఇవన్నీ కాకపోయినా ఇందులో కొన్నింటినైనా నమ్మినట్లు వారి రచనల్లో కనబడుతుంది.

ఇకపోతే రచనా శిల్పంమాట. ఒకనాడు అభ్యుదయ కవితలో కల్పించిన వట్టి తిరుగుబాటు తత్త్వం తగ్గి తెలుగు మాటలు కాని సంస్కృతపదాలు కాని భావానుగుణంగా వాడుకోవలసివస్తుందని ఆలోచించి చెప్పేవారు కనబడడం శుభోదర్కమే. కాని రసము ధ్వని అలంకారము మొదలైనవన్నీ వాదస్థాలనే అంటున్నారు. అలంకారాలస్థానంలో భావచిత్రణ (Imagery) చేస్తున్నారు. ఒకమాట ప్రక్కన మరొక మాట పొదిగితే విచ్ఛిత్తి కలుగుతుంది. అది చమత్కారాత్మకంగా ఉంటేనే చిత్తద్రుతికి కారణమవుతుంది. ఈదృష్టి తప్పినట్టు రచన ఆస్వాదయోగ్యం కాదు; పాఠకు డాస్వాదించలేడన్నమాట. అభ్యుదయ కవుల్లో సౌందర్యాపేక్ష చేత రకరకాల భావచిత్రాలు కట్టడానికి ప్రయత్నించేవారున్నారు. ఫలితంగా రచన 'కొరకరానికొయ్య' అవుతున్నది. వాడి, వేడి రెండూ ఉండి కొంత క్లిష్టంగా ఉన్నరచన ఈ అంగారవల్లరి.

ఇందులో పంద్రెండు ఖండికలున్నాయి. 'హత ప్రజాసీరుల అమృతస్మృతికి' వ్రాసినది 'అంగార వల్లరి' అనే ఖండిక. 'సూర్యస్తుతి రూపం తాల్చిన మానవహృదయ యవ్వన ప్రశస్తి' అయిన 'ఆవాహన'తో మొదలై మయకోవిస్కీ వ్రాసిన 'ది మార్చ్' అనేదాని కనువాదమైన 'ప్రస్థాన'మనే ఖండికతో ముగుస్తుంది సంపుటి. 'ఆవాహన'లో సూర్యుడు ప్రతీక మాత్రం. అట్లే 'అగ్నిపుష్పం' అనే ఖండిక 'స్వేచ్ఛాఫలాన్ని విప్లవ పూవుగా సంభావించిన పాట. కల్పవృక్షంగా స్వేచ్ఛ పేర్కొనబడింది.' అంగారవల్లరి అనే ప్రధానఖండిక 'చీకటి కాముక పూరుత్తి' అనే అర్థం కలదై 'స్మృతిలో కూడా ప్రకాశించే వీరులను నిర్దేశిస్తుంది.' ఇవన్నీ కవి కొన్నింటిని కొన్నింటతో సంకేతించి వ్రాసినవి. కవిత్వం సాంకేతికంగా ఉండవచ్చునా కూడదా అనేది మూలభూతమైన ప్రధాన చర్చనీయం!

'విశ్వవత్సల' అనే ఖండికలో 'మానవుణ్ణీ ప్రకృతినీ శాసించిన క్రమబద్ధగతిలో నడిపే విశ్వరహస్యము' వర్ణింపబడింది. అది దేవుడు మాత్రం కాదంటాడు కవి! పోతే 'బాధాగానము' 'చిట్టడివిలో చిన్నారి' అనే ఖండికలు 'గద్య పద్య గుణాలను కూడగట్టుకొని గొంతెత్తి చదివేందుకు అనువైన ఈ కావ్యధోరణి కొత్త' దంటూ వాటిని 'కావ్యోపన్యాసా' లన్నాడు కవి. ఈ కావ్య సంపుటిలో

'మూడుము నీ చూపులందు
చూత శాఖి చివురించేను;
కన్నుల వెలుగుల వెనుక
వాంఛా కేళీ వాటిక'

వంటి మెరుపులూ ఉన్నవి. 'గుడ్డిసంజ' వంటి నైరాశ్యం నిలిచి ఉన్నవి.

'వసలిన ద్రాక్షకు మధురించే శీతోష్ణస్థితిగల' స్పెయిన్‌లో ప్రతిభావంతుడూ ప్రఖ్యాత రచయితా అయిన క్రిస్టఫర్ కాడ్వెల్ చనిపోయినదాన్ని

# గ్రంథ విమర్శనము

జ్ఞాపకం చేసుకొన్న స్వతంత్రగీతం—ఇటువంటివే ఆయన ఇతరాలూ ఉన్నవిందులో. ఈ స్వతంత్రగీతాల్లోని వారి పూర్వాపరాలు తెలిసినవారికి ఈ గీతాల్లో ఉన్న మహాభారతగాథ కరతలామలకమని శ్రీ శ్రీ పరిచయంలో వ్రాయడంచేత ఈ ఖండికా సంపుటి పాఠక లోకపు పరిధి చాలా పరిమితమే నేమో అనుకోవలసి వస్తుంది. ఏమైనా రమణారెడ్డిగారి చేవగల చెయ్యి; పసగల పలుకు.

## 'కిర్మీరం'

[గేయాలు: కర్త: శ్రీ మాదిరాజు రంగారావు; అభ్యుదయ సాహిత్యమాల, 17.F-350 సబీగ పుర్, హైదరాబాదు 2. 53 పుటలు. వె. 62. న. పై.]

ఇందులో ఇరవై ఖండికలున్నాయి. శ్రీ రంగారావు రచనలో క్లిష్టత తక్కువే. కాని భావచిత్రణ మీద మోజు. శబ్దాలమీద వ్యామోహం కొంత ఉంది.

'ఎన్నిమార్గాలు నీకాలోకాన
కొంత కష్టం ప్రయోగించినా
శిథిమా ఈ చీకటి వటవృక్షం
మాటిమాటికీ శాఖోపశాఖలుగా
ప్రస్తరించి, దిగంతాల
ఎగసి యెగసి గగనంలా
నిలచిపోవాలని చూస్తుందేం?'

అని (8 పుట) స్పష్టంగా వ్రాసినా కొన్నిచోట్ల అయోమయంగానూ ఉంటుంది చూడండి:

'ఎంత స్వర్గానందమయ మీ ప్రపంచం
తత్ ప్రతిబింబమేగా ఈ జీవితం.'

ఈ రచనలో కన్పించే విశేషమేమంటే ఈయన తక్కినవారివలె గాక పదార్థాలలోని పరాపర భేదం ఒప్పుకొనే వారిలాగ కనబడతారు. అభ్యుదయకవుల రచనల్లో ప్రముఖంగా కన్పించేవే అయిన 'నిప్పుపూలు' 'వెలుగు-చీకటి' 'ఆదరి సందేహం' 'ఇచ్ఛాగీతం' 'నాలో నేను' 'కీర్తి స్తంభాలు' 'ఘంటానాదం' 'క్రాంతి దర్శనం' మొదలైన ఖండికలున్నాయి. శ్రీ 'మహాప్రస్థానం' ప్రభావం ఈ ఖండికల శక్తికల్లోనే లీలగా కనబడుతుంది. పోతే, శ్రీ శ్రీ క్రొత్తగా సినీవాలి, 'భిక్షువర్షీయసి', 'పలిక్కి' వంటి శబ్దాలు అపురూపంగా వాడిన ఒరవడిలోనే శ్రీ రంగారావు గారు 'అలాస్' 'సుషీమ' 'ఎలంతికా' 'ప్రవాహిను' మొదలైన పదాలను వాడినట్లుగా తోస్తుంది. 'అభ్యుదితులకు నవాభ్యుదయమూ...' (25 పు.) అన్నచోట అభ్యుదితులు అన్న మాటకు సూర్యోదయమైన పిదప కూడా నిద్రించేవారని అర్థమేర్పడుతుంది. ప్రొద్దు పొడిచిన పిదప నిద్రించేవాని అభ్యుదితుడనీ, ప్రొద్దు క్రుంకేటప్పుడు నిద్రించేవానికి అభినిర్ముక్తుడనీ పేరు. సహజంగా ప్రసన్నమయిన చేయి గనుక భావముమీద మరికొంత ప్రభుత్వము సంపాదించి, సంస్కృత పదాలమీద వ్యామోహం తగ్గించుకుంటే రంగారావుగారింకా మేలైన రచనలు చేయగలరని చెప్పవచ్చు.

## వేదవతి

[నాటకము. కర్త. శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావుబహద్దూర్ జమీందారుగారు, గంపలగూడెం, కృష్ణాజిల్లా. 63 పు. వెల: ఒక రూపాయి]

పాత్ర హృదయము నావిష్కరించుటయే కష్టము. రావణునివంటి 'తెలిసిన మూర్ఖు'ని హృదయమును అనుగమించి తెలియజెప్పుట మరింత కష్టము. మును పివ్వవో 'అభినవ పాండవీయ'మను నాటకమును 'యౌవనవిగర్హణ'మను కావ్యమును, 'బెబ్బులి' నాటకమును, మొన్న మొన్న 'దేవదాసి' యను నాటకమును వ్రాసిన శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దూర్ గారు ఈ వేదవతి యను నాటకమున రావణహృదయ స్వరూపము నావిష్కరించినారు. కుశధ్వజ మహర్షి కుమార్తె వేదవతి. ఎందరో దేవతలు రాక్షసులామెను కల్యాణమాడగోరిరి. కుశధ్వజుడామెను శ్రీహరి కిచ్చెదననెను. ఆమెను గోరిన దంభుడను రాక్షసుడాతని జంపెను. ఆ పాపమునకే వాడును జచ్చెను. తండ్రి చిత్తము ప్రకారము వేదవతి శ్రీహరిని పతిగా గోరి తపశ్చర్య బూనెను. బ్రహ్మవర దర్పితుడైన రావణుడొకసారి యామెను జూచి కామించి వేణీగ్రహణ మొనర్చెను. వేదవతి కుపితురాలై 'సహోదరాప్త సంతానముతో నిన్నొరిగొనగా నాశమయ్యెద' వని యోగాగ్నిదగ్ధయయ్యెను. ఆమె స్త్రీ శిశువుగా లంకాపరిసరములందొక తామరపూవున గన్పింపగా

రావణుడామెను పెట్టెలో బెట్టించి సముద్రమున త్రోయించెను. పిదప ఆమెయే సీతగా నాగటి చాలులో జనకమహారాజునకు దొరికినది. సీత కారణముగా రావణ వధ జరిగినకథ అందరెరిగినదే.

నాలుగంకములుగా నున్న ఈ నాటకములో ప్రథమాంకమున రావణుడు వేదవతిని కామించి శపునొందుట. రెండవయంకమున చెలికత్తెలైన శూర్పణఖ మున్నగువారిని పొరపాటున జంపిన రావణుడు చింతించుచుండగా స్వప్నంలోని స్వప్నాంతరమున ఆదిశక్తి యావిర్భవించుట ఆమె నెరిగి సీతను సముద్రమున త్రోయించుట, తృతీయాంకమున మండోదరీసహితుడైన రావణుడు నారదుని వలన సీతారాముల కల్యాణమును గూర్చి వినుట, శివధనుర్భంగము చేసిన రామునిపై పరశురాముని పురికొల్ప శుకసారణులను నియోగించుట, చతుర్థాంకమున మిథిలలో రావణుడు దశరథరామ భార్గవరాముల సమావేశము వీక్షించుట, పరశురాముని తేజశ్శక్తి పరిహృతమగుట, సీతారాముల కల్యాణము నున్నవి. రావణుడు డిగుభకుడు. మంగళాశాసనము చేసిన ఈ పద్యము నాటక కర్త దృష్టిని చక్కగా చూపుచున్నది.

"వెనుక ముందు లెరిగి మొనగాని తనమూని
పరమపదము నొసగ పంక్తిముఖుడు
తనమనః పవిత్రతను వెల్లడించిన,
వను దశూర్ధ్వదృష్టి మనుచు గాత!"

శక్తిమంతమైన రచన. రావణవ్యక్తిత్వావిష్కారము, ప్రదర్శనయోగ్యముగనుంచుట-అనునవి ఈ నాటకములోని గొప్పలక్షణములు.

## సారంగి

(మాసపత్రిక, సంవత్సరం చందా: 8 రూ. విడి సంచిక 60 న. పై. ప్రాప్తిస్థానం: 196, లాయిడ్స్ రోడ్డు, మద్రాసు-6.)

శ్రీ తుమ్మలపల్లి సీతారామరావుగారి సంపాదకత్వాన 'సారంగి' అనే సారస్వత కళా సాంస్కృతిక మాస పత్రిక తొలి సంచిక మా కార్యాలయం చేరింది. శ్రీయుతులు నిడదవోలు వేంకటరావు, విఠల్ దేవుని సుందరశర్మ, కొడవటిగంటి కుటుంబరావు, పి. వి. రమణ, మధురాంతకం రాజారాం, సోమసుందర్. లోలభట్టు శివరామకృష్ణంరాజు, భగవచ్ఛరణ పట్నాయక్, వి. ఎస్. అవధాని, డాక్టర్ వి. రాఘవన్, గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్య, హరి తపగార్ల రచనలు దీనిలో ఉన్నవి. మూడుకోట్ల చిల్లర జనాభాగల తెలుగునాడుకు ఇలాంటి పత్రికలు ఎన్నైనా కావాలి. ఈ సారంగికి మా స్వాగతం.

## గ్రంధ స్వీకారం

### కవిరాజశిఖామణి

రచయిత: శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్య. ప్రథమభాగం. పుటలు: 200. వెల: రెండున్నర రూపాయలు. ప్రాప్తి స్థానం: సారస్వత కుటీరం, మద్రాసు—21.

### నష్టతంతువు

వ్యాస సంపుటి. రచయిత: డాక్టర్ యస్వీ జోగారావు. పుటలు: 168. వెల: రెండున్నర రూపాయలు. ప్రాప్తిస్థానం: యం. యస్. ఆర్. మూర్తి అండ్ కో, బుక్ సెల్లర్స్, విశాఖపట్టణం-2.

### మాట—మన్నన

రచయిత: శ్రీ గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్య. పుటలు: 70, వెల: ఒక రూపాయి. ప్రాప్తిస్థానం: దేశి కవితామండలి, విజయవాడ-2.



**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad**